# ఉపనిషత్సుధ


రచన

డా॥ ఇలపావులూరి పాండురంగారావు



ప్రచురణ




రిజిష్టర్డ్ నెం: 1/64

యువభారతి

సాహితీ సాంస్కృతిక సంస్థ

5 కింగ్స్‌వే, సికిందరాబాదు-3

UPANISHAD SUDHA — An Introduction to the essence of Eleven Upanishads.



యువభారతి

ప్రచురణ సంఖ్య : 84

ప్రథమ ముద్రణ : డిసెంబరు 5, 1982

ప్రతులు : 2,200

ముఖపత్ర రచన :
శ్రీ శీలా వీర్రాజు

ముద్రణ :
పద్మావతీ ఆర్ట్స్ ప్రింటర్స్,
హైదర్‌గూడ, హైదరాబాద్.

ప్రతులకు :

యువభారతి
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-500003 లేదా
యువభారతి కార్యాలయం
ఆంధ్ర సారస్వత పరిషత్ భవనములు
తిలక్ రోడ్డు, హైదరాబాదు-500001

వెల : రు. 6-00



# యువభారతి పరిచయం

మనిషిలో అంతర్లీనంగా నిక్షిప్తంగా ఉన్న ప్రతిభాపరిమళాలు పరివ్యాప్తం కాగలిగినప్పుడే అతని సృజనాత్మకశక్తికి సార్థక్యం చేకూరుతుంది. సమాజంలో సౌందర్యం, సౌజన్యం పెంపొందటానికి అనువైన వాతావరణం ఏర్పడుతుంది. పరస్పరావగాహనం జరుగుతుంది. నిర్మాణాత్మక దృక్పథాలకు ప్రాచుర్యం లభిస్తుంది. సమైక్యభావాలు కుదురుకుంటాయి.

యువభారతి కడచిన పందొమ్మిదేళ్ళుగా సమాజంలో సామరస్యాన్ని పెంపొందించేందుకు సాహిత్యంకంటె ఇతరమైన సాత్త్విక సాధనం లేదనే విశ్వాసంతో ఇతోధిక కార్యక్రమాలు రూపొందించి కృషి చేస్తున్నది. సాధ్యమైనంత తక్కువ వెలకు వీలైనంత ఎక్కువ మందికి ఉత్తమ సాహిత్యాన్ని అందజేస్తే సాహిత్యంపట్ల ప్రజానీకానికి అనురక్తి పెరుగుతుందనే నమ్మకంతో ప్రచురణ కార్యక్రమాన్ని చేపట్టింది. ఇంతవరకు 63 పుస్తకాలను ప్రచురించి మూడు లక్షల ప్రతులకు పైగా సాధ్యమైనంత తక్కువ వెలకు తెలుగు పాఠకులకు అందించ ప్రయత్నించింది.

భారత దేశంలో ఎక్కడున్నాసరే యువభారతి నిర్వహిస్తున్న సాహిత్యోద్యమంలో పాలుపంచుకునేందుకు ప్రారంభింపబడిన సాహితీమిత్ర పథకంలో 7,800 మంది సహృదయులు చేరి ప్రణాళికను విజయవంతం చేసినారు. యువభారతి భవిష్యన్నిర్మాణంలో సహకరించేందుకు ఆరంభింపబడిన సభ్యత్వ పథకాలలో భారతీమిత్రులుగా 776 మంది, భారతీభూషణులుగా 100 మంది చేరారు.

ఉత్సాహభక్తితో మేము చేస్తున్న భాషాసేవకు అండదండలుగా నిలిచారు ప్రజలు వారి సౌహార్దం, భాషాప్రియత్వం ఇవే మా పెట్టుబడి. మా తపస్సు ఫలించి తెలుగుదేశంలో అధ్యయనశీలత, సౌజన్యం పెంపొందాలని ఆకాంక్షిస్తున్నాము.

సహృదయుల సహకారాన్ని అర్థిస్తూ—

హైదరాబాదు,
డిసెంబరు 6, 1982

ఇరివెంటి కృష్ణమూర్తి,
అధ్యక్షుడు: యువభారతి.



యువభారతి సహృదయుల ప్రోత్సాహాన్ని ఆశిస్తున్నది సాహిత్యాన్ని సామాన్యులకు సైతం అందించి, సమాజంలో మంచిని పెంపొందించాలనే సత్సంకల్పముతో యువభారతి స్థాపించబడింది. యువభారతితో సర్వులూ సాహితీ బాంధవ్యాన్ని పటిష్టం చేసుకొనాలనే ఉద్దేశ్యంతో ''సాహితీమిత్ర'' సభ్యత్వ పథకాన్ని చేపట్టి ఎందరినో సాహితీ మిత్రులుగా తీర్చి దిద్దింది.




యువభారతి భారతీమిత్ర పథకం :-

ప్రతి సంవత్సరం రూ॥ 10/- చందా చెల్లించి సాహితీ మిత్రులుగా పరిగణించబడే కంటే, ఒకేసారి ''నూట పదహార్లు'' అందించి శాశ్వత సభ్యులుగా చేరి యావజ్జీవితం యువభారతినుండి సదుపాయాలనందుకో గలరనే ఉద్దేశ్యంతో రూపొందించబడినదే ''భారతీ మిత్ర'' సభ్యత్వ పథకం.

భారతీ మిత్రులు కావాలంటే :-

* కేవలం రూ॥ 116/-లు చెల్లించటంతో మీరు శాశ్వతంగా యువభారతి ''భారతీ మిత్రులు''గా పరిగణించ బడతారు. పై మొత్తాన్ని ఒకేసారి చెల్లిస్తే మంచిది.
* ఒకేసారి రూ॥116/-లు చెల్లించలేకపోతే మొదటి వాయిదాగా రూ॥16/-లు చెల్లించి మిగిలిన మొత్తాన్ని నెలకు రూ॥ 10/-ల చొ॥న పది సమానమైన వాయిదాలలో చెల్లించవచ్చు.
* మొదటి వాయిదా రూ॥ 16/-లు చెల్లించగానే మీకు ''భారతీ మిత్ర'' సభ్యత్వ సంఖ్య కేటాయించబడుతుంది. యువభారతి ప్రచురణలనుండి మీరు ఎన్నుకొన్న రూ॥ 1 /-ల విలువగల పుస్తకాలను అందుకుంటారు.
* మొత్తం రూ॥ 116/-లు చెల్లించిన వారు మాత్రమే యువభారతి ''భారతీ మిత్రులు''గా పరిగణింపబడతారు

పూర్తి సభ్యత్వం చెల్లించి భారతీ మిత్రులయితే మీకు :-

* ''భారతీమిత్ర'' గుర్తింపు కార్డు అందజేయబడుతుంది.
* ప్రతి సంవత్సరం రూ॥ 12/-ల విలువగల యువభారతి ప్రచురణలు (ప్రచురణలపై పేర్కొన్న వెల ప్రకారం) జీవిత పర్యంతం అందజేయ బడతాయి.

గమనిక : పుస్తకాలు పోస్టులో పొందగోరే మిత్రులకు రూ॥ 12/- విలువగల పుస్తకాలను పోస్టేజిమేరకు అందే దాదాపు రు 2-00లకు వి.పి.పి లో

పంపించడం జరుగుతుంది. మిత్రులు ఆ మొత్తాన్ని చెల్లించి తమ భారతీమిత్ర సభ్యత్వ పుస్తకాలను విడిపించుకో మనవి. పుస్తకాలు మిత్రులకు భద్రంగా చేరేందుకు వీలుగా ఈ చిన్న మార్పు చేయడం జరిగింది. స్థానికేతరులైన భారతీమిత్రులు దీనిని గమనించి సహకరించ ప్రార్థన.

* యువభారతి ప్రచురణల నన్నింటినీ 25% మినహాయింపుతో మీ సొంతం చేసుకొనే సదుపాయాన్ని శాశ్వతంగా పొందవచ్చు. పోస్టేజీ అదనం అని గమనించండి.



## ''భారతీ భూషణ'' సభ్యత్వ పథకం

వదాన్యులయిన సాహితీ బంధువులు తమ సహాయ, సహకారాలను పెద్ద మొత్తంలో అందించి యువభారతి కార్యక్రమాలకు ఊపిరిని, ఉత్సాహాన్ని అందించి ప్రోత్సహించేందుకు యువభారతి ''భారతీ భూషణ'' పథకాన్ని ప్రారంభించింది.

**భారతీ భూషణులు కావాలంటే :-**

రూ॥ 1,116/-లు గాని అంతకు మించిగాని, మొత్తాన్ని ఒకేసారి లేక పది సమాన వాయిదాలలో అందించినవారిని భారతీ ''భూషణు''లుగా సమాదరిస్తుంది. ఇలా పెద్దమొత్తంలో విరాళమిచ్చిన 'భారతీ భూషణులకు'

* సభ్యత్వం పూర్తిగా చెల్లించినవెంటనే ''భారతీ భూషణ'' గుర్తింపు ఫలకం అందజేయబడుతుంది.
* యువభారతి కార్యక్రమాల గురించి అన్ని వివరాలూ ఎప్పటికప్పుడు తెలియజేయడం జరుగుతుంది.
* యువభారతి వెలువరించే అన్ని ప్రచురణలనూ, భారతదేశంలో ఎక్కడ ఉన్నా సరే శాశ్వతంగా ఉచితంగా అందించటం జరుగుతుంది.

గమనిక:- విదేశాలలో ఉండే భారతీ భూషణులు పోస్టు ఖర్చులు తామేభరించాలి.

* యువభారతి ఉపన్యాస కార్యక్రమాలలో మీరు ప్రత్యేక ఆహ్వానితులుగా పాల్గొన వచ్చును.

మా స్నేహాహ్వానాన్ని స్వీకరించండి! భారతీ మిత్రులుగా, భారతీ భూషణులుగా చేరండి! యువభారతి సుస్థిర భవిష్యత్ కార్యక్రమాలకు మీ చేయూత నందించండి.

వివరాలకు: యువభారతి, 5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3 లేదా
యువభారతి కార్యాలయం, ఆంధ్ర సారస్వత పరిషత్
భవనములు, తిలక్‌రోడ్, హైదరాబాదు-500001.



# మా మాట

భారతీయుల తత్త్వ జిజ్ఞాసకు ప్రతీకలు ఉపనిషత్తులు. జీవునికీ, దేవునికి మధ్య ఉన్న అంతర్యాన్ని, సత్యగవేషణా దృక్పథాన్ని, మహోన్నత జీవితా దర్శాన్ని విశ్లేషిస్తాయి ఉపనిషత్తులు. దేశ కాల పాత్రలకు అనుగుణంగా మారుతూ ఉండే కర్మలను చూసి అవే ఆర్షతత్త్వ విధానాలని అనుకోవడం పొరపాటు. భారతీయ ఆర్షతత్త్వాన్ని సూక్ష్మంగా తెలియచెప్పే సామర్థ్యం ఉపనిషత్తులకే ఉన్నది. ఉపనిషత్తుల్లో తాత్త్వికాంశాలు ప్రతీకాత్మంగా ప్రబోధితములైనవి. ఎంతో పాండిత్యం, ఎంతో శ్రద్ధ, ఎంతో జిజ్ఞాస ఉంటేనేగాని ఉపనిషత్తుల్లోని రహస్యాలు మనకు అవగతం కావు.

భారతీయ తత్త్వవివేచనకు ఉపనిషత్తుల అధ్యయనం అనివార్యం. ఈశావాస్య, తైత్తరీయ, ఛాందోగ్య, బృహదారణ్యక, మాండూక్య, కేన, ఐతరేయాది ఉపనిషత్తులు అనేకంగా ఉన్నవి. వాటినిగూర్చి స్థూలంగానైనా ప్రతి అధ్యయన శీలుడు తెలుసుకోవలసిన అగత్యం ఉన్నది. అవేవో పాత పుస్తకాలని, అందులోని భావాలు నేటి తరానికి అనావశ్యకములని, రేఖా మాత్రంగానైనా తెలుసుకోకుండా అనకూడదు.

యువభారతి అందిస్తున్న ఈ "ఉపనిషత్సుధ" ఉపనిషత్తుల స్వరూప స్వభావాలను సరళంగా తెలుపగలుతున్నది.

ఈ పుస్తకాన్ని మా యువభారతికి వ్రాసియిచ్చి ప్రచురించుకునే అవకాశాన్ని కల్పించిన డా॥ ఇలపావులూరి పాండురంగారావుగారికి మా భక్తిపూర్వక అభినందనాలు. డా॥ పాండురంగారావుగారు సంస్కృత, ఆంధ్ర, హిందీ, ఇంగ్లీషు భాషలలో చక్కని అభినివేశం సంపాదించిన పండితులు. హిందీలోనూ, తెలుగులోనూ కావ్యాలను రచించినారు. ఇంతకుపూర్వం సూరదాసు కవితావైభవాన్ని మాకు వ్రాసియిచ్చి మాతో సహకరించిన సహృదయులు. ఆర్షవిజ్ఞాన ప్రసరణకు ఆయన చేసిన, చేస్తున్న సాహితీ తపస్సు అభివంద్యం. డా॥ పాండురంగారావుగారికి మా ధన్యవాదాలు

డిసెంబరు 5, 1932
హైదరాబాదు.

ఇరివెంటి కృష్ణమూర్తి
అధ్యక్షుడు: యువభారతి.

# ఉపాయనం

ఆత్మ నిత్యం. అదే సత్యం, మిగిలినదంతా అనిత్యం, అసత్యం. కాని నిత్య సత్య సందీప్తమైన ఆత్మను అస్థి చర్మమయమయిన శరీరం ఆవరించి ఉన్నందువల్ల ఆవరణలోనే ఆనందం ఉన్నట్టు అనిపిస్తుంది. అలా అనిపించే ఆనందాన్ని అధిగమించి అవల కనిపించే ఆనందాన్ని ఆత్మగతం చేసుకొనటమే జీవిత పరమావధి. దీనినే మహర్షులు తపస్స్వాధ్యాయ సహకారాలతో సాధించారు. ఈ సాధన సంపత్తిని సామాన్య మానవులకు కూడా అందుబాటులో ఉండేటట్టు అందరికీ అర్థమయే భాషలో చెప్పాలని తత్త్వవేత్తలు ప్రయత్నించారు. ఆ ప్రయత్నానికి ప్రతిఫలమే ఉపనిషద్వాఙ్మయం. యుగయుగాలుగా మహర్షులు చేసిన మహత్తరమైన మనోమంథనకు పర్యవసానంగా ఆవిర్భవించిన ఆలోచనామృతమే ఉపనిషత్సాహిత్యం. అందుకనే ఉపనిషత్తులోని మాటలు మామూలు మాటలుగా కాక మంత్రాల మూటలుగా భావించటం భావయోగులకు భావ్యమని తోచింది.

ఇలాంటి భావాలను మరోభాషలో మరోవిధంగా మార్చిచెప్పటం కష్టం. ఆ భావాలను ఆ మాటల్లోనే విని ఆనందించాలి. చదువుకొని ఆస్వాదించాలి. కాని యీ మాటలుకూడా ప్రస్తుతం అందరికీ అందుబాటులో లేకపోవటంవల్ల ఆ మాటలను జాగ్రత్తగా గమనించి వాటినే అనుగమించి ఉపనిషత్సుధా రాశికి ఈ చిన్న ఉపాయనం సమకూర్చటం జరిగింది. వందకు మించిన ఉపనిషత్తులను వెలయించిన అక్షరభారతి వేదమండలానికి క్షీరసాగరం లాంటిది. అందులోనుంచి అందుకోగలిగినంత అక్షరసుధను సేకరించి అందులో అందరికీ అందించగలిగినంతవరకు అందించాలనే ఆరాటానికి అక్షరాకృతి యీ 'ఉపనిషత్సుధ'.

ఇందులో ఈశ, కేన, కఠ. ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, శ్వేతాశ్వతర, ఛాందోగ్య, బృహదారణ్యకములనే పదకొండు ఉపనిషత్తుల సారం ఉంది. వీటినే వేదాంత పరిభాషలో చెప్పకుండా త్యాగం-భోగం, ఇహం-పరం, అన్నం-ఆనందంలాంటి మామూలు మాటల్లో చెప్పేందుకు ప్రయ

ర్శించడం జరిగింది. సాధ్యమైనంతవరకు స్వకపోల సహకారం లేకుండా మహర్షుల భావాలను యథాతథంగా అందించటమే ఆదర్శమయిందని చెప్పవచ్చు. ఉపనిషద్వాఙ్మయం సుధానిధి. ఇది కేవలం సుధాసృతి. ఆ నిధిని ఎలా చేరుకోవాలో దానికి దారి చూపించేందుకు ఈ సుధాబిందువులు సహకరించగలిగితే చాలు.

ఈ కృతికీ, ఆవిష్కృతికీ మూలకారకులు యువభారతీయులు. పరమార్థ రసజ్ఞులు, యువభారతి అధ్యక్షులు ఆయిన మిత్రులు డాక్టర్ ఇరివెంటి కృష్ణమూర్తి గారు నన్నీ పుస్తకం వ్రాయవలసిందని వాఙ్మనఃపూర్వకంగా ప్రేరేపించినందుకు ఇది ఫలశ్రుతి. వారితోపాటు మన యువభారతీయులూ, ఆంధ్రభారతీయులూ ఆరాధించే అక్షర భారతికి ఈ చిన్న పుస్తకం ఉపాయనంగా ఉపకరించగలదని ఆశిస్తూ పరమేశ్వరి అనుగ్రహం అందరికీ కావాలని అర్థిస్తున్నాను.

తన్మామవతు తద్వక్తారమవతు

అవతుమామ్, అవతు వక్తారమ్

ఓం శాంతిః శాంతిః శాంతిః

క్రొత్త ఢిల్లీ
4-11-82

ఇలపావులూరి పాండురంగారావు

# వేదం - వేదాంతం

*"వేదాంతకృద్వేదవిదేవ చాహం" - గీత (15-15)*

ప్రపంచంలో ప్రతి జీవికి జీవిత పరమార్థం బోధపడదు. బోధపడటం లేదనే బాధ కూడా చాలా మందికి ఉండదు. నూటికి, కోటికి ఏ ఒకరికో ఇలాంటి బాధ ఏర్పడుతుంది. అదే పరమార్థ బోధకు ప్రథమ సోపానం. కడుపునిండా తిండి, కంటినిండా నిద్ర, ఒంటినిండా దుస్తులు, ఇంటినిండా పిల్లలు, కళకళ లాడే కళత్రం, తళతళలాడే వస్తువాహనాలు - ఇంతకుమించి జీవితంలో మరో పరమార్థం లేదని చాలా మంది భావిస్తారు. కొంతవరకు అది నిజమే. అదికూడా ఒక జీవిత దర్శనమే. కాని అంతటితో జీవితం సార్థకం కాదనే విషయం జీవిత పరమార్థాన్ని అర్థంచేసుకోవాలని ఆరాటపడే ఆలోచనాపరులకు బోధపడుతుంది. ఆలోచన మానవ లక్షణం. ఏది ఎలా కనిపిస్తే దాన్ని అలాగే భావించి, ఏది మంచిదనిపిస్తే దాన్ని స్వేచ్ఛగా సేవించటం సామాన్యజీవి స్వభావం. కాని కంటికి కనిపించేది, చెవికి వినిపించేది, మనస్సుకు అనిపించేది ఆ రూపంలో అలా ఎందుకు ఉంది, ఎలా ఉంది, ఎంతకాలం ఉంటుంది, ఆ తర్వాత అది మరో రూపంలో ఉంటుందా, అసలు రూపమే మాసిపోయి మాయమయిపోతుందా, కలకాలం నిలిచేది, నిలబెట్టేది అసలీ ప్రపంచంలో ఏమయినా ఉన్నదా, ఉంటే అది మనకు కనిపిస్తుందా, కనీసం మనకు బోధపడుతుందా అన్న ప్రశ్నలు ఒకదానివెంట ఒకటి ఆలోచించగల మనస్సులో ఉదయిస్తాయి. వీటికి సరియైన సమాధానాలు స్ఫురించటంతో నిర్వేదం వేదంగా మారుతుంది. తెలుసుకోవలసిన విషయం తెలియనంతవరకు జీవితంలో నిర్వేదం వ్యాపించి ఉంటుంది. దాన్ని తెలుసుకుంటే అదే వేదమవుతుంది. వేదమంటే తెలివి, ఎఱుక, వివేకం. తన ఉనికిని తాను తెలుసుకోవటం, తనతోపాటు తన ఆనందానికీ, ఆలోచనకూ, ఆవేదనకూ, అందదండగా ఉండే చరాచర జగత్తుకూ, తనకూ ఉన్న సంబంధాన్ని సమగ్రంగా గుర్తించి ప్రవర్తించటం వేదవాఙ్మయం మనకు ప్రసాదించిన విజ్ఞానం.

వేదాలు ప్రపంచానికి చాటి చెప్పిన పరమసత్యం వేదర్షులు పొందిన ఏకాంతరసానుభూతికి నిత్యనిదర్శనం. బంగారుకిరణాలతో ప్రపంచాన్ని పరవశించి పరిభ్రమింపజేసే ప్రభాకరుని ప్రాభవం, ఆ కాంతి కిరణాలనే తన హృదయంలో ప్రతిబింబింప జేసుకొని చల్లని వెన్నెలలు వెలయించే జాబిల్లి సౌహార్దం, ఇంటికీ, ఒంటికీ వెచ్చదనం, చురుకుదనం పంచిపెట్టే అగ్నిహోత్రుని అనుష్ఠాన నిష్ఠ, కమ్మని తియ్యని వాసనలను ప్రపంచం నలుమూలలా వెద జల్లుతూ కంటికి కనిపించకుండానే కంటిరెప్పలా వెంటనే ఉండి కాపాడే స్వచ్ఛమైన ప్రాణవాయువు, నింగిని చూచి పొంగిపోయే కడలి కెరటాలు, కెరటాల కోసం ఆరాటపడే కాంతి కిరణాలు, ప్రపంచంలోని ప్రతి శబ్దాన్ని తనలో ఇముడ్చుకొని కూడా బయటికి ఏమీ తెలియనట్టు కనిపించే అమాయకమైన ఆకాశం, పొడిపొడిగా విడిపోతున్న భూమ్యాకాశాలను చూచి సహించలేక కింది నుంచి పైకి, పైనుంచి కిందికి రస సంచారం చేసే నిర్మల జలధారలు, జీవ కోటికి జీవం పోసేందుకు జీవించే చిత్ర విచిత్ర వన సంపద- ఇవన్నీ మహర్షుల మనస్సులను మనీషకు మహాలయాలు చేశాయి. ఈ మహాలయాలలో ఉదయించిన పదసంపదే వేదం.

తన తనువు తనది కాదనిపించే తన్మయస్థితిలో అప్రయత్నంగా ఆవిర్భవించిన ఆనందలహరి అవటంచేత వేద వాక్కును అపౌరుషేయమన్నారు. వాక్కుకు, మనస్సుకు అందని అలౌకిక రసానుభూతిని అందుకొని ఆ సమాహిత స్థితిలోనే దాన్ని పలకరించుకొని పలికిన పలుకులు కావటంవల్ల ఇవి సామాన్య సారస్వతకోటికి చెందినవి కావని భావించటం జరిగింది. అది భావ్యమే. పారవశ్యంలో వినిపించిన పరమసత్యం కాబట్టి దీన్ని 'శ్రుతి' అన్నారు. తనంతట తాను తెలియవచ్చిన తత్త్వం కాబట్టి 'నిగమం' అన్నారు. ఏ పేరుతో పిలిచినా వేద వాఙ్మయం లౌకిక సారస్వతానికి భిన్నంగా లోకోత్తర రసానుభూతిని అందజేసే విలక్షణ వాగ్విభూతి అనిమాత్రం చెప్పవచ్చు.

వేద విజ్ఞానం అనంతం. అసలు జ్ఞానమే అనంతం. సత్యాన్ని చెప్పేది జ్ఞానం. భూత భవిష్యద్వర్తమానాలకు అతీతమై నిలిచేది సత్యం. కాబట్టి సత్యం, జ్ఞానం రెండూ అంతులేనివి. అంతులేని వాటికి ఆది కూడా ఉండదు. వేదం ఈ రెంటితో ముడిపడి ఉన్నది కాబట్టి వీటిలాగే అది కూడా అనాది, అనంతం. వేద కాలంలో కొందరు మహర్షులకు ఈ అనంత సత్యాలు స్ఫురించాయి. ఆ సుర్ఫ

ణకు వాక్కు లభించింది. ఆనాటినుండి మనకు ఆ వాక్కు వినిపిస్తూ ఉంది. కాని ఆ వాక్కు ప్రతిపాదించిన సత్యం అంతకుముందే ఉంది. అందువల్ల అది అనాది. వాగ్రూపంలో ఈ సత్యం ఎన్ని రకాలగానో వెలువడవచ్చు. అసలు వేదం జ్ఞానమయమే అయినా ప్రస్తుతం మనం వాఙ్మయమనే భావంతోనే దాన్ని సేవిస్తున్నాం. తాత్త్వికంగా చూస్తే మన వాక్కే ఋగ్వేదం, మన మనస్సే యజుర్వేదం, మన ప్రాణమే సామవేదం అని బృహదారణ్యకం ఘోషిస్తుంది. వేదం, వేదాంతం, వేదవేత్త-మూడూ నేనేనని గీతాచార్యుడు అంటాడు. ఈ దృష్టితో చూస్తే 'సర్వం వేదమయం జగత్' అనిపిస్తుంది.

ప్రపంచంలోని ప్రతికణంలో ప్రచ్ఛన్నంగా ఉన్న యీ పరమార్థ తత్త్వాన్నే వేదాలు విడివిడి మాటల్లో విప్పి చెప్పాయి. అనంతంగా విస్తరించిన వేద వాఙ్మయాన్ని, సులభంగా అవగాహన చేసుకొనేందుకు, నాలుగు భాగాలుగా విభజించారు. వాటికే ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అథర్వణ వేదం అని పేరు పెట్టారు. ఋగ్వేదంలో ముఖ్యంగా ప్రపంచంలో కనిపించే దివ్య తేజస్సును దేవతారూపంలో భావించి ఆయా దేవతల అనుగ్రహం కోసం కూర్చబడిన ప్రార్థనలు, స్తోత్రాలు ఉంటాయి. వీటినే ఋక్కులన్నారు. యజుర్వేదంలో యజ్ఞయాగాదులకు సంబంధించిన కర్మకాండ ఎక్కువగా కనిపిస్తుంది. సామవేదంలో ప్రపంచంలోని ప్రాణశక్తిని ప్రాణవాయువులో ప్రతిష్ఠింప జేసుకొని హాయిగా శ్రావ్యంగా సౌమ్యంగా పాడుకొనేందుకు అనువయిన ఆనంద గీతికలు వినిపిస్తాయి. వేదర్షులు లౌకిక జీవితాన్ని ఉపేక్షించలేదనేందుకు అథర్వణ వేదం నిదర్శనం. మానవ జాతి అభ్యుదయానికి, శ్రేయస్సుకు, ప్రేయస్సుకు కావలసిన మంత్ర సంపుటి యీ వేదంలో కనిపిస్తుంది. కొందరు అథర్వణ వేదాన్ని అపౌరుషేయమైన శ్రుతిలో భాగంగా పరిగణించరు. ఋగ్యజుస్సామాలనే వాళ్ళు అంగీకరించి వాటిని 'త్రయి' అంటారు. కాని, నిజానికి వేదవాఙ్మయంలో వీటన్నిటికీ సమానమయిన స్థానం ఉంది. అసలు వేదర్షుల ఆర్య దృష్టికి ఇహం, పరం రెండూ ప్రధానంగా కనిపిస్తాయి. ఇహపరాలు ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉంటాయి. శరీర సహకారంతోనే అశరీర తత్త్వాన్ని సాధించాలి. అందువల్ల నాలుగు వేదాలకూ సమానమైన ప్రాధాన్యం, ప్రామాణ్యం ఇవ్వటమే సమంజసం.

నాలుగు వేదాల్లో ఒక్కొక్క వేదం శాఖోపశాఖలుగా విస్తరించింది. కాలక్రమంలో వాటికి ప్రత్యేకమైన స్థానం ఏర్పడింది. ఇలా ప్రతి వేదంలో నాలుగు

భాగాలు ఏర్పడ్డాయి-మంత్రభాగం (లేక సంహిత), బ్రాహ్మణ భాగం, ఆరణ్యక భాగం, ఉపనిషద్భాగం. సంహిత అనబడే మంత్రభాగంలో కేవలం మంత్రాలు ఉంటాయి. ఈ మంత్రాలను వేరు వేరు ఉపాసనల్లో కర్మకాండలో ఎలా ఉపయోగించుకోవాలి, వీటిలోని అంతరార్థం ఏమిటి, ప్రయోజన మేమిటి అనే విషయాలు బ్రాహ్మణభాగంలో ఉంటాయి. ఈ భాగాన్ని ఉపయోగపెట్టుకొనే పండితులకు కాలక్రమంలో బ్రాహ్మణులనే పేరు వచ్చి ఉండవచ్చు. బ్రాహ్మణ సాహిత్యమంతా బ్రహ్మపదార్థానికి సంబంధించిందని కూడా చెప్పవచ్చు. బ్రహ్మ శబ్దానికి మంత్రమనే అర్థం కూడా ఉంది. బ్రహ్మస్వరూప మయిన మంత్రానికి వ్యాఖ్యానం చేసేవి కాబట్టి వీటికి బ్రాహ్మణ గ్రంథాలు అని ప్రసిద్ధి వచ్చింది. మూడవది ఆరణ్యకం. ఇంటికి కొంచెం దూరంగా ఏ తోటలోనో, అడవిలోనో ఏకాంతంగా కూర్చుని జీవిత పరమార్థాన్ని గురించి ఆలోచించి తమ ఆలోచనలను శబ్దరూపంలో వ్యక్తపరచిన మహర్షుల మాటలు (మంత్రాలు) ఈ భాగంలో ఉంటాయి. ఈ ఆరణ్యకాలే క్రమంగా ఉపనిషత్సాహిత్యానికి దారి తీశాయి. ఈ నాలుగు భాగాల్లో చివరిది ఉపనిషద్భాగం. కనకనే దీన్ని 'వేదాంతం' అని కూడా అంటారు. మంత్రాలు, తంత్రాలు, యజ్ఞాలు, యాగాలు, క్రతువులు, కీర్తనలు – వీటన్నిటివల్ల సాధించేది యేమిటి, పరమ సత్యాన్ని ప్రతిపాదించేందుకు పరమఋషులు పలికిన పలుకులకు సారాంశం ఏమిటి అని కూలంకషంగా చర్చించి చివరకు తేల్చిన నిష్కర్ష ఉపనిషద్వాఙ్మయంలో కనిపిస్తుంది. అందువల్లనే ఉపనిషద్దర్శనాన్ని 'శ్రుతి శిరస్సు' (వేద వాఙ్మయానికి తల వంటిది) అన్నారు. వేదంలోని నాలుగు భాగాలకు చివరిది అవటమే కాక సారభూతమైనది కాబట్టి ఉపనిషత్తులను సామూహికంగా 'వేదాంతం' అని వ్యవహరించటం జరిగింది.

'ఉపనిషద్' అనే శబ్దమే చాల విచిత్రమైనది. ఇందులో సత్ (లేక సద్) మూల శబ్దం. ఇది 'సద్' అనే ధాతువు నుంచి ఏర్పడింది. 'సద్' అంటే కూర్చుండుట, కదలుట, ఆశ్రయించుట, నిర్మూలించుట అనే అర్థాలు ఉన్నాయి. మొదటి అర్థం 'కూర్చుండుట' అది తీసుకొని చాలమంది దీనికి బ్రహ్మవేత్తకు సమీపంగా నిష్ఠతో కూర్చుని బ్రహ్మపదార్థాన్ని అవగాహనం చేసుకునేందుకు ఉపకరించే సారస్వతం అని అర్థం చెప్పారు. 'సద్' అనే ధాతువుకు 'ఉప', 'ని' అనే రెండు ఉపసర్గలు ముందు చేరాయి. 'ఉప' అంటే సమీపం (దగ్గర)

అని అర్థం. 'ని' అంటే నిశ్చయం, నిష్ఠ అని స్థూలంగా అర్థం చెప్పుకోవచ్చు. ఇలా ధాత్వర్థంతో చూస్తే 'ఉపనిషద్' శబ్దానికి ఈ అర్థం బాగానే సరిపోతుంది.

కాని, శంకర భగవత్పాదులు 'సద్' అనేధాతువుకు నిర్మూలించుట అనే అర్థాన్ని గ్రహించి అజ్ఞానాన్ని నశింపజేసి జ్ఞానాన్ని ప్రకాశింపజేసేది ఉపనిషత్తని వ్యాఖ్యానించారు. ''ఉపనిషత్తులలో ఇమిడియున్న యీ బ్రహ్మ విద్యను సమీపించగానే శ్రద్ధాభక్తి సంపన్నులయిన ఆత్మవంతులకు తల్లి గర్భంలో మగ్గుట, పుట్టుట, ముసలితనంలో క్షీణించుట, నానావ్యాధులతో బాధపడి మరణించుట మొదలయిన అనర్థాలు తొలగి మరల మరల పుట్టేందుకు మూలకారణమైన అవిద్య నశించి పరబ్రహ్మ సాక్షాత్కారం లభిస్తుంది. కాబట్టి వీటిని ఉపనిషత్తులంటా''రని ఆచార్యులవారి అభిమతం.

'ఉపనిషత్' శబ్దంలోని చివరి పదం ఒకప్పుడు 'సత్'గా, మరొకప్పుడు 'సద్'గా కనిపిస్తుంది. వ్యాకరణ నియమాల ననుసరించి తర్వాత వచ్చే పదాన్ని బట్టి 'త' కారం 'ద' కారంగా మారుతుంది. అసలు పదం 'సత్'. అదే సత్-పదార్థం. చరాచర సృష్టియొక్క ఉనికిని తెలియపరిచేది 'సత్'. అంతటా, అన్ని వేళలా, అన్నింటిలో ఉన్నది 'సత్'. 'సత్' కానిది 'అసత్'. ఒకప్పుడు ఉన్నట్టే ఉండి మరొకప్పుడు లేనిది 'అసత్'. ఎన్నటికీ నశించనిది, అన్నిటికీ మూలమైనది 'సత్'. ఈ 'సత్' పదార్థాన్నే వేదాలు అనేక రూపాల్లో వివరించాయి. 'ఏకం సద్ విప్రా బహుధా వదంతి' అని వేద వాక్యం. ప్రపంచానికి మూల కారణమయిన యీ సత్పదార్థమే ఉపనిషత్తులు ప్రతిపాదించిన ప్రధాన విషయం. ఈ పదార్థాన్ని పరమ సమీపంగా (ఉప), నిశితంగా (ని), నిరూపించి చూపించే దర్శనమే ఉపనిషద్దర్శనం. దీనినే రమణ మహర్షి 'సద్దర్శన'మని వ్యాఖ్యానించారు. భగవద్గీతలలో కూడా ఈ సత్పదార్థాన్ని పురస్కరించుకొని 'ఓం తత్ సత్' అన్న బ్రహ్మభావాన్ని వివరించటం జరిగింది. 'సత్' అయినది లేకపోవటం లేదు. 'సత్' కానిది ఉండటమంటూ లేదు- అని గీత తీర్పు. 'సద్గతిః సత్కృతిః సత్తా సద్భూతిః సత్పరాయణః' అని శ్రీ విష్ణు సహస్ర నామంలో సన్నివాసుని కీర్తించటంకూడా గమనించదగిన విషయం. నిత్య సత్య స్వరూపుడయిన నిఖిలేశ్వరుడు సత్ పదార్థంలో స్థిరనివాసం ఏర్పరచుకొని ఉంటాడట. మంచి మార్గంలో మంచి మంచి పనుల ద్వారా మంచిని పంచుతూ పెంచుతూ మంచిలా నిలిచిపోయే

సత్స్వరూపుని యీ రూపకల్పన ఉపనిషత్తులు ప్రతిపాదించిన సత్యదార్థానికి పూర్తిగా వర్తిస్తుంది. ఈ దృష్టితో పరిశీలించి చూస్తే సత్స్వరూపాన్ని సాక్షాత్కరించుకొన్న తపస్సంపన్నుల దివ్య సాన్నిధ్యంలో నిశ్చలమైన నిష్ఠతో, దృఢమయిన దీక్షతో పరమసత్యాన్ని ఆవిష్కరించుకొని ఆనందించటమే ఉపనిషద్దర్శనమని స్పష్టమవుతుంది. ఉపనిషత్తులలో సామాన్యంగా గురుశిష్యుల మధ్యనో, బ్రహ్మవేత్తల మధ్యనో సంభాషణలు ఎక్కువగా ఉండటం ఈ పరికల్పనకు పుష్టిని చేకూరుస్తుంది.

ఉపనిషత్తులలో కూడా ఉపనిషత్తు అనే మాటను అనేక సందర్భాల్లో వాడటం జరిగింది. ఉపాసన, ధ్యానం, జ్ఞానం, రహస్యం అనే అర్థాలలో ఈ శబ్దాన్ని ఉపనిషద్వాఙ్మయం వాడుకున్నది. సాంగోపాంగంగా సరహస్యంగా ఉపనిషత్సహితంగా విలువిద్యను ప్రసాదించవలసిందని రాముడు విశ్వామిత్రుని కోరినట్టు ఆదికవి వాల్మీకి అంటాడు. శ్రద్ధతో, ఉపనిషత్ బుద్ధితో విద్య నభ్యసించవలెనని ఛాందోగ్యం శాసిస్తుంది. ఈ ప్రపంచమంతా ఉపనిషత్తులు ప్రతిపాదించిన బ్రహ్మమయమని కేనోపనిషత్తు సిద్ధాంతీకరిస్తుంది. రామాయణమంతా విని రామునికి సీత ఏమి కావాలని అడిగినట్టు ఉపనిషత్తు పూర్తిగా విన్న శిష్యులు మాకు ఉపనిషత్తంటే ఏమిటో చెప్పండని గురువుగారి నడుగుతారు. అది చెప్పేశానని గురువుగారు సెలవిస్తారు. ఎప్పుడు ఎలా చెప్పారో గుర్తు తెచ్చుకోలేని శిష్యులు ఒకరి ముఖం ఒకరు చూచుకుంటారు. ఉపనిషత్తులలో వివరించిన పరమ రహస్యమయిన ఆత్మ తత్త్వం మనకు తెలియకుండానే తెలిసిపోతుందనేందుకు ఇది చక్కని దృష్టాంతం. ఈ విషయాన్ని కేనోపనిషత్తు చాలా చమత్కారంగా వివరిస్తుంది. ఆత్మతత్త్వం నాకు బొత్తుగా తెలియదని కాని, పూర్తిగా తెలుసునని కాని చెప్పేందుకు వీల్లేదట. ఆత్మ మనకు సంబంధించిందే కాబట్టి మనకు దానిని గురించి కొద్దో గొప్పో తెలిసి ఉండాలి. కాని అలాంటి ఆత్మతత్త్వాన్ని మనం ప్రత్యక్షంగా చూచి పోల్చుకోలేక పోతున్నాము కాబట్టి మనకు ఆ విషయం తెలుసని చెప్పేందుకు కూడా ధైర్యం చాలటం లేదు. ఈ ధర్మ సందేహాన్ని బాగా అర్థం చేసుకోగలిగినవాడే ఆత్మజ్ఞాని కాగలడట. ఇదే ఉపనిషద్రహస్యం.

ప్రపంచంలో మనం తెలుసుకోవలసిన పరమ రహస్యాన్ని ఉపనిషత్తులు చిన్న చిన్న మాటల్లో చెప్పాయి. ఈ మాటలను పాటలుగా మార్చి గీతాచార్యుడు

సంగీత శైలిలో సర్వస్వం ప్రసాదించాడు. అందువల్లనే భగవద్గీతను ఉపనిషత్సారమంటారు. గీతలో, ఉపనిషత్తులలో కూడా ఒకదాని కొకటి పొత్తు కుదరని భావాలు అక్కడక్కడ కనిపిస్తాయి. ఒకచోట కర్మ ప్రధానమని, మరోచోట జ్ఞానం ప్రధానమని, ఒకచోట ఆత్మ పరమాత్మలు ఒకటేనని, మరోచోట వేరువేరని చెప్పినట్టు అనిపిస్తుంది. ఈ పరిస్థితిని సంప్రదాయ పరులయిన పండితులు తమతమ సిద్ధాంతాలను బలపరచుకునేందుకు నేర్పుగా వాడుకున్నారు. ఇలాంటి భేదాభిప్రాయాలు రాకుండా సమన్వయాత్మకమైన దృక్పథం ఏర్పరచేందుకు బాదరాయణుడు బ్రహ్మసూత్రాలను కూర్చాడు. దాదాపు అయిదు వందల సూత్రాలతో ఉపనిషత్తుల సారాంశాన్ని సమగ్రంగా సంగ్రహంగా బ్రహ్మసూత్రాలు ప్రతిపాదించాయి. కాని, సూత్ర శైలిలో సూక్ష్మంగా చెప్పిన విషయాలు అనేకులకు అనేక విధాలుగా బోధపడ్డాయి. ఎవరికి తోచినట్టు వాళ్ళు వ్యాఖ్యానించారు. సాంఖ్యం, యోగం, న్యాయం, వైశేషికం, పూర్వమీమాంస, ఉత్తర మీమాంస (వేదాంత దర్శనం)- అని ఆరు దర్శనాలు తయారయ్యాయి. అన్నిటికీ ఆధారం - గీత, ఉపనిషత్తులు, బ్రహ్మ సూత్రం. ఈ మూడింటిని పురస్కరించుకునే అద్వైతం, ద్వైతం,విశిష్టాద్వైతం మొదలయిన వాదాలు బయలుదేరాయి. ఒక విధంగా భారతీయ తత్త్వ చింతనకు మూల కందాలయిన యీ మూడు గ్రంథాలను ప్రస్థానత్రయ మని వ్యవహరించటం జరిగింది. ప్రస్థానత్రయంలో ఉపనిషత్తులకు ప్రత్యేకమైన స్థానముంది. అన్నిటికంటె ప్రాచీనమయిన వాక్కే కాక అతి సంగ్రహం కాకుండా, అతి విస్తృతం కాకుండా చెప్పవలసిన విషయాన్ని చెప్పవలసినంతగా చెప్పవలసిన తీరులో సరళంగా సులభంగా చెప్పటం ఉపనిషత్తులలోని విశేషం. అందువల్లనే ఉపనిషద్ వాఙ్మయాన్ని హిందువులే గాక మహమ్మదీయులు, క్రైస్తవులు, భారతీయులు, విదేశీయులు అందరూ ఆదరించి ఆమోదించారు. షాజహాన్ కుమారుడైన దారాషికో దీన్ని ఫారసీలో తర్జుమా చేయించాడు. ఈనాడు ఉపనిషత్సాహిత్యం ప్రపంచమంతటా వ్యాపించింది. శాస్త్ర విజ్ఞానం శాఖోపశాఖలుగా ప్రసరించిన యీ విజ్ఞాన యుగంలో కూడా ఉపనిషత్తులు ప్రతిపాదించిన సిద్ధాంతాలకు ప్రామాణ్యం తగ్గటంలేదు, సరికదా, నానాటికి హెచ్చుతూ ఉంది.

ఉపనిషత్తులు చదివి అర్థం చేసుకునేందుకు ఎక్కువ పాండిత్యం అక్కరలేదు. సామాన్యమైన భాషాజ్ఞానం చాలు. భాషకుమించి భావనాశక్తి అవసరం.

ప్రతి పదంలోని పరమార్థాన్ని గ్రహించి పరవశించే పవిత్ర హృదయం కావాలి. ప్రత్యక్షరంలో పరబ్రహ్మను సాక్షాత్కరించుకొనగలిగే పారమార్థిక దృక్పథం కావాలి. అన్నిటికి మించి ఆత్మను ఆకట్టుకోగలిగే చిత్తశుద్ధి కావాలి. అప్పుడే పరమాత్మ అనుగ్రహం లభిస్తుంది. ఉపనిషద్వాక్యాలను వెలయించిన ఋషులు, మునులు ఇలాంటి తపోధనులు. కనకనే వాళ్ళ వాక్కు ఈనాటికీ నిలిచింది. పేరు ప్రతిష్ఠలకూ, ప్రాపంచిక వాసనలకూ దూరంగా ప్రశాంత నిశాంత వేళల్లో పరమార్థ భావనతో పరమసత్యాన్ని భావించి సేవించిన పరమయోగులు ఉపనిషత్కర్తలు.

ఏ ఉపనిషత్తు ఎవరు వ్రాశారో తెలియదు. ఎప్పుడు వ్రాశారో తెలియదు. ఉపనిషత్తులలో మనకు వినిపించే ఋషుల పేర్లు మాత్రం కలకాలం నిలిచిపోయాయి. ఈ ఋషులను పాత్రలుగా సూత్రధారులుగా మలిచిన మహర్షులకు కర్తృత్వంతో ప్రయోజనం లేదు. శరీరం కంటే సమీరం ప్రధానమని త్రికరణ శుద్ధిగా భావించిన నిస్స్వార్థసేవాపరాయణుల కృషి ఫలితంగా వెలువడిన యీ ఉపనిషత్తులు అసలెన్నో కూడా తెలియదు. ముక్తికోపనిషత్తులో 108 ఉపనిషత్తుల పేర్లు కనిపిస్తాయి. ఇందులో మొట్టమొదట ఈశావాస్యం పేర్కొనబడింది, చిట్టచివర ముక్తికోపనిషత్తు పేరు వచ్చింది. మొదటి పది ఉపనిషత్తులు-ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, తైత్తిరీయ, ఐతరేయ, ఛాందోగ్య, బృహదారణ్యకాలు మిక్కిలి ప్రసిద్ధికెక్కినవి అవటంచేత ఈ 108 పేర్లు ప్రాధాన్యాన్ని అనుసరించే ఒక క్రమంలో పేర్కొన్నట్టు భావించవచ్చు. వీటిలో కొన్ని ఉపాసనకు సంబంధించినవి. కొన్ని సంప్రదాయాలకు సంబంధించినవి. కొన్ని కొంతమంది ఋషుల పేరిట వెలువడినవి. నారాయణ, స్కంద, సావిత్రి, సీత, గణపతి, దత్తాత్రేయ లాంటి ఉపనిషత్తులు కొందరు దేవతల ప్రాశస్త్యాన్ని వివరించేవి. ఇవన్నీ యే యే వాదానికి సంబంధించినవో, వర్గీకరించి ఋందులో పేర్కొనటం జరిగింది. ఇవికాక మరికొన్ని ఉపనిషత్తులు కూడా ఉన్నాయి. ఇవన్నీ ఒకే కాలంలో వచ్చాయని చెప్పటం కష్టం. వేరు వేరు కాలాల్లో వేరు వేరు ఋషులు వేరు వేరు ప్రయోజనాలతో ఉపనిషద్రచన చేసి ఉండవచ్చు. అయితే ఈ పట్టికలో ముందుగా చెప్పిన పది ఉపనిషత్తులు మాత్రం (ఈశాది బృహదారణ్యక పర్యంతం) చాలా ప్రాచీనమైనవనీ, వేదాలకు ఉన్న ప్రామాణ్యమే వీటికి కూడా వర్తిస్తుందని భావించటం భావ్యమనిపిస్తుంది. ప్రస్థానత్రయానికి భాష్యం వ్రాసిన

శంకర భగవత్పాదులు ఈ పదింటికీ భాష్యం వ్రాశారు. రామానుజాచార్యులు కూడా వీటినే ఎక్కువగా ముచ్చటించటం గమనించదగిన విషయం. ఈ పది ఉపనిషత్తులే కాక శ్వేతాశ్వతరోపనిషత్తుకు కూడా శంకరులు భాష్యం వ్రాశారని అంటారు. శంకరుడు భాష్యం వ్రాసినా వ్రాయకపోయినా శ్వేతాశ్వతర శైలి చాల రమ్యంగా హృద్యంగా ఉంటుంది. కాని ముక్తికోపనిషత్తులో దీనికి 14 వ స్థానం లభించింది. బృహదారణ్యకానికీ, దీనికీ మధ్య బ్రహ్మ, కైవల్య, జాబాల-అనే మూడు ఉపనిషత్తులు ఉన్నాయి. శ్వేతాశ్వతరం మీది మమకారం చొప్పున కొందరు భాష్యకారులు దానిని వదలలేక మధ్యనున్న మూడింటిని కూడా తమ పరిధిలో చేర్చుకున్నారు. కొందరు మైత్రాయణి (24) కౌషీతకి (25) వరకూ వెళ్ళారు. ఎంత ఆరగించినా తనివిదీరని ఉపనిషత్సుధ అలాంటిది. అమృత స్వరూపమయిన ఉపనిషద్వాణి అమరత్వాన్ని ప్రసాదించగలదేమో గాని తృప్తిని మాత్రం చేకూర్చలేదు. కాని అసంతృప్తి అమరత్వానికి ఒక విధంగా అవరోధం కాబట్టి కొంతవరకు తృప్తి పడటం కూడా అవసరం. ప్రస్తుతం మనం మొదటి పదితోపాటు పద్నాల్గవదయిన శ్వేతాశ్వతరాన్ని కూడా చేర్చుకొని ఈ ఏకాదశితో సమాధాన పెట్టుకుందాం. ఇప్పటి కిది అవసర నైవేద్యం. మహా నైవేద్యం మరోసారి.

ఈ పదకొండు ఉపనిషత్తులలో అన్ని ఉపనిషత్తులసారమే కాదు, వేద వేదాంత నవనీతం కూడా కరతలామలకం అవుతుంది. వీటిలో చెప్పిన విషయాలే మిగిలిన ఉపనిషత్తులలో చర్విత చర్వణం అవుతాయి. చెప్పినదే చెప్పటం ఉపనిషత్తుల వైశిష్ట్యం. ఈ పదకొండు ఉపనిషత్తులలో కూడా ఒకే భావం, ఒకే శ్లోకం, ఒకే మంత్రం రెండు మూడు చోట్ల వినిపిస్తుంది. ఎన్ని రకాలుగా చెప్పినా, ఎన్ని పర్యాయాలు చెప్పినా మరోసారి చెపితే మళ్ళీ విందామనిపించే మాధుర్యం కల్యాణాత్మకమైన యీ ఉపనిషత్కథల్లో ఉంది. ఒకప్పుడు కథా రూపంలో, మరొకప్పుడు సంభాషణ రూపంలో, ఒకచోట వ్యాఖ్యాన శైలిలో మరోచోట ఉపదేశ శైలిలో ఒకే పరమార్థాన్ని అనేక పద్ధతుల్లో వివరించటమే ఉపనిషత్తుల ఉద్దేశ్యం. ఎంత విశదంగా వివరించినట్టు కనిపిస్తాయో అంత సంగ్రహంగా సూత్రప్రాయంగా సూక్తియుక్తంగా సూక్ష్మాతి సూక్ష్మమైన ఆత్మ తత్త్వాన్ని అరటిపండు ఒలిచి చేతికందించినట్టు ముక్తసరిగా మూడు మాటల్లో చెప్పటం ఉపనిషత్తులలో కనిపించే ఉత్కృష్ట లక్షణం. 'తత్త్వమసి', 'సర్వం

ఖల్విదం బ్రహ్మ', 'అయ మాత్మా బ్రహ్మ' 'ఈశావాస్యమిదం సర్వం' లాంటి చిన్న చిన్న వాక్యాలు జీవితమంతా మననం చేసుకొని మహదానందం అనుభవిం చేందుకు ఉపకరించే మహనీయ మంత్రాలు.

ఉపనిషత్తులలోని భావాలన్నీ ముఖ్యంగా మూడు కోణాలను పలువిధా లుగా కలిపి నిరూపించే ముక్కోణాలుగా కనిపిస్తాయి. శరీరం, మనస్సు, ఆత్మ ఒక త్రికోణం. శరీరం స్థూలం, ఆత్మ సూక్ష్మం. ఈ రెంటినికలిపేది మనస్సు. ఈ మూడింటి పరస్పర సంబంధాన్ని ప్రతిపాదించే తత్త్వ చింతన ఉపనిషత్తు లలో విరివిగా కనిపిస్తుంది. అలాగే జీవాత్మ, పరమాత్మ, ప్రపంచం - ఈ మూడింటిని ముడిపెట్టి ముడివిప్పే భుక్తి ముక్తి రహస్యాలు కూడా ఉపనిషత్సా హిత్యంలో గోచరిస్తాయి. భూత భవిష్యద్వర్తమానాలలో, దేశకాల పాత్రలలో జాగ్రత్ స్వప్న సుషుప్తులలో ఉన్న పరమ రహస్యాలను ఉపనిషద్వాక్యాలు చక్కగా తేల్చి తేట తెల్లంగా తెలియ పరుస్తాయి. అకార, ఉకార, మకారాలతో కూడుకున్న ప్రణవనాదమే ప్రపంచసర్వమని ఉపనిషన్మహర్షుల సిద్ధాంతం. క్షరం, అక్షరం, క్షరాక్షరం వీటికి గల సంబంధం తెలిస్తే పురుషోత్తమ సందర్శనం లభిస్తుందని ఉపనిషత్తులు సూచిస్తాయి. నీవు, నేను, ఆతడు - అనే పురుష భేదం అంతరిస్తే పరమ పురుషుడు ప్రత్యక్షమవుతాడని వేదాంతం ఘోషిస్తుంది.

ఇలా కొండంత సత్యాన్ని గోరంతగా మార్చి కోరిన వారికి గోరుముద్దగా అందించే అమృత సూక్తులు ఉపనిత్సుధలో అడుగడుగునా వినిపిస్తాయి. విని పించింది శ్రుతి. వినగలిగింది చెవి. చెవిని శ్రుతిచేసే శ్రుతికరణమే ఉపనిష ద్వాఙ్మయం.

ద్వైతం దేహలక్షణం. అద్వైతం ఆత్మ లక్షణం. దేహబుద్ధి క్షీణించే కొద్దీ ఆత్మదీప్తి రాణిస్తుంది. సంగ్రహం దేహానికి అవసరం. అనుగ్రహం ఆత్మకు నైజం. ఉపాధి ఉపశమిస్తేనే కాని సమాధి కుదరదు. సమాధి కుదిరితేనే కాని ఆత్మతత్త్వం అంతుపట్టదు. తనదనుకుంటున్న తనువు నిజంగా తనది కాదనే వివేకం ఉదయించేసరికి ఆత్మ సాక్షాత్కారం లభిస్తుంది. నిర్లిప్తం, నిర్మలం, నిరుపాధికమైన యీ ఆత్మ చైతన్యమే బ్రహ్మపదార్థం. దేహ మోహా నికి బద్ధుడైన జీవుడు ఆత్మబుద్ధితో పరికించి చూస్తే పరబ్రహ్మస్వరూపుడే అని తెలిసిపోతుంది. ఈ విషయం చెప్పేందుకే వేదం, వేదాంతం, శ్రుతి, స్మృతి,

ఇతిహాసం, పురాణం, కావ్యం మొదలయిన సారస్వత శాఖలు ప్రయత్నిస్తూ వచ్చాయి. ఎక్కువ వాగాడంబరం లేకుండా తక్కువ మాటల్లో తత్త్వసారాన్ని విప్పి చెప్పేందుకు ఉపనిషద్వాఙ్మయం ఉపకరించినట్టుగా మరో వేద శాఖ ఉపకరించదు. ఉపనిషత్తులకు ఉపోద్ఘాతం కల్పించి కాలక్షేపం చేసేకంటే ఉపనిషద్వాక్యాలనే ఉన్న వున్నట్టుగా ఉదాహరించటం శ్రేయస్కరం దీపాన్ని గురించి చర్చించే కంటె దీపం వెలిగించటం మేలు.

*"దీపం జ్యోతి పరం బ్రహ్మ-దీపం సర్వతమోపహం"*



# త్యాగం–భోగం

*"తేన త్యక్తేన భుంజీథా"-ఈశ (1)*

త్యాగంతో అనుభవించే భోగమే యోగమవుతుందని ఈశావాస్యం బోధిస్తుంది. కాని, నిత్యజీవితంలో త్యాగానికీ భోగానికీ పొత్తు కుదరదు. భోగలాసుడు త్యాగి కాలేడు. త్యాగబుద్ధి కలవాడు భోగం జోలికి వెళ్ళడు అలాంటప్పుడు త్యాగబుద్ధితో భోగానుభవం ఎలా సాధ్యం అనేది చిక్కు ప్రశ్న. ఈ ప్రశ్నకు సమాధానం ఈశావాస్యోపనిషత్తులోని 18 మంత్రాలు (శ్లోకాలు) చెప్తాయి.

ఉపనిషత్తులు శ్రుతికి (వేదానికి) శిరస్సులయితే ఉపనిషత్తులకు శిరస్థానీయమైనది ఈశావాస్యం. అందువల్లనే యీ ఉపనిషత్తును ముక్తికం మొట్టమొదట పేర్కొన్నది. వేదవాఙ్మయంలో సంహితా (మంత్ర) భాగానికి చెందిన ఉపనిషత్తు ఇదొక్కటే. మిగిలిన ఉపనిషత్తులు బ్రాహ్మణ భాగానికో, ఆరణ్యకానికో అనుబంధంగా కనిపిస్తాయి. కాని, ఈశోపనిషత్తు శుక్లయజుర్వేదంలో మంత్ర భాగంలోనే వస్తుంది. కర్మకాండకు సంబంధించిన 39 అధ్యాయాల తర్వాత జ్ఞాన కాండను వివరించే 40 వ అధ్యాయమే ఈశోపనిషత్తు. కర్మకు పర్యవసానం జ్ఞానం కాని, జ్ఞానానికి ఆధారం కర్మ. ఈ రెండింటికి సమన్వయం సాధించే మార్గం చెప్తుంది యీ ఉపనిషత్తు.

చేయవలసిన పనులు చేసి తీరాలి. ఆచరణ వల్లనే ఆత్మశుద్ధి ఏర్పడుతుంది. ఆత్మశుద్ధి లేనిదే ఆత్మ సాక్షాత్కరించదు. కాబట్టి మంచిమంచి పనులు మంచి మనసుతో చెయ్యాలి. కాని, తనవల్ల ఈ పని నెరవేరిందని దురభిమానం పనికి రాదు. తాను చేసిన పనికి తానే ఫలిత మనుభవించాలనే ఆసక్తి కూడా మంచిదికాదు. అందువల్ల కర్మబంధ మేర్పడుతుంది. చిత్తశుద్ధికి ఆత్మబుద్ధికి అది అడ్డు తగులుతుంది. 'పని చేయటం తనవిధి' అని భావించి నిర్లిప్తంగా కర్మ ఫలాన్ని అనుభవించినా తప్పు లేదు. ఆచరణలో అహంకారం, అనుభవంలో ఆసక్తి లేనప్పుడు త్యాగానికీ, భోగానికీ ఎక్కువ భేదముండదు. ఇదే త్యాగ బుద్ధితో కూడిన భోగానుభవం. ప్రపంచంలో భోగపదార్థాలు మనకొక్కరికే ఏర్పడలేదు. ఇందులో అందరికీ భాగముంది. ఎవరి భాగం వాళ్ళు అనుభవిస్తారు. మనకు లభించింది మన భాగం, అదే మహద్ భాగ్యం. ఈ భావంతో అనుభవించిన భోగం కూడా త్యాగంతో సమానమయిందని ఈశావాస్యంలోని మొదటి శ్లోకం ఉపదేశిస్తుంది.

'ఈశావాస్య మిదం సర్వం' అన్నది యీ ఉపనిషత్తులోని మొదటి వాక్యం. ఈ ప్రపంచమంతా పరమాత్మ తత్త్వంతో నిండి నిబిడీకృతమై ఉన్నది. పరమేశ్వరుడు లేనిచోటు ఈ ప్రపంచంలో ఎక్కడా లేదు. కదిలేది జగత్తు. కదిలించేవాడు జగన్నాథుడు. జగన్నాథుని రథచక్రాలు కదిలితే జగత్తు కదలుతుంది. ఇక్కడ లోకేశుని శాసనం వల్లనే వానలు కురుస్తాయి. పంటలు పండుతాయి. సూర్యుడుదయిస్తాడు. వెన్నెల కాస్తుంది. నదులు ప్రవహిస్తాయి. ఇవన్నీ ప్రపంచంలో ఏ ఒకరి కోసమో జరగటం లేదు. పార్థివ వైభవంలో ప్రతి వ్యక్తికీ అధికారం ఉంది. కాబట్టి నాది, నీది అనే సంకుచిత దృక్పథాన్ని త్యజించి తనకు లభించిన దాన్ని తృప్తితో, కృతజ్ఞతతో, జాలితో, సహజీవుల పట్ల సానుభూతితో, అనుభవించటమే ఆరాధన. ఇలాంటి నిర్లిప్తమైన భోగానుభూతి పసిపిల్లల ప్రవర్తనలో కనిపిస్తుంది. తల్లిపాలు త్రాగి, చల్లని గాలి పీల్చుకొని, కమ్మని కంఠంతో పాడిన జోల పాటలకు కరిగిపోయే మధుర హృదయం పసిపాపలది. వయసు పెరిగేకొద్దీ స్వపరభేదం ఏర్పడుతుంది, స్వార్థం పెరుగుతుంది, త్యాగబుద్ధి తగ్గుతుంది, భోగలాలస హెచ్చుతుంది. కాని, జీవితాంతం ఇలాగే త్యాగభోగసమన్వయం సాధించగలిగితే అంతకు మించిన యోగం లేదు. అదే కర్మయోగం. అదే జ్ఞానయోగం. ఇలా ఎన్ని

సంవత్సరాలు జీవించినా జీవితం స్ఫటికంలా ప్రకాశిస్తుంది. నిర్మలమైన మనస్సు నిశ్చలమైన ఆత్మను, అద్దం పట్టినట్టు, తనలో ప్రతిఫలింపజేసుకుంటుంది. ఇదే కర్మయోగానికీ, జ్ఞానయోగానికీ పరమావధియైన ఆత్మయోగం. ఈ స్థాయిని అందుకోగలిగిన ఆత్మవంతులు ధన్యులు. ప్రపంచంలో ధనవంతులు, బలవంతులు, గుణవంతులు చాలా మంది ఉంటారు. కాని, ఆత్మవంతులు చాలా అరుదు. శరీరం కనిపిస్తుంది. మనస్సు ఉన్నట్టు అనిపిస్తుంది. కాని, ఆత్మ ఉనికి అందరికీ తెలియదు. అది తెలిసినవాడే ఆత్మవంతుడు. అదే జీవిత పరమావధి.

ఇలాంటి ఆత్మజ్ఞానం కలవాడు తానెవరినో తెలుసుకొని తనకోసం ఏర్పడ్డ శరీరాన్ని, మనస్సును తన అదుపులో పెట్టుకొని తాను చేసే ప్రతి పనినీ తెలిసి చేస్తాడు. అలా ఆత్మజ్ఞతతో ఆచరణ చేయగా చేయగా తన ఉనికికి మూలమైన ఆత్మకూ, ప్రపంచానికి మూల కారణమైన పరబ్రహ్మకూ భేదం లేదని అతనికి బోధ పడుతుంది. అంతటితో అతని దినచర్య బ్రహ్మచర్య మవుతుంది. అతని ఆచరణ ఆరాధన అవుతుంది. అలాంటి వివేకం లేకుండా గుడ్డి యెద్దు చేను మేసినట్టు ఇంద్రియములు చెప్పినట్టు చేసే అజ్ఞానికి ఆత్మ అనేది ఒకటి ఉన్నదనే విషయం ఎన్నటికీ తెలియదు. అంటే తానెవరో తెలుసుకోకుండా జీవిత యాత్ర సాగించే పశుతుల్యులు ఆత్మకు దూరమైపోతారు. అలాంటివాళ్లనే ఈశావాస్యం ఆత్మఘాతకులు లేక ఆత్మఘ్నులని అంటుంది. తన ఉనికిని తెలుసుకొని చేసేవాడు ఆత్మజ్ఞుడు. కానివాడు ఆత్మఘ్నుడు. చేసినపని (కృతం) ఎందుకు చేశామో తెలుసుకోవటమే కృతజ్ఞత. అలాంటి పరిజ్ఞానం లేకపోవటమే కృతఘ్నత. ఆత్మజ్ఞానం లేక అంధులవలె ప్రవర్తించే ఆత్మఘాతకులు మరణించిన తర్వాత చీకటి లోకాలు చేరుకుంటారని యీ ఉపనిషత్తు హెచ్చరిస్తుంది. ఆ లోకాలకు సూర్యరస్మి సోకదట. అసలే కారు చీకటి. ఆ చీకటిలో మెలిగే ప్రాణికోటి పుట్టు గ్రుడ్డివి. గ్రుడ్డివాడు చీకటిలో పడి పాకులాడినా ప్రయోజనముండదు. బయట వెలుతురున్నప్పుడు, కళ్ళలో కాంతి ఉన్నప్పుడు వెదకవలసిన వస్తువు వెదకలేక పోతిననే పశ్చాత్తాప మొకటే మిగిలిపోతుంది. అలాంటి దుర్గతి పట్టకుండా చూచుకోవటం బుద్ధిమంతుల లక్షణం అని ఈశావాస్యం శాసిస్తుంది.

ఇలా మొదటి మూడు మంత్రాల్లో కర్మజ్ఞాన సమన్వయాన్ని త్యాగభోగ సమీకరణ శైలిలో వివరించిన తర్వాత రెండు మంత్రాల్లో ఆత్మ లక్షణాన్ని

అలంకారిక శైలిలో సూచిస్తుంది యీ ఉపనిషత్తు. ఆత్మ చలించదట. బాహ్య దృష్టికి ఇన్ని రూపాలలో కనిపించినా అసలు దాని రూపమొకటేనట. చలించ నట్టు కనిపించినా మనస్సు కంటె వేగంగా పరుగెత్తగలదట. ఆత్మ పురోగ మిస్తూ ఉంటే దానిని అందుకునేందుకు దేవతలు, ఋషులు వాయువేగ మనో వేగాలలో వెంట పడుతారట. అయినా వాళ్ళు ఆత్మను అందుకోలేరట. ఇంతలో ఇంత దూరం రాబోయిందా అని ధైర్యంతో దేవతలు ఏ మారుమూలకో చేరు కొనేసరికి అంతకుముందే అక్కడికి చేరి తిష్ఠ వేసికొని ఉంటుందట. ఆత్మతో పరుగులిడటం ఎవ్వరికీ సాధ్యం కాదట. ఆత్మతత్త్వం ఎక్కడవుంటే అక్కడే నీరు, గాలి కూడుకొని ఉంటాయట. అసలు నీటికీ గాలికీ ఆశ్రయమిచ్చేది ఆత్మ తత్త్వమే. అది లేనిచోట మరొకటి ఉండేందుకు వీల్లేదు. పంచ తత్త్వాలలో నేల, నింగి, వెలుగు ప్రాణి కోటికి ఆధారాన్ని ఇస్తాయి. మిగిలిన రెండు-అంటే నీరు, గాలి-ఆహారాన్ని ఇస్తాయి. ఆధారం, ఆహారం రెండూ ఆత్మకోసం ఏర్పడ్డవే. ఆత్మ ఏర్పరచుకొన్నవే. గాలికోసం, నీటికోసం ఆత్మ ప్రాకు లాడదు. గాలి, నీరు ఆత్మ నాశ్రయించి ఉంటాయి. ఈ రహస్యం చాల సాంకేతిక భాషలో ఈ మంత్రం వివరిస్తుంది.

అందువల్లనే ఆత్మను ఇదమిత్థమని నిరూపించటం సాధ్యంకాదు. అది నిశ్చలమా చంచలమా అని అడిగితే రెండూ అని చెప్పాల్సి ఉంటుంది. చలించి నట్టు కనిపిస్తుంది. కాని, దానికి చలనం లేదు. మనకు పరమ సమీపంగా మన లోనే ఉన్నా మనకు అందుబాటులో ఉండదు. ఆత్మానుసంధానం కోసం ఆత్మవంతులు అడవులకు పోయి తపస్సు చేస్తారు. దగ్గర ఉన్న ఆత్మతత్త్వాన్ని అవగాహన చేసుకొనేందుకు ఎంతెంత దూరమో వెళ్తారు. అది లోపల ఉందా బయట ఉందా అంటే అంతటా ఉన్నదని సమాధానం వస్తుంది. ప్రతి జీవిలో ప్రతిష్ఠితమైన ఆత్మ విశ్వాత్మగా విశ్వమంతటా వ్యాపించి ఉన్నది. బాహ్య జగత్తులో వున్న పంచభూతాలే శరీరంలో కూడా ఉన్నాయి.

లోపల ఆత్మగా, బయట పరమాత్మగా ప్రకాశించే ఆత్మచైతన్యాన్ని సాక్షాత్కరించుకొన్న ఆత్మయోగికి అందరూ ఆత్మస్వరూపులుగానే కనిపిస్తారు. అందరూ తనలో ఉన్నట్టు, తాను అందరిలో ఉన్నట్టు భావించటం వల్ల అతనికి అతాను గానిది తనది గానిది మరొకటి కనిపించదు. ప్రపంచంలోని ప్రాణికో ంతా పరమాత్మ స్వరూపులని సర్వాత్మనా భావించిన భావయోగికి ఒకరిమీదటి

వ్యామోహం కాని మరొకరంమీద ద్వేషం కాని ఉండదు. అంతా ఆత్మమయమని అనుకున్నప్పుడు ఉన్నది పోయిందని కాని, లేనిది రాలేదని కాని విచారానికి అస్కారమే ఉండదు. అలాంటి మనీషిని ఉపనిషత్తు కవిగా స్వయంభువుగా పరిభువుగా పరిపరివిధాల కీర్తిస్తుంది. కవి చూడగలడు. కాబట్టి ద్రష్ట. చేయ గలడు. కాబట్టి స్రష్ట. ఈ స్రష్టను సృష్టించవలసిన అవసరం లేదు. ఈ ద్రష్టను చూడటం మరో ద్రష్టకు సాధ్యంకాదు. కనకనే అతను ''అదృష్ట''వంతుడు. 'అదృష్టో ద్రష్టా' అని శ్రుతి చెప్తుంది. ఈ స్థితి శరీరధారికి సాధ్యంకాదు. శరీరంతో సంబంధంలేని సమాధిస్థితిలో ఆకలిదప్పులతో, ఆధివ్యాధులతో, పాపపుణ్యాలతో, రాగద్వేషాలతో ప్రమేయం లేని నిత్య నిర్మలమైన ఆత్మ స్వచ్ఛంగా, శుభ్రంగా, స్వతస్సిద్ధంగా ప్రకాశించటం కనిపిస్తుంది. ఆ వెలుగు కనిపించిన తర్వాత యోగి ఒక దేశానికీ, ఒక కాలానికీ బద్ధుడయి వుండడు. సర్వం తాను, తానే సర్వం అనే సార్వత్రిక భావం అతనికి సర్వజ్ఞ స్థితిని ప్రసాదిస్తుంది.

కాని, ఈ స్థితి యెలా లభిస్తుంది? ఈ ప్రశ్నకు సమాధానం ఈశావాస్యం ఇస్తుంది. ప్రపంచంలో విద్య, అవిద్య అని రెండు పదార్థాలు వున్నాయి. ఉన్నది విద్య, లేనిది అవిద్య. తెలిసినది విద్య, తెలియనిది అవిద్య. జ్ఞానం విద్య, అజ్ఞానం అవిద్య. జ్ఞానంవల్ల జ్ఞాని ఆత్మవంతుడవుతాడు. అజ్ఞానంవల్ల సామాన్య మానవుడు కర్మకు లొంగిపోతాడు. కాని, జ్ఞాని కర్మకు లొంగకుండానే కర్మవల్ల చిత్తశుద్ధిని పొంది నిశ్చలమైన బుద్ధితో జ్ఞానమార్గాన్ని అనుసరించి ఆత్మ సాక్షాత్కారం పొందుతాడు. కర్మను పరిత్యజించినంతమాత్రాన జ్ఞానం ఉద యించదు. జ్ఞానం లేనిది కర్మ పరిపక్వం కాదు. కాబట్టి జ్ఞానమార్గానికి అడ్డు రాకుండా నియతకర్మలను నిర్లిప్తంగా ఆత్మనిష్ఠతో ఆచరించినవాడు నిజమైన ఆత్మయోగి. ఈ రెండు మార్గాలు ఒకదానికొకటి పరిపూరకమైనవే కాని విరుద్ధములయినవి కావు. కాబట్టి అవిద్యవల్ల ఆచరించే కర్మను నిరసించకుండా దాని సాయంతో మృత్యువును దాటిన తర్వాత జ్ఞానామృతంతో అమరత్వాన్ని సాధించటం సాత్త్వికమైన సాధనకు లక్షణం. అమరత్వం కావాలంటే మృత్యు వును ఎదుర్కొనకతప్పదు. అవిద్య దీనికి సహకరిస్తుంది. ఆ తర్వాత అమరత్వ సిద్ధికి విద్యాత్మకమైన జ్ఞానం దోహదమిస్తుంది.

అలాగే ప్రపంచంలో సంభూతి, అసంభూతి అనేవి కూడా పరస్పర విరుద్ధంగా కనిపిస్తాయేగాని నిజానికి అవి రెండూ ఒకదానితో ఒకటి ముడివడి ఉన్నాయి. నశించే శరీరంలోనే నశించని ఆత్మతత్త్వం ఉంది. ఇంద్రియానుభూతి క్షణికమే. కాని ఈ అనుభూతి లేనిదే శాశ్వతమైన ఆత్మానుభూతి అందదు. కామవాసన మోక్షసాధనకు ప్రబలమైన శత్రువు. నిజమే. కాని కామవాసనవల్ల కలిగే ఆనందం క్షణభంగురమని స్వానుభవంవల్ల తెలియనిదే మోక్షలాలస బలపడదు, నిలబడదు. కాబట్టి నశ్వర శరీరంవల్ల లభించే లాభలోభాలను అనుభవించిన తర్వాతనే అవినశ్వరమైన ఆత్మతత్త్వం బోధపడుతుంది.

కాబట్టి అవిద్యను నిరసించకుండా విద్యను సాధించాలి. నష్టిని తిరస్కరించకుండా పుష్టిని పొందాలి. అసత్తును అధిగమించనిదే సత్స్వరూపం గోచరించదు. ఇందులో మరో చిక్కు ఏమంటే, సత్పదార్థం కంటె అసత్ పదార్థమే ఆకర్షకంగా ఉంటుంది. పసిడి పాత్రలో సత్యం దాగివుంది. లోపల దాగి వున్న సత్య స్వరూపాన్ని చూడాలంటే బయటి పూత పోవాలి. పసిడి మూత తొలగాలి. అందుకోసం ఆత్మయోగి పరమాత్మను ప్రార్థిస్తాడు. నిత్యసత్య సందీప్తమయిన పరంజ్యోతిని చూడాలని పరితపించే కాంతికాములకు మధ్య మధ్య ఏవేవో చిల్లర వెలుగులు జిగిబిగిగా కనిపిస్తాయి. అవి తొలగిపోతేనే కాని అసలు వెలుగు కనిపించదని ఆరాటపడుతున్న ఆత్మ నిరతుడు సూర్యాది దేవతలను పరిపరి విధాల వేడుకుంటాడు. ఇలాంటి ప్రార్థనలతో ఉపనిషత్తు చివరి నాలుగు మంత్రాలు భక్తిని ప్రబోధిస్తాయి. కర్మ జ్ఞాన సమన్వయంతో ఆరంభించి ఉపనిషత్తు భక్తి సంగీతంతో పరిపూర్తి చెందుతుంది.

జీవితంలో అనుభవించినవన్నీ అనుభవించిన తర్వాత చివరకు మిగిలేది యేమిటి అనే జిజ్ఞాస జీవికి అవసానదశలో ఏర్పడుతుంది. ఎంత మక్కువగానో చూచుకొన్న చక్కని శరీరం క్షణంలో భస్మీభూతమై పోతుంది. గాలి గాలిలో కలిసిపోతుంది. కాని మిగిలేది యేమిటి? జీవితంలో సాధించిన మంచితనం. ''నేను చేసిన పనులను మరిచిపోవద్ద''ని జీవుడు పరమాత్మను ప్రార్థిస్తాడు. ''నీవు చెప్పిన పని చేశాను. నీవు నేర్పిన పాట నీకు వినిపించాను. నన్ను మన్నించి నాకు సరియైన దారి చూపి నిరాటంకంగా నన్ను నీలో చేర్చుకో'' అని తన పార్థివశరీరాన్ని పరమార్థతత్త్వంగా మార్చివేస్తున్న అగ్ని దేవతకు మాటిమాటికి నమస్కరిస్తూ ఆత్మవంతుడు ఆత్మను ఆత్మకు అర్పించుకుంటాడు. పరిపూర్ణమైనజీవాత్మ పరిపూరకమైనపరమాత్మలోలీనమయిపూర్ణకాముడవుతాడు.

-పూర్ణ మదః పూర్ణ మిదం-

# కరణం-కారణం

"తదేవ బ్రహ్మత్వం విద్ధి నేదం యదిదముపాసతే" కేన (1-8)

కళ్ళు-చెవులు, కాళ్ళు - చేతులు, ముక్కు - నోరు, వాక్కు - మనసు-ఇవన్నీ జీవయాత్రలో జీవికి ఉపయోగపడే ఉపకరణాలు. పని చేసేందుకు ఉపకరించేది కరణం. పని చేసేవాడు కర్త. చేయించేవాడు కారకుడు. కారకుని కోరిక కారణం. పార్థివ జగత్తులో జరిగే ప్రతి పనికీ కరణం, కారణం, కర్త ప్రత్యగాత్మగా ప్రతి జీవిలో ప్రవేశించి వున్న పరబ్రహ్మ స్వరూపమేనని మహనీయుల అభిప్రాయం. ఈ విషయాన్ని కేనోపనిషత్తు శ్రుతి మధురంగా వివరిస్తుంది. కేనోపనిషత్తు సామవేదానికి చెందిన తలవకార బ్రాహ్మణంలో భాగం అవటంవల్ల దీనిలో ప్రతి మంత్రం మృదు మధుర గీతంలా వినిపిస్తుంది. కంటికి కనిపించే కరచరణాది కరణాలకు మూలకారణం ఏమిటి అనే ప్రశ్నతో 'కేనేషితం పతతి ప్రేషితం మనః' అని ఆరంభించటంవల్ల దీనికి కేనోపనిషత్తని పేరు వచ్చింది–'ఈశ' శబ్దంతో ఆరంభించిన ఉపనిషత్తుకు ఈశావాస్యమని పేరు వచ్చినట్టుగానే.

సామాన్యంగా మనం కళ్ళతో చూస్తాం. చెవులతో వింటాం, నోటితో మాటాడుతాం, మనస్సుతో ఆలోచిస్తాం, కాని నిజంగా చూచేవి కళ్ళే అయితే, వినేవి చెవులే అయితే, మాట్లాడేది నోరే అయితే ఆలోచించేది మనస్సే అయితే మనిషి మరణించగానే యీ కళ్ళు, చెవులు, నోరు వెనకటి లాగానే ఉంటాయి గదా! మరి అవి పని చేయటం ఎందుకు మానేస్తాయి? మనస్సు మనకు కనిపించదు కాబట్టి ఉన్నదో లేదో తెలియదు. కాని మిగిలిన ఇంద్రియాలన్నీ యథాతథంగానే ఉంటాయి. కాబట్టి యీ కరణాలకు జీవంపోసి వాటిచేత ఆయా పనులు చేయించే మూలకారణ మేదో యీ శరీరంలోనే ఉండి తీరాలి. స్థూలంగా దాన్ని మనం ప్రాణమని వ్యవహరిస్తాం. ప్రాణమున్నంత వరకు కళ్ళు, చెవులు, ముక్కు, నోరు, మనసు పనిచేస్తాయి. ప్రాణం పోగానే అన్ని అవయవాలూ తోలు

సంచులుగా మారిపోతాయి కళ్ళు చూడవు. చెవులు వినవు. నోరు కదలదు. మనస్సు మెదలదు. మరి యీ ప్రాణం ఎక్కడి నుంచి వచ్చింది ? ఎందుకు వచ్చింది? ఎక్కడికి వెళ్ళుతున్నది? తనంతట తానే వచ్చి వెళ్ళిందా? ఎవరైనా పంపారా? ఈ జిజ్ఞాసతోనే కేనోపనిషత్తు ఆరంభమవుతుంది.

"ఎవరి పంపున ఇవటికేతెంచు మనసు?
ఎవరు కూర్చగ ప్రాణంబు లవని కూడు?
ఎవరు పలికించగా పల్కు నిచట వాక్కు?
కనుల వీనుల కెవడు సంగతి కూర్చు?"

సూక్ష్మంగా ఆలోచించి చూస్తే శరీరంలోని అన్ని అవయవాలకూ ఆచరణ దక్షతను చేకూర్చే ప్రాణ శక్తిని స్పందింప జేసే మూల కారణం మరొకటి యీ శరీరంలో ఉందని స్పష్టంగా తెలిసిపోతుంది. అదే బ్రహ్మ పదార్థమని యీ ఉపనిషత్తు ప్రతిపాదిస్తుంది. మనకు కనిపించే అవయవాలు కేవలం ఉపకరణాలు. వీటికి మూలకారణం బ్రహ్మ. అదే సత్యం.

"అరయగా నదె బ్రహ్మ మన్యంబు కాదు,
జనులు సేవించు నిది ఉపాస్యంబు కాదు."

అని ఘంటాపథంగా మాటి మాటికి పల్లవి పాడినట్టు కేనోపనిషత్తు చాటి చెప్తుంది. ఆ బ్రహ్మపదార్థమే చెవికి చెవిగా, మనస్సుకు మనస్సుగా, వాక్కుకు వాక్కుగా, కంటికి కన్నుగా, ప్రాణానికి ప్రాణంగా అన్నింటి వెనుక నిలబడి అన్నిటిచేత పనిచేయిస్తూ ఉన్నది. కాని దానిని కళ్ళు చూడలేవు. వాక్కు దానిని వివరించలేదు. మనస్సు దానిని గురించి ఆలోచించలేదు. మనకు తెలిసిన దానికీ, తెలియని దానికీ కూడా అతీతమైన ఆ బ్రహ్మ పదార్థాన్ని తెలుసుకోవటం ఎంత తెలివిగల వాళ్ళకు కూడా సాధ్యం కాదు. ప్రపంచంలోని ప్రతి కణంలో ఈ బ్రహ్మ పదార్థం ఇమిడి యున్నదనే బ్రహ్మభావన ఒక్కటే ఆ బ్రహ్మజ్ఞానానికి సాధకం. తన ఉనికికీ, మనుగడకూ మూలకారణమైన బ్రహ్మను నిరాకరించుట తన్ను తాను వంచించుకొనుట అవుతుంది.

బ్రహ్మ తేజస్సువల్ల వాక్కు వెలువడుతుంది. కాని వాక్కు ఆ బ్రహ్మ పదార్థాన్ని మాటలలో చెప్పలేదు. మనస్సులో ఆలోచనలు ఉదయించేందుకు బ్రహ్మభావమే కారణం. కాని ఆ పరతత్త్వం ఆలోచనలకు అందదు. ఇలా

వాక్కుకూ, మనస్సుకూ అందని పరబ్రహ్మ స్వరూపం నాకు పూర్తిగా తెలుసునని యెవ్వరూ చెప్పలేరు. మనకు తెలిసినది చాల కొద్ది. అది కూడా ప్రామాణికమని చెప్పలేము. కాని మనకా విషయం పూర్తిగా తెలియదని కూడా చెప్పేందుకు వీల్లేదు. ఆత్మతత్త్వం, బ్రహ్మపదార్థం ఒకటే అవటం వల్ల అంతరంగికమైన ఆత్మకు బహిరంగమైన బ్రహ్మభావం అణుమాత్రమైనా తెలిసి వుంటుంది. అంటే మనలో పూర్తిగా తెలిసినవారూ లేరు, బొత్తిగా తెలియనివారూ లేరు ఈ విషయం తెలిసినవారే నిజమైన బ్రహ్మవేత్తలు.

తనను గురించి తాను ఆలోచించలేక పోతున్నానని గమనించిన వాడే నిజమైన ఆలోచనాపరుడు. తనకు సర్వం బోధపడిందని భావించినవారికి తెలిసిన విషయం పరమ శూన్యం. ''తెలియుననుకొన్న వానికి తెలియరాదు, తెలియదనుకొన్న వానికి తెలియనగును''. – అని తెలిసిన వారు భావిస్తారు. ఇలాంటి భావనా బలంతోనే బ్రహ్మజ్ఞానం లభిస్తుంది. ఆత్మచింతనతో కావలసిన శక్తిని సేకరించుకొని బ్రహ్మభావనతో చేరవలసిన గమ్యం చేరి మర్త్యునిలోని అమరత్వాన్ని గుర్తించటమే జీవిత పరమార్థం.

ఈ పని యీ శరీరం ఉండగానే సాధించాలి. శరీరం నశించిన తర్వాత పరమార్థ సాధనకు ఆధారమే పోతుంది. కాబట్టి అదృష్టం కొద్దీ మనకు లభించిన యీ శరీరాన్ని ఆధారం చేసుకొని ఇందులోని ఆత్మతత్త్వాన్ని బ్రహ్మ పదార్థాన్ని అవగాహన చేసుకోవాలి. తనలోపల ప్రవేశించి తనను నడిపిస్తున్న ఆత్మతత్త్వమే అందరికీ ఆధారంగా అందరిలో వ్యాపించి యున్నదనే రహస్యం తెలుసుకోవాలి. కేవలం తెలుసుకున్నందువల్ల లాభం లేదు. ఆ పరతత్త్వాన్ని ప్రత్యక్షంగా చూడాలి. చూచి అందులో చేరిపోవాలి, లీనమై పోవాలి. అదే బ్రహ్మసాయుజ్యం.

కేనోపనిషత్తులో కొంత పద్యభాగం, కొంత గద్యభాగం ఉంది. పద్యభాగంలో బ్రహ్మ పదార్థాన్ని గురించిన తాత్త్విక చింతన ఉంటుంది. దీనిని గురించే ఇంతవరకు చెప్పుకున్నాము. మిగిలిన గద్యభాగంలో బ్రహ్మతత్త్వాన్ని వివరించే చక్కని కథ చెప్పబడుతుంది.

ప్రపంచంలో మానవులకే కాదు, దేవతలకు కూడా మూల కారణం బ్రహ్మపదార్థమే. బ్రహ్మసహకారం లేనిదే అగ్ని ప్రజ్వలించదు. గాలి వీచదు. అగ్నీ,

వాయువు, ఇంద్రుడు మొదలయిన దేవతలందరూ బ్రహ్మ పరాధీనులే, కాని అప్పుడప్పుడు దేవతలు ఈ మాట మరిచి విజయ గర్వంతో విఱ్ఱవీగుతుంటారు. ఈ విషయం గమనించి బ్రహ్మ ఒకసారి యక్షరూపాన్ని ధరించి దేవతల యెదుట ప్రత్యక్షమవుతాడు. దేవతలకు ఆ యక్షుడెవరో తెలియదు. అగ్ని దేవత యక్షుని దగ్గరికి వెళ్తాడు. నీవెవరివని యక్షుడడుగుతాడు. నేనగ్నిని, నేను అన్నింటినీ దహించగలనని అగ్ని సమాధానం చెప్తాడు. యక్షుడు ఒక గడ్డిపోచ చూపించి దీనిని కాల్చుచూద్దా మంటాడు. అగ్ని దేవుడు ఎంత ప్రయత్నించినా దాన్ని కాల్చలేక పోతాడు. అలాగే వాయుదేవుడు కూడా యక్షుడు చూపిన గడ్డిపోచను కదిలించలేక పోతాడు. చివరకు ఇంద్రుడు స్వయంగా యక్షుని సమీపిస్తాడు. ఇంద్రుని చూడగానే యక్షుడు మాయమవుతాడు. యక్షుని స్థానంలో అతిలోక సుందరి అయిన హైమవతి 'ఉమ' కనిపిస్తుంది. అంతకు ముందు అక్కడవున్న ఆ యక్షుడెవరో చెప్పవలసిందని ఇంద్రుడామెను ప్రార్థిస్తాడు. అతడే బ్రహ్మ అని ఆమె వివరిస్తుంది. ఆ బ్రహ్మబలం వల్లనే మీరు విజయాన్ని సాధిస్తున్నారని ఆమె చెప్తుంది. అంతటితో దేవతలకు ఒళ్ళు తెలుస్తుంది, కళ్ళు తెరుపుకు పడుతాయి. కాని బ్రహ్మ సాక్షాత్కారం కలిగిందని వాళ్ళందరు తన్మయత్వం చెందుతారు. మబ్బులో మెరుపు మెరిసినట్లు బ్రహ్మ తేజస్సు ఉన్నట్టుండి. వాళ్ళను ఉబ్బి తబ్బిబ్బులయ్యేటట్టు చేసి మాయమౌతుంది. బ్రహ్మ సంస్పర్శ ఒక క్షణమనుభవించినా చాలునని అగ్ని, వాయువు, ఇంద్రుడు పరవశించిపోతారు.

ఈ కథ చెప్పి గురువు తన శిష్యులకు బ్రహ్మోపదేశం చేస్తాడు. క్షణంలో మిరుమిట్లు కొలిపినట్టు ప్రకాశించి అంతర్థానమయ్యే బ్రహ్మానుభూతి పరమేశ్వరి అనుగ్రహం వల్లనే సాధ్యమవుతుందని హైమవతి ఆవిర్భావం చెపుతుంది. అగ్నికీ, వాయువుకూ కనిపించని పరమేశ్వరి ఇంద్రునికి కనిపిస్తుంది. అగ్ని నేత్ర కాంతికీ, వాయువు వాక్కుకూ, ఇంద్రుడు మనస్సుకూ ప్రతీకంగా ఇక్కడ కనిపిస్తారు. కళ్ళకు, వాక్కుకూ ఆత్మ సామ్రాజ్యంలో ప్రవేశం లేదు. మనస్సు కూడా తనంతట తాను అక్కడ అడుగు పెట్టలేదు. కాని బుద్ధి బలంతో, ధీశక్తితో-అంటే శక్తి స్వరూపిణియైన 'పరమేశ్వరి' ప్రాపకంతో-మనస్సు ఆత్మను చేరుకోగలుగుతుంది. ఆత్మ మనస్సుల యీ సంయోగమే యోగం. దీన్ని ఆధిదైవతంగా ఆరాధించవచ్చు, లేదా ఆధ్యాత్మికంగా అనుభవించవచ్చు. బాహ్యంగా మనం ఆరాధించే మన ఇష్ట దైవమే

అంతరంగికంగా మనలో ఆత్మ రూపంలో ప్రతిష్ఠింపబడి ఉన్నది. 'స్వాత్మైవ దేవతా ప్రోక్తా' – తన ఆత్మే దేవత. కంటి రెప్పలు వాల్చగానే అంతరంగంలో వెలుగు కనిపిస్తుంది. కళ్లు తెరచుకొని ఉన్నప్పుడు బాహ్య సౌందర్యం కనిపిస్తుంది. బాహ్య సౌందర్యానికీ, అంతరంగ లావణ్యానికీ భేదమేమీ లేదు. బాహ్య సౌందర్యం ఆధిదైవికం. అంతరంగ లావణ్యం ఆధ్యాత్మికం. ఆధిదైవికమయిన సాక్షాత్కారం క్షణికం. మెరుము మెరిసినంత కాలం, రెప్పవాల్చి యెత్తినంత సేపు ఆ సౌందర్యం కనిపిస్తుంది. కాని ఆధ్యాత్మికమైన అనుభూతి శాశ్వతమైనది. మొట్ట మొదట ఇంద్రియములు, ఇంద్రియార్థములు మనస్సులో లీనమవుతాయి. ఆ తర్వాత మనస్సు ఆత్మలో లయించి పోతుంది. ఇది క్రమంగా జరుగుతుంది, కలకాలం నిలుస్తుంది. ఒకానొక రమణీయ దృశ్యాన్ని క్రమంగా సమీపించే సమయంలో మెట్లు మెట్లుగా పెరిగి పెంపొందే సౌందర్యానుభూతి లాగా ఈ ఆత్మానుభూతి అంచెలంచెలుగా ఉదయిస్తుంది. చివరకు పున్నమనాటి వెన్నెలవలె పరిపూర్ణమైన అనుభూతి ఏర్పడుతుంది.

ఇలాంటి పరిపూర్ణానుభూతి ఏర్పడినప్పుడు ప్రపంచమంతా నందన వనంలా కనిపిస్తుంది. ప్రపంచంలోని ప్రతి జీవి కూడా ఒక పూలచెట్టుగా గోచరిస్తాడు. ఇలాంటి ఉద్యాన వనాన్ని ఈ ఉపనిషత్తు తద్వనమంటుంది. తత్త్వం తెలిసిన తాత్త్వికుల తదీయ భావనతో ఏర్పడిన వనం కాబట్టి ఇందులో ప్రతి చెట్టూ, ప్రతి కొమ్మా, ప్రతి ఆకూ, ప్రతి పూవూ తన్మయ భావంతో 'తదరే అనంతం' అని తత్త్వ సంగీతం వినిపిస్తాయి. ఆ సంగీతం వినేందుకు సకల చరాచర సృష్టి ఎగబడుతుంది.

ఈ మాట విన్న శిష్యులు 'అయితే మాకు కూడా ఆ సంగీతం, ఆ తత్త్వం, ఆ రహస్యం, ఆ ఉపనిషత్తు నేర్పవలసింద'ని గురువుగారిని అడుగుతారు. 'అది మీకు ఇంతకు ముందే చెప్పేశాన'ని గురువుగారు చెప్పక చెప్పినట్టు తప్పించుకుంటారు. కాని యీ రహస్యం తెలుసుకునేందుకు కావలసిన సాధన సంపత్తిని ఉపనిషత్తు సంగ్రహంగా చెప్తుంది. తపస్సు, సంయమం, ఆచరణ-ఈ మూడూ దీనికి పట్టు గొమ్మలు ఆత్మ తత్త్వం తెలుసుకునేందుకు ముందు తీరని ఆరాటం ఏర్పడాలి. ఆ తర్వాత ఇంద్రియ నిగ్రహాన్ని సాధించాలి. ఈ రెంటింటితో అరితేరిన తర్వాత ఆచరణలో నెగ్గాలి.

మనస్సునూ, వాక్కునూ అనుసరించే ఆచరణను అలవరచుకోవాలి. అప్పుడు వేదరూపంలో ఉన్న విజ్ఞాన సర్వస్వం సాధకునికి కరతలా మలకం అవుతుంది. ఈ సాధనకూ, ఈ జ్ఞానానికీ పరమావధి - సత్య సందర్శనం. ఇలా వేదవిహిత మైన మార్గంలో పయనించి సత్యాన్వేషణ చేసి సత్యాన్ని సాక్షాత్కరించుకొన్న బ్రహ్మవేత్తకు ఇహం, పరం రెండూ ఆనందకరంగా ఉంటాయి. ఈ లోకంలో సౌఖ్యం, పరలోకంలో శాంతి అతని సొత్తయిపోతాయి.

—స్వర్గే లోకే జ్యాయే ప్రతితిష్ఠతి—



# ఇహం - పరం

***''యదేవేహ తదముత్ర యదముత్ర తదన్వి***హ'' కఠ (2-1-10)

కంటికి కనిపించేది ఇహలోకం. కనిపించనిది పరలోకం. ఇక్కడిది ఇహం. ఎక్కడిదో ఎలాంటిదో తెలియనిది పరం. కాని ఇక్కడ ఉన్నదే అక్కడ కూడా వుంది, అక్కడ వున్నదే యిక్కడ కూడా వుందని కఠోపనిషత్తు కచ్చితంగా చెప్తుంది ''యదేవ-ఇహ తత్-అముత్ర; యత్-అముత్ర తత్-అను-ఇహ'' అని కాఠక నిర్ణయం. కాని యీ పరమ రహస్యాన్ని జీవిత కాలంలో గ్రహించటం సామాన్య జీవులకు సాధ్యం కాదు. ప్రత్యక్షంగా కనిపించి మురిపించే ఐహిక సుఖాలను పరిత్యజించి ఎప్పుడో ఎక్కడో ఏ రూపంలోనో అనుభవించబోయే ఆముష్మిక శాంతి సౌఖ్యాల కోసం ప్రయత్నించటం శుద్ధ పార్థివ జీవికి మనస్కరించదు. ఇహలోకం వదిలితేనే కాని పరలోకం ప్రాప్తించదు. పరలోకంలో ప్రవేశించిన తర్వాత ఇహం ఎలాంటిదో తెలియక పోవచ్చు. ఈ లోకంలో చేసిన పనులకు మరో లోకంలో ఫలితం అనుభవించవలసి వుంటుందనేందుకు ఆధార మేముంది? మరణించిన తర్వాత భౌతిక శరీరం మట్టిలో కలిసి పోతుంది. లేదా పిసికెడు బూడిదగా మారిపోతుంది. అలాంటప్పుడు మరణానంతరం మరో లోకం, మరో జీవితం ఎక్కడ ఎలా వుంటుంది? ఇలాంటి చిక్కు ప్రశ్నలకు చక్కని

సమాధానం కఠోపనిషత్తులో కనిపిస్తుంది. ఇది కృష్ణయజుర్వేదంలో కఠ శాఖకు సంబంధించిన ఉపనిషత్తు అవటం వల్ల దీనికి కఠోపనిషత్తని పేరు వచ్చింది. జీవితంలో చాల కఠినమైన సమస్య మరణం, మరణానంతర జీవిత మీమాంస. ఈ కఠిన సమస్యకు సంబంధించింది కావటంవల్ల కూడా దీనికి కఠోపనిషత్తని పేరువచ్చి వుండవచ్చు. కఠక మహర్షి చెప్పింది కాబట్టి కూడా దీని కాఠకమని వ్యవహరించి వుండవచ్చు.

ఇహ పరాలకు మధ్య మరణం పెట్టని గోడలా అడ్డు వస్తుంది. పరలోక రహస్యం తెలుసుకోవాలంటే మృత్యు ముఖంలో ప్రవేశించాలి. కాని మరణమంటే ప్రతి ప్రాణికీ ఎక్కడ లేని భయం. మరణ భయం వల్లనే జీవికి జీవితం మీద మితిలేని మమకారం ఏర్పడుతుంది. చివరకు మరణం ఎవరికీ తప్పదు. కాని కావాలని ఎవ్వరూ మరణాన్ని వరించరు. ఎంతకాలం జీవించినా అవసాన దశలో మరి కొంత కాలం జీవిస్తే బాగుండుననిపిస్తుంది. వయసు మళ్ళిన వాళ్ళను కూడా వేధించే యీ మరణ భయాన్ని పిన్న వయస్సులోనే నచికేతుడనే ఋషికుమారుడు పరిత్యజించి జయించాడు. తండ్రి నోట పొరబాటున వచ్చిన మాటను నిలబెట్టేందుకు ఈ కుఱ్ఱవాడు తన యిష్టం మీద నిర్భయంగా యమలోకంలో ప్రవేశిస్తాడు. యమలోకంలో యమునికీ నచికేతునికీ జరిగిన సంభాషణే కఠోపనిషత్తు. ఇందులో మృత్యు దేవత స్వయంగా మృత్యువును గురించి మర్త్యులకే కాక అమరులకు కూడా తెలియని పరమ రహస్యాన్ని వివరించి చెప్తాడు.

నచికేతుడు చాలా అమాయకుడు. తెలివి తేటలకు తక్కువ లేదు, కాని ఎవరిని ఏమి అడగవచ్చు, ఏమి అడగ కూడదనే లౌక్యం కొంచెం తక్కువ. అతని తండ్రి ఉద్దాలకునికి మహాత్యాగి అని పేరు. ఎన్నో యజ్ఞయాగాదులు చేసి సర్వస్వం దానం చేసిన వదాన్యుడు కాని అతని కుమారుడయిన నచికేతునికి ఒక చిన్న సందేహం వచ్చింది. "మా నాన్న బక్క చిక్కిన పశువులను ఏరి కోరి అందరికీ దానం చేస్తున్నట్టున్నాడు. పాలులేక పొదుగులు ఎండిపోయిన యీ గోవులను దానం చేసినందువల్ల లాభమేముంది, వాటికి గడ్డి మేసేందుకు గాని కనీసం నీళ్ళు తాగేందుకు కూడా నాలి లేకుండా ఉంది. ఆకలి దప్పులు పోయిన యీ పశువులను దానం చేసినందువల్ల పుణ్య లోకాలు ప్రాప్తించకపోగా నిరానందకరమైన నికృష్టనరకం లభిస్తుంది" ఇలా ఆలోచించి ఆలోచించి చివరకు ధైర్యం తెచ్చుకొని ఆ పిల్లవాడు తండ్రి దగ్గిరికి వెళ్ళి, "నాన్నా, నీకు నేనంటే

చాలా ఇష్టం కదా?'' అని అడుగుతాడు. ''అవును'' అంటాడు తండ్రి. ''మరి ఇష్టమైనవన్నీ దానం చేసే యీ మహాయాగంలో నన్నెవ్వరి కిస్తావు, నాన్నా?'' అని అమాయికంగా ప్రశ్నిస్తాడు కుమారుడు. తండ్రి మొదటిసారి నవ్వి ఊరుకుంటాడు. మాటి మాటికి అదే ప్రశ్న వేస్తున్న కుమారుడిమీద తండ్రికి కోపంవస్తుంది. కోపావేశంతో ఏమంటున్నాడో తెలియక ''నిన్ను మృత్యు దేవతకు ఇస్తా'' నంటాడు తండ్రి. నచికేతునికి ముందు ఆశ్చర్యం వేస్తుంది. ''మొన్న మొన్న పుట్టిన వాణ్ణి. గారాబంగా పెరిగిన వాణ్ణి. చాలా మంది కంటె చిన్నవాణ్ణి. నన్ను యముడు తన లోకం లోకి రానిస్తాడా?'' అని ఆలోచన వేస్తుంది. కాని యమ సన్నిధి చేరేందుకు గట్టిగా పట్టుదల పడతాడు. తండ్రి తన తొందరపాటుకు పరితపిస్తాడు. కాని వయసుకు చిన్నవాడయినా వివేక విజ్ఞానాల్లో పెద్ద పెద్ద పండితులకు మించిన తపస్సంపన్ను డవటం వల్ల కుమారుడు తండ్రికి పరిపరి విధాల నచ్చ చెప్తాడు. ''మన పూర్వీకులు ఇప్పుడు లేరు. ఇప్పుడున్న వాళ్లు కొంత కాలానికి ఉండరు. ఇది జీవధర్మం. పుట్టిన ప్రతి ప్రాణికీ గిట్టక తప్పదు. కాబట్టి మరణం దిగులు పడవలసిన విషయం కాదు. పంటలాగా మనిషి పండుతాడు. పండిన పంట రాలిపోయి కొత్త పంట వచ్చినట్టే కొందరు పోతారు. మరి కొందరు వస్తారు. దీనికి చింతించి ప్రయోజనం లేద 'ని తండ్రిని వైరాగ్యపు మాటలతో ఓదార్చి నచికేతుడు యమ సదనం చేరుకుంటాడు.

అనుకున్నట్టు యముడు ఇంట్లో ఉండడు. ఇంత తొందరగా ఈ కుఱ్ఱవాడు తన దగ్గరికి వస్తాడని ఆయనకు తెలియదు గదా! యముని రాకకోసం నచికేతుడు మూడు రాత్రులు వేచివుండవలసి వచ్చింది. తలవని తలంపుగా తన యింటికి వచ్చిన అతిథిని మూడు రాత్రులు నిద్రాహారాలు లేకుండా ఉంచినందుకు యముడు చాలా బాధ పడతాడు. ఇంటికి వచ్చిన అతిథిని మర్యాదగా గౌరవించని గృహస్థుని పూజలు-పునస్కారాలు, జపాలు-తపాలు, దానాలు-ధర్మాలు అన్నీ వ్యర్థమయిపోతాయి కదా, అని యముడు చాలా భయభక్తులతో నచికేతునికి స్వాగతం చెప్పి అన్నపానాదులతో సత్కరించి నమస్కరిస్తాడు. పితృ వాక్యపరిపాలనకు కట్టుబడి సత్యనిష్ఠతో బ్రహ్మ నిర్యాణం పొందిన బ్రహ్మచారి ముఖంలోని బ్రహ్మవర్చస్సు అలాంటిది. యమధర్మరాజంటే అందరికీ యమభయం. అలాంటి యముడు మునికుమారుని సంయమానికి కట్టుబడిపోతాడు. ''మూడు రాత్రులు నా కోసం కాచుకొని వున్నావు, కాబట్టి నీ యిష్టం వచ్చినవి మూడు వరాలు కోరుకో ఇస్తా'' నంటాడు యముడు.

ఇహలోకంలో నచికేతునికి కావలసింది ఏమి లేదు. కాని తండ్రి తన కోసం దిగులుపడుతున్నాడనే విచారం మాత్రం మనస్సులో వుంది. అందువల్ల మొట్టమొదట అతను కోరుకున్న వరం-తన తండ్రికి తన కుమారుని గురించిన విచారం లేకుండా వుండాలని, వెంటనే యముడు 'సరే' నంటాడు. మీ తండ్రికి నీ దిగులు లేకుండా రాత్రిళ్ళు హాయిగా నిద్రపడుతుందని యమధర్మరాజు ధైర్యం చెప్తాడు.

స్వర్గలోకంలో మృత్యు భయం లేదు. ముసలితనం కూడా ఉండదు. ఆకలి, దప్పులు, చీకూ చింతా లేకుండా స్వర్గలోకంలో అందరూ నిత్యానందం అనుభవిస్తూ ఉంటారు. అగ్నిహోత్రాన్ని ఆరాధిస్తే యిలాంటి స్వర్గం లభిస్తుందని అంటారు. యమధర్మరాజుకు ఈ అగ్ని విద్య కరతలామలకం. స్వర్గ సౌఖ్యాన్ని ప్రసాదించే అగ్ని విద్యను స్వాధీన పరచుకున్న యముడు ప్రత్యక్షంగా కనిపించేసరికి అతనివల్ల ఆ విద్యను నేర్చుకోవాలని నచికేతునికి అభిలాష కలుగుతుంది. దానినే రెండో వరంగా అతను కోరుకుంటాడు. అడిగిన వెంటనే అంతకుడు అగ్ని విద్యను సాంతంగా వివరిస్తాడు. యముడు చెప్పిన విద్యనంతా నచికేతుడు సూవంటు రాయిలా గ్రహిస్తాడు. ఉపదేశించిన ప్రక్రియ నంతా 'తు' 'చ' తప్పకుండా తిరిగి చెప్తాడు. నచికేతుని గ్రహణశక్తిని యముడు మెచ్చుకొని అతనికి ఒక హారం కానుకగా ఇస్తాడు. అంతేకాక ఇక ముందు ప్రాణికోటి ఆరాధించే అగ్ని నాచికేతాగ్ని అనే పేరుతో వ్యవహరింప బడుతుందని కూడా యముడు ప్రకటిస్తాడు. ఈ లోకానికి, పరలోకానికి, శాంతి సౌఖ్యాలు ప్రసాదించే పరమ రహస్యమైన అగ్ని విద్య ఒక్క క్షణంలో నాచి కేతునికి హస్త గతమైపోయింది.

ఉదయం, మధ్యాహ్నం, సాయంత్రం- ఈ మూడు సంధ్యల్లో రోజుకు మూడుసార్లు ఈ నాచికేతాగ్ని (నాసిక నుండి వెలువడే యోగాగ్ని)ని ఆరాధించే నిత్యాగ్నిహోత్రులకు అధిభౌతికంగా, అధిదైవికంగా, ఆధ్యాత్మికంగా అనంత శాంతి లభిస్తుందని అంతకుని తీర్పు. ఈ నాచికేతాగ్నినే చిదగ్ని అనవచ్చు. దీనినుండే చిద్విలాసం, చిచ్ఛక్తి విలాసం ఆవిర్భవిస్తుంది. ''ఈ ముప్పురిని గ్రహించిన ముని పుంగవులకు మృత్యుభయం ఉండదు. బ్రహ్మ వర్చస్సు లభించగలదని చెప్పి యమధర్మరాజు మూడోవరం కోరుకోమని నచికేతునికి అనుమతి యిస్తాడు.

అసలు విషయం ఇక్కడే ఆరంభమవుతుంది. యమ ధర్మరాజుకు ధర్మ సందేహం కూడా ఇక్కడే ఏర్పడుతుంది. మరణించిన తర్వాత మనిషిలో మిగిలేదేమిటి? అసలేమయినా చివరకు మిగులుతుందా? మిగలదా? కొంతమంది మరణానంతరం కూడా జీవికి ఉనికి వుందంటారు. కొంతమంది లేదంటారు. ''ఈ విషయంలో మీ అభిప్రాయం ఏమిటో నాకు తెలుసుకోవాలని అభిలాషగా వుందం''టాడు నచికేతుడు- నయంగా, వినయంగా. ఎంత వినయంగా అడిగినా, కోరిన వరం చాలా గొప్పదని యమధర్మరాజు గమనిస్తాడు. ''దేవాధిదేవతలు కూడా ఈ రహస్యం తెలుసుకునేందుకు ప్రయత్నించారు. ఇది చాలా సూక్ష్మమైన విషయం. మరో వరం ఏదయినా కోరుకో, ఇస్తాను. ఈ విషయం మాత్రం నా చేత చెప్పించకు. నన్ను ఒత్తిడి చేయకు'' అంటాడు యముడు. నచికేతుడంతకంటె తెలివయినవాడు. ఎలాగో యమ సన్నిధి లభించింది. ఈ అవకాశం పోగొట్టుకుంటే లాభం లేదని నచికేతుడు చాలా యుక్తిగా అంటాడు : ''దేవతలకు కూడా బోధపడని విషయం మిమ్మల్ని అడుగుతున్నాననే విషయం నాకు తెలుసు. కాని అలాంటి విషయం మీలాంటి వాళ్ళ నడక్క మరెవ్వరినయినా అడిగి ప్రయోజన మేముంది? మృత్యువును గురించి మీరు చెప్పాలి, నేను వినాలి. నాకు మరో వరం అక్కరలేదు. ఈ రహస్యం చెప్పి నన్ను అనుగ్రహించండి'' అంటాడు నచికేతుడు.

కాని యముడు కూడా అక్షరాలా కాలాంతకుడు. "నచికేతా, నీవు చిన్నవాడివి. లోకంలో భోగభాగ్యాలను నీవు అనుభవించలేదు. నీకు కావలసిన సంపద నేనిస్తాను. విశాలమైన సామ్రాజ్యం ఇస్తాను. ధనకనకవస్తువాహనాలను ఇస్తాను. బంగారం లాంటి సంతానం ఇస్తాను. కొడుకులు, మనువళ్ల నూరు కాలాలపాటు జీవించేట్టు చేస్తాను నీవు ఎన్నాళ్ల జీవించాలనుకుంటే అన్నాళ్ళు జీవించేట్టు దీర్ఘాయువును ఇస్తాను. నీవు కోరిన కోరికలు తీరేట్టు చేస్తాను. ఇహలోకంలో అనుభవించదగిన ఏ సుఖాన్నయినా కోరుకో. అప్సరసల్లాంటి అందగత్తెలను ఇస్తాను. నృత్య సంగీతాలతో వాళ్లు నిన్ను ఆనందంలో ఓలలాడిస్తారు. వీటన్నిటికిమించిన మరే సౌఖ్యమైనాసరే కోరుకో. కాని మరణానంతర రహస్యాన్ని గురించిమాత్రం నన్ను అడగకు. మరో వరమేదయినా కోరుకో'' అని పరి పరి విధాల యముడు నచికేతునికి నచ్చచెప్పేందుకు ప్రయత్నిస్తాడు. కాని నచికేతుడు ఒక్కమాటలో ఈ సుఖాల సారహీనతను తేల్చిచెప్పి అన్నింటినీ తృణీకరిస్తాడు.

"భోగభాగ్యాలు శాశ్వతం కావు. నేడున్నవి రేపుండవు. వాటి ననుభవించినందువల్ల శరీరంలోని తేజస్సు క్షీణిస్తుందే కాని రాణించదు. ఇక దీర్ఘాయువు పిచ్చిభ్రమ. ఎన్ని సంవత్సరాలు జీవించినా అది స్వల్పంగానే కనిపిస్తుంది. చివరకు మరణం ఎటూ తప్పదు. మనిషికి తృప్తినిచ్చేది డబ్బు కాదు, తెలివి. నాకు కావలసింది అర్థం కాదు, పరమార్థం. నీ దయవల్ల జీవితం లభించింది, నీ అనుగ్రహం వల్లనే జీవిత రహస్యం తెలుసుకోవాలని నాకు గాఢంగా వుంది. మీవల్ల నేను కోరేది అదొక్కటే, మరో వరం నాకక్కర లేదు''– అని నచికేతుడు నిక్కచ్చిగా చెప్తాడు. ''జరామరణ సర్వాధికారియైన మీ సన్నిధిలో కూడా క్షణభంగుర భోగలాలసనుస్మరించే మూర్ఖుడెవడుంటాడు? ఇహలోకంలోని నశ్వర శరీరానికి, పరలోకంలో కూడా ప్రచరించే అవినశ్వరమైన ఆత్మతత్త్వానికి పరస్పర సంబంధాన్ని గురించి పలువురు పలురకాలుగా చెప్తారు. ఈ విషయంలో మీ అభిప్రాయం ఏమిటో చెప్పి నన్ను అనుగ్రహించండి''- అని మళ్ళీ మళ్ళీ యమరాజును బ్రతిమాలు కుంటాడు.

ఇక తప్పదను కుంటాడు యముడు. కాని నచికేతుని బ్రహ్మనిష్ఠకు లోలోపల ఆనందిస్తాడు. ప్రపంచంలో మనకు కొన్ని ఇష్టమైనవి ఉంటాయి. కొన్ని శ్రేష్ఠమైనవి ఉంటాయి. అప్పటికప్పుడు ఆనందాన్ని ఇచ్చే ఇంద్రియసుఖం ఎక్కువ మందికి అభీష్టంగా తోస్తుంది. దీనినే 'ప్రేయస్సు' అంటారు. దీనికి భిన్నంగా శాశ్వతమైన అనందాన్ని ప్రసాదించే బ్రహ్మజ్ఞానం లేక ఆత్మానుభూతి అతీంద్రియమైనది. అందరికీ అందుబాటులో లేనిది, అర్థం కానిది. దీనినే 'శ్రేయస్సు' అంటారు. ఒకవైపు ప్రేయస్సు, మరోవైపు శ్రేయస్సు, ప్రాపంచిక జీవిని తమ తమ వైపు లాగుకొనేందుకు ప్రయత్నిస్తాయి. ప్రేయస్సు బలీయంగా ఉండటంవల్ల సామాన్యుల మనస్సు దానివైపే మొగ్గుతుంది. కాని వివేకవంతులు, బుద్ధిమంతులు లౌకిక యోగక్షేమాలను లెక్కచేయక పారలౌకిక పరమార్థాన్ని ప్రసాదించే శ్రేయోమార్గాన్నే అనుసరిస్తారు. అలాంటి కొద్దిమంది శ్రేయోభిలాషుల్లో నచికేతుడు ముఖ్యుడని యముడు చిరంజీవిని అభినందిస్తాడు. బ్రహ్మవిద్యకు తగిన వాడవని వీపు తట్టి ఆశీర్వదిస్తాడు. మహా పండితులుగా ప్రపంచంలో చలా మణి అవుతున్న వాళ్ళు కూడా డబ్బుకోసం గడ్డితిని పరమార్థాన్ని అర్థానికి అర్పిస్తారు. గుడ్డివాడు మరో గుడ్డివాడికి దారి చూపించినట్టు తనకంతా తెలుసని విఱ్ఱవీగే పండితబ్రువులు తెలియని వాళ్ళను తప్పుదారి బట్టిస్తారు. బొత్తిగా తెలి

యని వాళ్ళు ఇహమే సర్వస్వమని భావించి పరానికి దూరమై పోతారు. ఎవరయినా ఆత్మ తత్త్వం వివరించి చెప్పగల అధికారులు కనిపించినా వారి దగ్గరికి వెళ్ళి తెలుసుకోవాలన్న ఆసక్తి చాల మందికి ఉండదు. ఒకవేళ కొందరు వెళ్ళి అలాంటి తత్త్వజ్ఞులు చెప్పిన మాటలు విన్నా, వాటిని అర్థం చేసుకొనే వాళ్ళు చాలా కొద్ది మంది వుంటారు. ఇలా చెప్పగలిగే వాళ్ళే తక్కువ. వినే వాళ్లు అంతకంటే తక్కువ. విని అర్థం చేసుకునే వాళ్ళు మరీ తక్కువ. బహు సూక్ష్మమైన బ్రహ్మ పదార్థాన్ని సామాన్యులు వివరించి చెప్పలేరు. మనంతట మనం ఆలోచిస్తే బోధపడేది కూడా కాదు. తర్కానికి అందదు. త్యాగం, తపస్సు, నిష్ఠ-వీటితో కాని ఆత్మ తత్త్వం తెలుసుకునేందుకు అధికారం లభించదు. అనిత్యమైన శరీరంలో నిత్యమైన ఆత్మ తత్త్వం నిగూఢంగా దాగి వున్నది. ఈ దాగిన సత్యాన్ని ఆవిష్కరించుకునేందుకు నాచికేతమైన యోగాగ్ని ఒక్కటే సాధన. పేరు ప్రతిష్ఠలు, భోగ భాగ్యాలు, శాంతి సౌఖ్యాలు, యజ్ఞ యాగాలు అన్నింటినీ త్యజించి ఆత్మ తత్త్వం తెలుసుకునేందుకు అచంచల దీక్షతో ఎదురు చూస్తున్న నచికేతుణ్ణి ఇలా ప్రశంసించటం గమనించి ఆ కుర్రవాడు సిగ్గు పడుతాడు. ఏవో ముఖ ప్రీతి మాటలు చెప్పి అసలు విషయం దాటేస్తాడేమోననే అనుమానంతో నచికేతుడు మరో సారి వినయంతో అనునయంతో తన కోరికను జ్ఞాపకం చేస్తూ "ధర్మానికీ, అధర్మానికీ, కర్మకు, అకర్మకూ అతీతమైన త్రికాల సత్యాన్ని చూచింది చూచినట్టు సూచించవలసిం"దని యమధర్మ రాజును వేడుకుంటాడు.

చివరకు కాలాంతకుడు కాలజ్ఞానాన్ని మాటలలో మాటు పెట్టి అందించేందుకు ఆరంభిస్తాడు; "వేద వేదాంగాలు ఏ పదాన్ని ప్రతిపాదిస్తాయో, జపతపాలు ఏ ఫలాన్ని ప్రసాదిస్తాయో, బ్రహ్మచర్య సాధనలు ఏ సిద్ధిని సాధిస్తాయో ఆ పరతత్త్వమే ప్రణవం"- అని సూత్రప్రాయంగా బ్రహ్మతత్త్వాన్ని బ్రహ్మవేత్త అయిన యమధర్మరాజు సూచ్యాసూచ్యంగా సూచిస్తాడు. ఆ తర్వాత వ్యాఖ్యానం ఆరంభమవుతుంది. ప్రణవమే బ్రహ్మ, ప్రణవమే పరతత్త్వం ప్రణవమే ప్రపంచానికి ఆధారం. ప్రణవమే ఇహానికీ పరానికీ మూలం. ప్రణవ తత్త్వం తెలిస్తే పరతత్త్వం తెలిసినట్టే. ప్రణవసారం గ్రహిస్తే, ఏది కావాలనుకుంటే, అది అతనిదవుతుంది. ప్రణవాన్ని ఆధారం చేసుకొని బ్రహ్మలోకంలో ప్రవేశించవచ్చు. పరబ్రహ్మకూ, పరమాత్మకూ ప్రతీకమైన ప్రణవనాదమే అంతరాత్మలో

చేరి భౌతిక శరీరాన్ని నడిపిస్తూ వుంటుంది. మరణించేది భౌతిక కాయం. ఆత్మకు జరామరణాలు లేవు. అది నిత్యం, శాశ్వతం, సనాతనం. శరీరం కృశించినా ఆత్మ కృశించదు. శరీరం నశించినా ఆత్మ నశించదు. శరీరాన్ని బాధించే ఆధి వాధ్యులు ఆత్మను స్పృశించవు. ప్రపంచ మంతటా వ్యాపించివున్న బ్రహ్మ పదార్థమే మానవ శరీరంలో ఆత్మరూపంలో దాగివుంటుంది. అణువుకంటె సూక్ష్మమైన ఆత్మ బ్రహ్మాండం కంటె పెద్దది. చీకూ-చింతా, సంకల్పం-వికల్పం లేని సర్వసంగ పరిత్యాగి పరమాత్మ అనుగ్రహం వల్లనే తనలోని ఆత్మను చూడగలుగుతాడు, తన్ను తాను తెలుసుకొని, తనలో తాను లీనం కాగలుగుతాడు శరీరం స్థావరం. ఆత్మ జంగమం. శరీరం కదలకుండా కుదురుగా కూర్చొన్నా, ఆత్మ అంతటా సంచరిస్తుంది. శరీరం నిద్రపోతున్నా, ఆత్మ మెలకువతో బ్రహ్మాండాన్ని చుట్టివస్తుంది. అలాంటి ఆత్మ తత్త్వాన్ని అవగాహన చేసుకోవాలంటే పసిడి పూతలకు మురిసిపోని పస గల రసదృష్టి కావాలి. ఈ దృష్టి తెలివితేటలతో రాదు- చదువు సంధ్యలతో సాధ్యం కాదు. వినికిడి వల్ల చిక్కదు. ఆత్మ యెవరిని అనుగ్రహిస్తే వాళ్ళకే ఆత్మతత్త్వం బోధపడుతుంది. ఆత్మను సర్వాత్మనా ఆరాధించిన వాళ్ళనే ఆత్మ అనుగ్రహిస్తుంది. వాళ్ళకు ఆత్మ తన రహస్యాన్ని విప్పి చెప్తుంది. మంచి మనసుతో మంచి పనులు చేసి మంచిని పెంచే మంచి వాళ్ళకే యీ జ్ఞానం లభిస్తుంది. ప్రతిభ, పరాక్రమం- రెండింటినీ రెండు చేతులతో తీసుకొని మృత్యువును నంచుకొంటూ కబళించే ఆత్మతత్త్వాన్ని సామాన్యులు అవగాహన చేసుకోలేరు. లాఇ ఆత్మ వైభవాన్ని కొనియాడుతూ యముడు పరమాత్మ స్వరూపాన్ని కొన్ని దృష్టాంతాలతో స్పష్టీకరించేందుకు ప్రయత్నిస్తాడు.

పురాకృత పుణ్యం వల్ల లభించే మానవ శరీరంలో మారుమూలన దహరాకాశంలో నీడతో కూడిన ఎండలాగా జీవాత్మతో కలిసి పరమాత్మ నివసించి వుంటుందని తపస్సంపన్నులయిన బ్రహ్మవేత్తలు చెప్తారు. నిత్యం త్రికాల సంధ్యావందనం చేసి అగ్నిహోత్రాన్ని అయిదు రూపాల్లో ఆరాధించే నైష్ఠికులకు ఆత్మ సాక్షాత్కరిస్తుంది. ఎండనీడలు ఒకదాని ప్రక్కన ఒకటి ఒకదానినొకటి ఆశ్రయించి వుంటాయి. ఎండవల్లనే నీడ ఏర్పడుతుంది. నీడలో కూడా కొంత కాంతి వుంటుంది. ఈ కాంతికి కారణం ప్రక్కనున్న ఎండే, ఇదే విధంగా జీవాత్మ పరమాత్మలు అన్యోన్యాశ్రితంగా మానవ శరీరంలో ఉన్నట్టు ఆత్మవంతులు చూచి చెప్పారు. నీడలు వేరువేరుగా ఉండవచ్చుకాని

ఎండ అంతటా ఒకటే. అదే విధంగా జీవాత్మలు వేరువేరుగా కనిపించవచ్చు, కాని పరమాత్మతత్త్వం అందరికీ సమానమే. జీవాత్మకు శరీరం ఎల్లలు కల్పిస్తుంది. కాని పరమాత్మ సర్వాంతర్యామి. ప్రతి జీవి దగ్గర ఉన్నట్టుగానే ఉండి అందరికీ కర్మఫలాన్ని అందిస్తూ ఉంటుంది. ఎవరు చేసిన దానికి వాళ్ళు ఫలితం అనుభవిస్తూ ఉంటారు. ఇలా కర్మఫలం పంచిపెట్టడం పరమాత్మ లక్షణం. అనుభవించటం జీవాత్మ లక్షణం. ఇదే ఋతం.

ఈ ఋతాన్ని సాధించి, బోధపరచుకొని, సాక్షాత్కరించుకునేందుకు ప్రజలు యజ్ఞాలు, యాగాలు, క్రతువులు, వ్రతాలు చేస్తారు. రక్తమాంసాలతో కూడిన ఈ శరీరంలో అశరీరమైన ఆత్మతత్త్వం ఎక్కడ ఎలా వుంటుందని నిరూపించేందుకు కఠోపనిషత్తు ఒక చక్కని దృష్టాంతం ఇస్తుంది. ఈ శరీరం ఒక రథంలాంటిదట. ఈ రథాన్ని నడిపే సారథి బుద్ధి. ఈ సారథి చేతిలోని పగ్గమే మనస్సు. ఇంద్రియాలు గుర్రాలు. శబ్ద స్పర్శ రూప రసగంధాలనే విషయాలవైపు పరుగెత్తుతూ వుంటాయి. ఈ రథంలో కూర్చుని ప్రయాణంచేసే యజమాని ఆత్మ. ఇంద్రియములు, మనస్సు, ఆత్మ కలిసి ప్రయాణసౌఖ్యాన్ని అనుభవిస్తూ ఉంటాయి. సారథికి పట్టు లేకపోతే గుర్రాలు తప్పుదారి తొక్కుతాయి. అలాగే బుద్ధిబలం లేకపోతే ఇంద్రియాలు స్వేచ్ఛగా విహరిస్తాయి. స్థిరమైన బుద్ధితో నిశ్చలమైన మనస్సుతో నడిపిస్తే ఇంద్రియాలనే గుర్రాలు దారిలో వెళ్తాయి. వివేకం లేని సారథి గమ్యం చేరలేడు. నిర్మలమైన మనస్సుతో నిశ్చలమైన దీక్షతో పయనిస్తే సులభంగా గమ్యం చేరుకోవచ్చు. విజ్ఞానం కల సారథి, పట్టుగల పగ్గం ఉంటే పరమపదమనే గమ్యం చేరుకోవచ్చు. విష్ణుపాదం చేరుకున్న తర్వాత తిరిగి సంసారంలో ప్రవేశించవలసిన పని వుండదు.

ఇంద్రియములకంటే ఇంద్రియార్థాలు బలీయములు. ఇవే శబ్ద స్పర్శ రూపాది విషయాలు. వీటిని మించినది మనస్సు. మనస్సును మించింది బుద్ధి. బుద్ధిని మించింది జీవాత్మ. జీవాత్మకు పైన పరమాత్మ. కాని జీవాత్మకూ, పరమాత్మకూ మధ్య అవ్యక్తమయిన మాయ అడ్డుతెరలా వుంటుంది. ఆ తెర తీసేస్తే జీవాత్మ పరమాత్మలో లీనమైపోగలదు. పరమాత్మకు మించిన పరతత్త్వం మరొకటి లేదు. అదే పరాకాష్ఠ. అదే పరమపదం. ఈ పరతత్త్వం శరీరంలో సూక్ష్మంగా ప్రతిష్ఠితమై వుంటుంది. సూక్ష్మదృష్టితో చూడగలిగిన బుద్ధిమంతులకే అది కనిపిస్తుంది. సూక్ష్మాతిసూక్ష్మమైన యీ పరతత్త్వాన్ని చేరు

కునేందుకు విశాలమైన రాజమార్గం లేదు. సన్నని కాలిబాట వుంది. అటూ ఇటూ కాలు జారకుండా మెలకువగా ఈ దారిలో ముందుకు పోవాలి. కత్తిమీద నడిచినట్టు అడుగుకో అడుగు పెట్టుకుంటూ అగమ్యమైన గమ్యాన్ని చేరుకోవాలి. శబ్ద స్పర్శ రూప రస గంధాలకు ప్రవేశంలేని ఆ పరమపదం ఆద్యంతాలు లేనిది, స్థిరమైనది, చిరమైనది. ఆ చిరం తన చైతన్యవాహినిలో చేరిపోతే మరి మృత్యుభయం ఉండదు.

క్రమంగా దాని కోసం సాధన చెయ్యాలి. స్థూలం నుంచి సూక్ష్మం వైపు పయనించాలి. మొదట వాక్కును మనస్సులో లయింప చెయ్యాలి. అన్ని ఇంద్రియాలకు మూలం వాక్కు. వాగింద్రియాన్ని జయిస్తే అన్ని ఇంద్రియాలను జయించినట్టే. తినటం, మాట్లాడటం - రెండు నోటితో చేసే పనులు. వీనినే ఆహారం, వ్యాహారం అంటారు. ఈ రెంటిని అదుపులో పెట్టుకుంటే ఇంద్రియ వ్యాపారమంతా మనస్సులో లీనమవుతుంది. ఆ తర్వాత మనస్సు మాట్లాడటం ఆరంభిస్తుంది. మనస్సు నోరు మూయించాలంటే బుద్ధిని మేల్కొల్పాలి. ఇలా వాక్కు మనస్సులో, మనస్సు బుద్ధిలో చేరిన తర్వాత బుద్ధికి క్రమంగా బుద్ధి చెప్పి ఆత్మను గుర్తించేట్టు చెయ్యాలి. ఈ మహదాత్మ నెమ్మదిగా అంతరాత్మలో ప్రవేశిస్తుంది. వాక్కు నుండి మనస్సు, మనస్సు నుండి బుద్ధి, బుద్ధి నుండి జీవాత్మ, జీవాత్మ నుండి పరమాత్మ - ఇది సాధనా క్రమం.

ఇది సక్రమమైన మార్గం అని తెలిసి కూడా సామాన్య మానవులు బయటి భోగ భాగ్యాల కోసం పాకులాడుతారే కాని అంతరంగంలోని ఆత్మానందాన్ని అనుభవించేందుకు ఏ మాత్రం ప్రయత్నించరు. దృష్టి బహిర్ముఖంగా ప్రసరిస్తుందే కాని అంతర్ముఖంగా ప్రచరించదు. అది వాళ్ళ తప్పుగాదు. సృష్టికర్త మానవ శరీరాన్ని అలా సృష్టించాడు. కళ్ళు, ముక్కు, నోరు, చెవులు - అన్ని బయటికే తెరుచుకొని వున్నాయి. అందువల్ల బాహ్య విషయాలు అందుబాటులో వున్నట్టుగా అంతర్లోకం అంతుబట్టదు. ఎవరో బుద్ధిమంతులు చాల కొద్దిమంది అంతర్దృష్టితో అంతరాత్మను సాక్షాత్కరించుకొని అమరత్వాన్ని సాధిస్తారు.

బాహ్య ప్రపంచానికి, అంతర్జగత్తుకూ అవినాభావ సంబంధం వుందనే విషయం మొట్టమొదట గుర్తించాలి. అందాన్ని చూచి ఆనందించేది, ఆహారాన్ని ఆస్వాదించేది, పరిమళానికి పరవశించేది, అంగ సంయోగానికి పొంగిపోయేది,

కలలు కనేది, మేలుకొనేది, నెమరు వేసుకొని మురిసిపోయేది-శరీరమా? ఆత్మా? అని కొంచెం ఆలోచిస్తే ఆంతరంగికమైన ఆత్మ సామ్రాజ్యం అన్నిటికీ మూలమనే విషయం తెలిసిపోతుంది. ఇంద్రియాలకు, మనస్సుకు, బుద్ధికి అతీతమై అన్నింటినీ లాలించి పాలించే ఆత్మ తత్త్వమే చివరకు మిగిలేది. అదే బాహ్యసృష్టికి మూలం.అంతర్దృష్టికి ఆది.సృష్టి ఆరంభ దశలో ఉన్నప్పుడు-తపశ్శక్తితో నీటినుండి పుట్టిన హిరణ్యగర్భుడే ప్రాణికి ప్రాణంపోసి ప్రాణవంతమైన శరీరంలో మారుమూలన ప్రవేశించి ప్రాణమున్నంతవరకు తిష్ఠవేసుకొని వుంటాడు. తనలో చేరిన యీ పర తత్త్వాన్ని కనుగొనగలిగిన ద్రష్టకు బాహ్యాభ్యంతరాలకు భేదం లేదనే విషయం తెలుస్తుంది. గర్భవతియైన స్త్రీలో ఒక భాగంగా అన్నాన్నీ ఆనందాన్నీ పంచుకుంటూ పెరిగే పిండంలాగా బ్రహ్మాండంలో ఈ పిండాండం పెరిగి పెద్దదవుతూ వుంటుంది. ప్రతిదినం మనం అర్చించే అగ్ని బయట కర్రముక్కల్లో వెలుగుతున్నట్టుగానే సమిధ లాంటి మన శరీరంలో కూడా మండుతూ వుంటుంది. కట్టెల రాపిడికి అగ్ని వెలువడినట్టుగా స్త్రీ పురుష సంయోగంతో అగ్నిలో నుంచి అగ్ని ఉదయిస్తుంది. ప్రతిదినం ఉదయించి అస్తమించే సూర్యునిలో కూడా ఇదే అగ్ని ప్రజ్వలించి వుంటుంది. అన్ని లోకాలకూ ఆలోకాన్ని (వెలుగును) ప్రసాదించే యీ పరంజ్యోతిని సాక్షాత్కరించుకున్న వారికి బాహ్యం-అభ్యంతరం, ఇహం-పరం, జీవితం-మరణం అనే భేదం లేకుండా పోతుంది. అదే అమరత్వం. నానా రూపాలలో కనిపించే ప్రపంచంలో ఏకైక పరతత్త్వాన్ని చూడగలిగినప్పుడే యీ బ్రాహ్మీస్థితి లభిస్తుంది. హృదయాంతరాలల్లో అంగుష్ఠ (బొటనవ్రేలు) పరిమాణంలో ప్రకాశించే పురుషోత్తముడే ప్రపంచానికి ప్రాణంపోసి పాలించే ప్రభువు. అది పొగలేని వెలుగు. అది నాటికీ, నేటికీ, ఏనాటికీ కూడా మార్పులేని తీర్పు, మాపు లేని రేపు.

కొండమీద కురిసిన వర్షం నానా దిక్కుల జారి పాయలు పాయలుగా ప్రవహిస్తుంది. అదే వర్షం నిర్మలమైన నదీజలంలోనో, సరోవరంలోనో పడితే నీళ్ళల్లో నీరు కలిసి నిర్మల పరీవాహంగా మారుతుంది. అలాగే ఆత్మతత్త్వం తెలిసిన మునులు నిర్మలమైన అంతఃకరణంలో పరమాత్మను దర్శించగలుగుతారు. అందువల్ల అంతఃకరణ శుద్ధి ఆత్మసిద్ధికి ఆధారం.

మానవ శరీరం భువనపతి కట్టుకున్న చక్కని భవనం. దీనికి పద కొండు వాకిళ్ళు. కళ్ళు, ముక్కులు, చెవులు, నోరు, బ్రహ్మరంధ్రం, నాభి, రెండు గుహ్యేంద్రియాలు కలిసి పదకొండు వాకిళ్లు అట్టచట్టంగా అమర్చివున్న ఆరామనిలయం పురుషపురం. ఇందులో పురుషుడు విశ్రమించేప్పుడు అన్ని వాకిళ్ళు దగ్గరగా వేసుకొని నిశ్చింతగా నిద్రపోతాడు. గాఢమైన సుషుప్తిలో చీకూ చింతా లేకుండా తనలో తాను లీనమైపోతాడు. ఈ పురుషుడే అంతరిక్షంలో వేవెలుగుగా, వసుధలో వసువుగా, అగ్నిహోత్రంలో హోతగా, వేదికపై అతిథిగా, జీవిలో జీవిగా, దేవతలలో దేవతగా, నీటిలో కమలంగా, సత్యంలో నిత్యంగా, తథ్యంలో తత్త్వంగా, ఋతంలో బృహదృతం (పరమ సత్యం)గా భాసిస్తాడు. మానవ శరీరాన్ని భవనం చేసుకుని అందులో నివసించే సమయంలో ప్రాణ వాయువును పైకీ, క్రిందకీ ప్రసరింపజేస్తూ మధ్య వామనరూపంలో వ్యానాన్ని, ఉదానాన్ని, సమానాన్ని సరిసమానంగా ప్రసరించేట్టు చూస్తుంటాడు. ఈ పంచ వాయువులే అతనికి పంచప్రాణాలు. తాను ఈ శరీరాన్ని వదలిపెట్టి వెళ్ళేప్పుడు అంటే యిల్లు ఖాళీ చేసేప్పుడు- ఈ వాయువులను బయటి వాయువుకు అప్పగించి వెళ్తాడు. ప్రాణాన్ని నిలబెట్టేది ప్రాణవాయువూ కాదు, అపానవాయువూ కాదు. మరి యేమిటది? అదే ముఖ్య ప్రాణం. ప్రాణానికి ప్రాణం. మరణించిన తర్వాత మరణ శాసనం వ్రాసేది అదే, అది చెప్పిన తీర్పుకు తిరుగులేదు. ఆ తీర్పునుబట్టి జీవి మరో రూపాన్ని పొందు తాడు. అది మానవ యోని కావచ్చు. పశు యోని కావచ్చు. ఈ జన్మలో చేసిన పనులనుబట్టి, ఆశించిన ఆశయాలను బట్టి మరుసటి జన్మ యేర్పడుతుంది. ఏ రోజు చేసిన పనులు, ఆ రోజు రాత్రి శరీరం విశ్రమించిన సమయంలో శరీరంలో ఎవరికీ కనిపించకుండా దాగివున్న చిత్రగుప్తుడు తన లెక్కలో ఎక్కించుకుంటాడు. ఇలా ఏ రోజు లెక్క ఆ రోజు వ్రాసుకున్న గణికుడు అవసానదశకు మన లెక్కంతా మనలో వున్న బ్రహ్మపదార్థానికి అప్ప చెప్తాడు. దానితో మన భండారం బయట పడుతుంది. ఇంతమంది లెక్కలను ఇంత చక్కగా నిర్వహిస్తున్న మహాలేఖాధికారి సకలజీవులనూ ఒక కంట కనిపెడుతూ వాళ్ళ వెంటనే ఉంటాడట.

౩)

అది యెలా సాధ్యమవుతుందనే ప్రశ్నకు కాఠకం సమాధానం చెప్తుంది. ప్రపంచమంతటా వ్యాపించియున్న ఒకే అగ్ని ప్రతి జీవిలో ప్రజ్వలిస్తూ వుంటుంది. విశ్వమంతటా ప్రసరించి వున్న వాయుపు ప్రతి జీవిలో ప్రచరిస్తూ వుంటుంది. ఆకాశంలో అనంత కాంతిని తన కిరణాలతో విరజిమ్మే ఒకే సూర్యుడు తన మండలంలోని ప్రతి ప్రాణిలో ప్రతిబింబించి వుంటాడు. కళ్ళకు కనిపించినా కనిపించకపోయినా సూర్యకాంతి ప్రతిజీవికీ ప్రాణశక్తిని ప్రసాదిస్తుంది. అలాగే అగ్నికీ, వాయువుకూ, సూర్యకాంతికీ ఆధారమైన పరమాత్మ స్వరూపం ప్రతిజీవిలో తన ప్రతిరూపాన్ని ప్రతిష్ఠించుకొని వుంటుంది. ఆ రూపాన్నే తన స్వస్వరూపంలో సాక్షాత్కరించుకోగలిగిన ఆత్మవంతుల జీవితం సార్థకమవుతుంది. శాశ్వతమయిన సౌఖ్యానికి వాళ్ళు అధికారులవుతారు. నిత్య వస్తువులోని నిత్యత్వాన్ని, చేతనపదార్థంలోని చైతన్యాన్ని, అనేకత్వం లోని ఏకత్వాన్ని, వాంఛితార్థాలను ఫలింపజేసే పరమార్థాన్ని అంతరంగంలో పరికించి చూడగల ప్రజ్ఞావంతులకే శాశ్వతసౌఖ్యం, శాశ్వతశాంతి లభిస్తాయి. ఇతరుల శాంతి సౌఖ్యాలు క్షణికాలు.

సూక్ష్మాతిసూక్ష్మమైన పరతత్త్వం చర్మచక్షువులకు గోచరించదు. అంతశ్చక్షువులతోనే ఆ సద్దర్శనం సాధ్యమవుతుంది. మరి అలాంటి దివ్య దృష్టి తనకు లభిస్తుందా అని నచికేతుడు లోలోపల అనుకుంటుంటాడు. ఈ విషయం గమనించి యమధర్మరాజు నచికేతునికి ధైర్యం చెప్తాడు. శరీర ధారికి అశరీరమైన ఆత్మతత్త్వం అందుబాటులో ఉందని మాట నిజమే. ఆత్మ ప్రకాశించేచోట సూర్య చంద్రులు ప్రకాశించలేరు. నక్షత్ర కాంతి కూడా వుండదు. విద్యుత్కాంతి కూడా ఆ వెలుగు ముందు నిలబడలేదు. ఇక సామాన్యమయిన అగ్నికి అక్కడ ప్రవేశమే లేదు. కాని, ఆ వెలుగు ఈ శరీరం లోనే వుంది. ఆ వెలుగు వల్లనే మరే వెలుగయినా వెలుగ గలుగుతూ వుంది. కాబట్టి శరీరంలో ఆ కాంతి వుండగానే దాన్ని చూడగలగాలి.

ఈ ప్రపంచం ఒక రావిచెట్టు లాంటిది. గలగలలాడే ఆకులతో ఇది కలకాలం కళకళలాడుతుంటుంది. కాని దీని వేళ్ళు ఆకాశంలో ప్రసరించి వుంటాయి. ఆకులు, కొమ్మలు కిందికి వ్రేలాడి వుంటాయి. అప్పుడే యిది చిరస్థాయిగా మనగలుగుతుంది. అశ్వత్థమంటేనే శాశ్వతమైనది, ప్రగతి మైనది అని అర్థం. జగత్తన్నా అదే అర్థం. ఈ ప్రపంచానికి మూలశీలం

అంతరిక్షం. పరమాకాశం. అదే శూన్యం, అదే పూర్ణం. అది మాత్రం శాశ్వతం. క్రింది శాఖోపశాఖలు వ్యాపించినట్టే వ్యాపించి క్షణంలో లోపించి పోతాయి. కాని, మూలం మాత్రం అనంతం, అక్షయం.

ఆ మూలానికి భయపడే ప్రపంచం నడుస్తూవుంది. అగ్ని, వాయువు, ఇంద్రుడు, సూర్యచంద్రులే కాదు, మృత్యువు కూడా ఆ మృత్యుంజయుని చండ శాసనానికి భయపడుతుంది. భయానికే భయమైన ఆ భయంకరుడు మానవ శరీరధారులకు అభయంకరుడై ఆశ్రయించినవాళ్ళకు ఆశ్రయం ఇస్తున్నాడు. ఇది చాల విచిత్రమైన సన్నివేశం. అపూర్వమైన అవకాశం. ఈ అవకాశాన్ని చేజారనివ్వకూడదు. శరీరం నశించే లోగానే అశరీర తత్త్వాన్ని అర్థం చేసుకోవాలి. అద్దంలో తన ముఖం చూచుకున్నట్టు ఆత్మజ్ఞాని తన ఆత్మను ఆత్మలో చూచుకుంటాడు. పితృదేవతలు పితృలోకంలో ఈ ఆత్మతత్వాన్ని కలలో చూచినట్టు చూస్తారు. నీళ్ళలో విహరించే అప్సరసలా గంధర్వులకు ఈ ఆత్మ తత్త్వం గోచరిస్తుంది. వెలుగు నీడల్లా బ్రహ్మలోకంలో బ్రహ్మజీవులు కనిపిస్తారు. ఏ రూపంలో చూచినా ఒకసారి యీ రూపాన్ని చూస్తే చాలు. క్షణంలో ఉదయించి మరుక్షణంలో లయించే ఇంద్రియాదుల ఇంద్రజాలం వట్టి మాయ అనే విషయం ఆత్మవంతులగు బ్రహ్మవేత్తలకు క్షణంలో తెలిసిపోతుంది. కాని, చేజిక్కిన పరమార్థం చిక్కినట్టే చిక్కి క్షణంలో చేజారిపోతుంది. విశుద్ధమైన హృదయంతో, నిర్మలమైన మనస్సుతో పరమార్థాన్ని పట్టుకొని ఆకట్టుకునేందుకు గట్టిగా ప్రయత్నించాలి. ఇంద్రియాదులు, మనస్సు, బుద్ధి నిశ్చలంగా పరతత్త్వంలో లీనం కావటమే పరమపదానుభూతి. అదే యోగం. ఇది భావనాశక్తివల్లనే సాధ్యమవుతుంది. వాక్కుకు, మనస్సుకు, నేత్రాలకు అందని ఆత్మతత్త్వం భావనాశక్తికి సాధ్యమవుతుంది. పరమాత్మ తత్త్వమనేది ఒకటి వున్నదని త్రికరణ శుద్ధిగా నమ్మటం పరమార్థసాధనకు పునాది. ఈ నమ్మకం సర్వకాల సర్వావస్థల యందు హృదయంలో, మనస్సులో, బుద్ధిలో స్థిరంగా నెలకొని వుండాలి. పరమార్థంతో నిండిన అంతఃకరణంలో స్వార్థానికి చోటు వుండదు. ఇహసంబంధమైన కోరికలు పూర్తిగా నశించిన తర్వాతనే బ్రహ్మ భావం ఏర్పడుతుంది. బ్రహ్మనిర్వాణమే అమరత్వం. హృదయంలోని ముడులన్నీ విడివడిన తర్వాత బ్రహ్మభావం తనంతట తానే అప్రయత్నంగా ఆవిర్భవిస్తుంది. జన్మజన్మాంతర సాధనవల్లకాని యీంలో అవసానదశలోనయినా జన్మ

అలాంటి బ్రాహ్మీస్థితి యేర్పడదు. ఈ స్థితిలో శరీరాన్ని విసర్జించిన పరమయోగి బ్రహ్మనిర్వాణాన్ని పొందుతాడు. అతనికి పునర్జన్మ వుండదు.

హృదయంలోనుంచి నూటొక్క నాడులు బయటికి వస్తాయట. అందులో ఒక్కటి మాత్రమే బ్రహ్మరంధ్రానికి లగ్నమై వుంటుంది. బ్రహ్మభావంతో జీవయాత్రను చాలించిన యోగిని ఈ నాడి బ్రహ్మలోకానికి తీసుకొని వెళ్ళుతుందట. కాబట్టి జీవితంలో ప్రతి క్షణం దీనికే అంకితం చేసుకోవాలి. హృదయాంతరాలలో సర్వకాల సర్వావస్థలయందు వెలుగుతూవున్న ఆత్మజ్యోతిని జీవించివుండగానే నశ్వర శరీరం నుంచి వేరు చేసుకొని చూడగలగాలి. అదే జీవిత పరమార్థం. జీవితంలో చివరకు మిగిలేది అదే. అదే పరమ పవిత్రం, మహోజ్జ్వలం, శాశ్వతమైన తత్త్వం. అదే అమృతం. దానినే నచికేతుడు కోరింది; యముడు ప్రేమతో ప్రసాదించింది.

*"మృత్యోర్మా అమృతం గమయ"*



# ప్రాణి-ప్రాణం

*"ఆదిత్యోహవై ప్రాణః......ప్రాణే సర్వం ప్రతిష్ఠితమ్"*

ప్రశ్న (1-5,2-6)

ప్రపంచంలోని ప్రతి పదార్థానికి ఒక పరమార్థం అంటూ వుంటుంది. ప్రాణంలేని ప్రాణికి అస్తిత్వం లేనట్టు పరమార్థం లేని పదార్థానికి ప్రయోజనం వుండదు. పదార్థం ద్రవ్యం. పరమార్థం శక్తి, ప్రాణం ఆధారం, ప్రాణి ఆధేయం. ఒకటి మూలం. మరొకటి స్థూలం. ఈ రెండూ స్థూలదృష్టికి వేరు వేరుగా కన్పించినా సూక్ష్మంగా పరిశీలించి చూస్తే పదార్థానికీ - పరమార్థానికీ, ద్రవ్యానికీ-ద్రవిణాని (శక్తి) కీ, ప్రాణికీ-ప్రాణానికీ తాత్త్వికంగా భేదం లేదు. ప్రాణమే ప్రాణిగా మారుతుంది. ప్రాణిలోనుంచే ప్రాణం ఉదయిస్తుంది. ఆధునిక

విజ్ఞానం ప్రతిపాదించిన ద్రవ్య (matter) శక్తి (energy) సమన్వయ సిద్ధాంతం ఇదే. శివశక్తి సామరస్యంలోని రహస్యం కూడా ఇదే. ఈ సమన్వయ దృక్పథంతో ప్రాణాన్నీ, ప్రాణినీ వ్యాఖ్యానించి చెప్తుంది ప్రశ్నోపనిషత్తు.

బ్రహ్మపదార్థాన్నిగురించి తీవ్రంగా ఆలోచించి తమకు తెలియని విషయాలను తెలిసినవాళ్ళ దగ్గర తెలుసుకుందామనే కుతూహలంతో ఆరుగురు బ్రహ్మచారులు బ్రహ్మవేత్త అయిన పిప్పలాదమహర్షి దగ్గరికి వెళ్తారు. భరద్వాజ తనయుడు సుకేశుడు, శివి కుమారుడు సత్యకాముడు, గర్గ వంశానికి చెందిన సౌర్యాయణి, కోసలదేశవాసి అయిన ఆశ్వలాయనుడు, విదర్భ వాసి భార్గవుడు, కత్యమహర్షి మనుమడు కబంధి - ఈ శిష్యమండలికి చెందిన ఆరుగురు ప్రతినిధులు. జీవోత్పత్తిని గురించి, జీవిత పరమార్థాన్ని గురించి యీ ఋషి కుమారులడిగిన ప్రశ్నలకు మహర్షి చెప్పిన సమాధానాలే ప్రశ్నోపనిషత్తు. ఇందులో ఆరు ప్రశ్నలు, వాటికి సమాధానాలు ఉన్నాయి.

కాని, మహర్షిని ప్రశ్నించేందుకు కూడా పృచ్ఛకులకు అర్హత వుండాలి. అలాంటి అర్హత సంపాదించుకునేందుకు మహర్షి ఒక సంవత్సరం పాటు వాళ్ళను బ్రహ్మచర్య దీక్షతో తపస్సు చెయ్యవలసిందని ఆదేశిస్తాడు. ఋషి కుమారులు అలాగే చేస్తారు. సంవత్సరం గడిచిన తర్వాత మొట్టమొదట కబంధి వెళ్ళి మహర్షికి తన ప్రశ్న మనవి చేసుకుంటాడు. ''స్వామీ! ఈ ప్రాణికోటిని ఎవరు సృష్టిస్తున్నారు? ఈ ప్రజలందరూ ఎక్కడినుంచి ప్రభవిస్తున్నారు?'' మహర్షి చిరునవ్వుతో సమాధానం చెప్తారు:

''ఈ ప్రజలను ప్రజాపతి సృష్టించాడు. (సంవత్సరం కాచుకుని వుంటే ఇదా మహర్షి చెప్పే సమాధానం అని కబంధి ఎగాలు పోయి చూస్తున్నాడు కాబోలు, మహర్షి తన సమాధానాన్ని సమగ్రంగా వ్యాఖ్యానించసాగారు.) ప్రజాపతికి ప్రజలను సృష్టించాలని కోరిక కలిగింది. ఆయన తపస్సు చేసి ఒక జంటను సృష్టించాడు. ఒకటి రయి, మరొకటి ప్రాణం. ఒకటి ద్రవ్యం, మరొకటి శక్తి. ఒకటి స్థూలం, మరొకటి సూక్ష్మం. ఒకటి జడ పదార్థం, మరొకటి చేతనం. ఒకటి స్త్రీలింగం మరొకటి పుంలింగం. ఈ లింగాంగ సంయోగంతో ప్రజోత్పత్తి కొనసాగుతుందని ప్రజాపతి అభిప్రాయం అది అలాగే జరిగింది.

''ఆదిత్యుడు ప్రాణంగా, చంద్రుడు రయి (ద్రవ్యం) గా రూపొందారు. సూర్య కిరణాలు దశదిశలా ప్రసరించాయి. వాటితోపాటు ప్రాణశక్తి బ్రహ్మాండంలోని ప్రతి అణువులో ప్రవేశించింది. ఈ ప్రాణశక్తిని చంద్రుడు చల్లని తెల్లని వెన్నెలగా మార్చాడు. ఈ చల్లదనానికి సృష్టి పల్లవించింది. పుడమి కడుపు పండింది. సస్యశ్యామలమయిన ప్రకృతితో పాటు పురుష సంతతి కూడా పెరిగింది. సూర్యకాంతి ప్రతి ప్రాణిలో జఠరాగ్ని రూపంలో ప్రజ్వలించింది. జడీభూతమైన దేహంలో చైతన్యం వచ్చింది. సహస్ర కిరణాలతో సమస్త సృష్టిని తేజోవంతం చేసి అనంతంగా ప్రజాసంతతిని పెంచి పోషించే సూర్యుడు ప్రాణశక్తికి దాత, ధాత, సంధాత అయినాడు.

''సూర్యునివల్లనే సంవత్సరం, మాసం, పగలు, రాత్రి ఏర్పడ్డాయి. ఇవన్నీ కాలమానంలోని భాగాలు. సూర్య గమనమే వీటికి మూలకారణం. ఇందులో ప్రతి భాగం ప్రజాపతికి ప్రాతినిధ్యం వహిస్తుంది. సంవత్సరం ప్రజాపతి స్వరూపం. ఇందులో దక్షిణాయనం, ఉత్తరాయణం అని రెండు అయనాలు వున్నాయి. దక్షిణాయనం రయి, ఉత్తరాయణం ప్రాణం. దక్షిణాయనాన్ని అనుసరించేవాళ్ళు యజ్ఞయాగాలు, దానధర్మాలు మొదలయిన పుణ్యకార్యాలతో చంద్రలోకాన్ని చేరుకుంటారు. అక్కడ తమ తాతముత్తాతలను కలుసుకుని మళ్ళీ భూమికి తిరిగి వస్తారు. ఇది పితృయానం. ఉత్తరాయణ పరాయణులు అలాకాక పరమార్థసాధనకోసం ప్రయత్నిస్తారు. బ్రహ్మచర్యదీక్షతో శ్రద్ధాభక్తులతో జపతపాదులు చేసి ఆదిత్యమండలాన్ని చేరుకుంటారు. సూర్యలోకం చేరుకున్నవాళ్లు మళ్ళీ తిరిగిరారు. సూర్యమండలం ప్రాణనిలయం. అక్కడ మరణభయం లేదు. అంతకు మించిన లోకం లేదు.

''పంచప్రాణాలు సూర్యభగవానునికి పంచపాదాలు. పన్నెండు నెలలు ఆయనకు పన్నెండు రూపాలు. మేషం, వృషభం, మిధునం మొదలయిన పన్నెండు రాసుల్లో సూర్యుడు ఒక్కొక్క రాశిలో ఒక్కొక్క నెల చొప్పున పన్నెండు నెలలు గడుపుతాడు. ఏడు వన్నెలను తనలో ఇముడ్చుకున్న సూర్యకాంతి చుట్టూ ఏడు చక్రాలు రంగురంగుల శోభను వెలయిస్తూ వుంటాయి. ఆరు ఋతువుల మధ్య అలరారు సూర్యబింబం రథచక్రం మధ్యనున్న కేంద్ర బిందువులా శోభిస్తూ వుంటుంది. అనంత కాంతితో అంతరిక్షంలో సంచరించే

అర్కుడు ఉత్తర దిక్కుకు వెళ్ళేప్పుడు ఉత్తరాయణం, దక్షిణ దిక్కుకు వెళ్ళేప్పుడు దక్షిణాయనం ఏర్పడుతాయి. కాంతి, శాంతి, ఉత్సాహం, చైతన్యం ఉత్తరాయణ లక్షణాలు. చీకటి, నైరాశ్యం, అశాంతి, అసహనం, అలసత దక్షిణాయన లక్షణాలు. ఉత్తరం ఔన్నత్యానికి చిహ్నం. దక్షిణం దానికి భిన్నమయింది (ఇవి ఆధ్యాత్మికమైన దిక్కులని గమనించాలి).

"ఇలాగే శుక్లపక్షం, కృష్ణపక్షం కూడా ఒకదానికొకటి భిన్నమయిన లక్షణాలకు లక్ష్యాలుగా వుంటాయి. ఈ రెండు కలిసి మాస మవుతాయి. సూర్య చంద్రుల కలయిక అమావాస్య. ఆరోజు చంద్రుడు సూర్యుడితో కలిసివుంటాడు కాబట్టి కనిపించడు. పూర్ణిమనాడు చంద్రుడు సూర్యుడికి ఎదురుగా ఉండటంవల్ల సూర్యకాంతిని పూర్తిగా ప్రతిఫలింపజేస్తూ నిండు కళలతో కనిపిస్తాడు. అమావాస్య నుంచి పూర్ణిమ వరకు శుక్లపక్షం. ఈ పక్షంలో చంద్రకళలు క్రమంగా వృద్ధిపొందుతాయి. పూర్ణిమ నుంచి అమావాస్య వరకు కృష్ణపక్షం. ఈ పక్షంలో చంద్రకళలు క్రమంగా క్షీణిస్తాయి. కాబట్టి శుక్లపక్షం ప్రాణం లాంటిది. కృష్ణపక్షం రయి (ద్రవ్యం) లాంటిది. శుక్లపక్షం శుభకార్యాలకు అనుకూలమయింది. కృష్ణపక్షం పితృకార్యాలకు పనికి వస్తుంది.

"అలాగే పగలు ప్రాణప్రదం. రాత్రి రయి స్వరూపం. పగలు శివ స్వరూపం. రాత్రి శక్తి స్వరూపం. కనకనే రాత్రి రతికి అనుకూలం. పగలు ఆరాధనకు అనుకూలం.

"అన్నంకూడా ప్రజాపతి స్వరూపమే. 'అన్నం బ్రహ్మ' అని ప్రమాణం. అన్నంవల్లనే రేతస్సు ఏర్పడుతుంది. రేతస్సువల్లనే ప్రజోత్పత్తి కలుగుతుంది. సంతానం కనటం ఒక వ్రతం. దీన్ని వ్రతంగా భావించిన గృహమేధి కూడా బ్రహ్మచారి క్రిందనే లెక్క. కల్ల-కపటం, మమత-మాయ, రాగం-ద్వేషం, లోభం-లాభం, కోపం-తాపం లేకుండా బ్రహ్మభావంతో జీవితయాత్ర చేసే పరమసాత్త్వికునికే బ్రహ్మలోకం లభిస్తుం''దని పిప్పలాద మహర్షి కబంధికి జీవితపరమార్థం చెప్పాడు.

## 2

ఆ తర్వాత విదర్భవాసి భార్గవుడు మహర్షి దగ్గరికి వెళ్ళి అడుగుతాడు: "స్వామీ ! ప్రాణులకు ప్రాణంపోసి పోషించే దేవతలు ఎంతమంది? ఎవరెవరు శరీరానికి కాంతిని ప్రసాదిస్తారు? వాళ్ళలో అందరిని మించినది ఎవరు?"

మరుక్షణమే మహర్షి దీనికి సమాధానం చెప్తాడు: "అన్నిటికీ ఆధారం ఆకాశం. ఆకాశంనుంచే వాయువు, అగ్ని, జలం, పృథ్వి ఉదయించాయి. వీటి వల్లనే వాక్కు, మనస్సు, కళ్ళు, చెవులు పనిచేస్తాయి. ఇవన్నీ శరీరాన్ని నిలబెట్టే దేవతలే. కాని వీటన్నిటిలో శ్రేష్ఠమైనది ప్రాణం. ప్రాణం వున్నంత వరకే పంచభూతాలు శరీరంలో కలిసి ఉంటాయి. పది ఇంద్రియాలు పని చేస్తాయి. ప్రాణం శరీరాన్ని వదిలిన మరుక్షణం ఇవన్నీ ఎందుకూ పనికి రాకుండా పోతాయి. ఒక పర్యాయం ఈ దేవతలు ప్రాణాన్ని ఎదిరించాయి. కళ్ళు, ముక్కులు, చెవులు తమ తమ ప్రభావాన్ని గొప్పగా చెప్పుకోసాగాయి. వాటికి గుణపాఠం చెప్పాలని ప్రాణం ఉన్నట్టుండి శరీరాన్ని విడిచిపెట్టేందుకు సిద్ధంకాగానే ఇంద్రియాలు, పంచభూతాలు విలపించాయి. వెంటనే అవన్నీ ప్రాణాన్ని బ్రతిమాలుకొని, మమ్మల్ని వదలి వెళ్ళొద్దని మొర పెట్టుకున్నాయి. వాటి మాట విని మళ్ళీ శరీరంలో ప్రవేశించిన ప్రాణాన్ని ఆకాశాది దేవతలు, వాక్కు మొదలయిన ఇంద్రియాలు స్తుతించాయి.

"అగ్ని రూపంలో వెలిగేది, సూర్యుడిలో చేరి ప్రకాశించేది, మేఘాలతో కూడి వర్షించేది, ఇంద్రుడి చెంత చేరి మెరిసేది, గాలిలో కలిసి వీచేది, భూమిపై నిలబడి వుండేది, కదలేది, కదిలించేది ప్రాణమే. ద్రవ్యానికీ, ద్రవిణానికీ, రక్తికీ, శక్తికీ మూలాధారం ప్రాణమే. ప్రాణంలోనే జ్ఞానముంది. ప్రాణంలోనే పరాక్రమముంది. బ్రహ్మవర్చస్సు, క్షాత్ర తేజస్సు - రెండూ ప్రాణంలోనే ఇమిడి వున్నాయి. స్త్రీగర్భంలో ప్రవేశించేది ప్రాణమే. శిశువుగా జన్మించేది ప్రాణమే. లోపల వున్న ప్రాణానికే ప్రాణికోటి రుచికరమైన ఆహారాన్ని కూర్చి నైవేద్యం పెడుతుంది. ప్రాణంలో లేనిది లేదు. ప్రాణం లేనిది ప్రపంచం లేదు. అగ్నిదేవత, పితృదేవతలు, ఇంద్రుడు, రుద్రుడు, సూర్యుడు-అందరూ ప్రాణ స్వరూపులే. ప్రాణమే వాళ్ళకు రూపకల్పన చేసింది. వర్షాకాలంలో ప్రాణం పర్జన్య రూపం తాల్చి చల్లని జల్లు కురిపిస్తూ వుంటే

ప్రజలు ఆనందంతో పొంగిపోతారు. ప్రాణం వర్షిస్తే ప్రాణులు హర్షిస్తారు. ప్రాణం భుజిస్తుంటే ప్రాణులు భజిస్తారు. ప్రాణం అన్నిటినీ భక్షిస్తుంది. అందరినీ రక్షిస్తుంది. ప్రాణం ప్రపంచానికి తల్లి, తండ్రి, భర్త. ప్రాణి శరీరంలో ప్రవేశించిన ప్రాణం చెవులకు కమ్మని సంగీతం వినిపిస్తుంది; కళ్ళకు కమనీయమైన దృశ్యాలను చూపిస్తుంది; మనస్సులో మంచిమంచి ఆలోచనలను వెలయిస్తుంది; జీవితాన్ని శివమయం చేస్తుంది. మూడు లోకాలకూ ఆధారం ప్రాణం. తల్లిలా ప్రజలను కాపాడే ప్రాణం తేజస్సును పెంచుతుంది. మేధాశక్తిని ప్రసాదిస్తుంది. కాబట్టి ప్రాణమే ప్రాణికోటికి ఆధారం, ఆకారం ఇస్తుంది. ప్రాణమే అన్నం. ప్రాణమే ఆనందం.''

## 3

ఇంతటితో భార్గవుని ప్రశ్నకు సమాధానం పూర్తవుతుంది. ఆ తర్వాత కోసల దేశస్థుడు అశ్వలాయనుడు మహర్షిమీద ప్రశ్నల వర్షం కురిపిస్తాడు: ''స్వామీ! ప్రాణాన్ని గురించి మీరు ఇంతగా చెప్పారు కదా! మరి ఆ ప్రాణం ఎలా పుట్టింది? శరీరంలో అది ఎలా ప్రవేశిస్తుంది? వేరు వేరు భాగాలలో తనను తాను పంచుకొని అది శరీరాన్నంతా ఎలా వ్యాపించి వుంటుంది? ఒక శరీరంనుంచి మరో శరీరంలో ఎలా ప్రవేశిస్తుంది? పార్థివజగత్తును ఎలా నిల బెడుతుంది? ఆధ్యాత్మికజగత్తుకు ఎలా ఆధారాన్ని చేకూర్చుతుంది?''

ఇలా గుక్క తిప్పుకోనివ్వకుండా అడిగిన అశ్వలాయనుడికి పిప్పలాదుడు ప్రేమతో సమాధానం చెప్తాడు. ''పరమాత్మతత్త్వంనుంచి ప్రాణం ఉదయిస్తుంది. వస్తువును ఆశ్రయించిన నీడలా ప్రాణితోనే ప్రాణం శరీరంలో ప్రవేశిస్తుంది. ఒక మహారాజు తన మంత్రులకూ, సామంతులకూ, అధికార్లకూ. పరిచారకులకూ వేరువేరు పనులు విధించినట్టుగా వేరువేరు ప్రాణులను వేరువేరు భాగాల్లో ప్రసరింప జేస్తుంది - ముఖ్యమైన ప్రాణం. తాను శిరో భాగంలో ముఖనాసికాదుల్లో ఉండి అపానాన్ని గుహ్యేంద్రియాలకు పంపుతుంది. మధ్య సమాన వాయువును నింపుతుంది. శరీరం తీసుకున్న ఆహారం అన్ని అవ యవాలకూ సమానంగా అందేట్టు సమానవాయువు చూస్తుంది.

''ఈ శరీరంలో జీవాత్మకు నివాస స్థానమయిన హృదయం నుంచి శత సహస్ర నాడులు శాఖోపశాఖలుగా ప్రసరించి శరీరమంతటా వ్యాపిస్తాయి,

మొత్తం మీద 72 కోట్ల సంఖ్యలో ఈ నాడు లుంటాయి. వీటన్నిటిలో వ్యాన వాయువు వ్యాపించి వుంటుంది.

"ఉదానవాయువు పైకి ప్రసరించివుంటుంది. పాప పుణ్యాల ననుసరించి యీ వాయువు జీవిని మరణానంతరం ఊర్ధ్వలోకాలకుగానీ, అధోలోకాలకుగానీ, మళ్ళీ మనుష్యలోకానికిగానీ తీసుకవెళ్తుంది సుషుమ్నలో ఈ వాయువుసంచరిస్తుంది.

"బాహ్య జగత్తులో కూడా ఈ పంచప్రాణాలు కనిపిస్తాయి. సూర్యుడిలో ప్రాణవాయువు, భూమిలో అపానవాయువు, ఆకాశంలో సమానవాయువు, గాలిలో వ్యానం, అగ్నిలో ఉదానం-ఇలా పంచభూతాల్లో పంచవాయువులు సంచరిస్తాయి.

"శరీరం లోపల వున్న ప్రాణమే శరీరం బయట కూడా వుంది. జీవితంలో జీవి అనుభవించిన సుఖదుఃఖాల సారాంశం ప్రాణవాయువులో అంకితమై వుంటుంది. అవసాన కాలంలో ఇలా కూడుకొని వున్న సకలేంద్రియ మనస్సారాన్ని ముఖ్య ప్రాణం చిచ్చుబుడ్డిలాంటి ఉదానవాయువు సాయంతో జీవి సంపాదించుకున్న లోకాలకు జీవాత్మను తీసుకొని వెళ్ళుతుంది. ఈ రహస్యం తెలుసుకున్న జ్ఞానికి పునర్జన్మ లేదు. ప్రాణం ఎలా పుడుతుంది, ఎలా శరీరంలో ప్రవేశిస్తుంది, ఈ శరీరాన్ని వదలి మరో శరీరంలోకి ఎలా చేరుకుంటుంది, భౌతికంగా వ్యాపించివున్న ప్రాణమే ఆధ్యాత్మికంగా అంతరాత్మలో ఎలా సంచరిస్తుంది అనే విషయయాలు కూలంకషంగా తెలుసుకున్నవాడే ప్రాణాయామ పరాయణుడు. అదే అమరత్వం."

## 4

ఆ తర్వాత గర్గవంశస్థుడు సౌర్యాయణి ప్రశ్న లడుగుతాడు: "స్వామీ! ప్రాణికోటి మైమరచి నిదురించిన సమయంలో నిద్రపోతున్నదెవరు? మేల్కొని వున్నదెవరు? కలలు కంటున్నదెవరు? కంటినిండా నిదరపోయి ఆనందిస్తున్న దెవరు? గాఢనిద్రలో జీవలక్షణాలన్నీ ఎక్కడ చేరుకుంటున్నాయి."

ఈ ప్రశ్నలకు మహర్షి చెప్పిన సమాధానం ఇది: "సూర్యుడు అస్తమించి నపుడు సూర్యకిరణాలన్నీ తేజోమండలంలో లయించి మరునాడు ఉదయం సూర్యోదయం కాగానే మళ్ళీ కిరణాలు ప్రసరించినట్టుగా ఇంద్రియ వ్యాపార మంతా నిద్రలో మనస్సులో ఏకీభూతమవుతుంది. అందువల్లనే జీవుడు చూడ లేడు, వినలేడు. మాట్లాడలేడు, గ్రహించలేడు, త్యజించలేడు, ఆనందించలేడు,

కదలలేదు, మెదలలేదు. ఇలా తనలో తాను లీనమై తన్ను తాను పొందటమే నిద్రపోవటం.

"అలా నిద్రపోతున్న ప్రాణిలో పంచప్రాణాలు పంచాగ్నుల్లాగా మేల్కొని వుంటాయి. ఉచ్ఛ్వాస నిశ్వాసాలు సమానవాయువును సంచరింపజేస్తాయి. ప్రాణవాయువు ఆహవనీయాగ్నిలా ప్రచరిస్తూ వుంటుంది. వ్యానం దక్షిణాగ్నిలా వెలుగుతూ వుంటుంది. అపానం గార్హపత్యాగ్నిలా మసలుతూ వుంటుంది. ఉదానం నిద్రాయజ్ఞానికి యజమాని అయిన మనస్సును కర్మఫలాన్ని అనుసరించి బ్రహ్మలోకంలోకి తీసుకునిపోయి బ్రహ్మానందం ఇలా వుంటుందని రుచి చూపిస్తుంది.

"నిద్రలో విశ్రాంతిని, హాయిని, ఆనందాన్ని అనుభవించేది జీవుడే. దేహమనే దేవాలయానికి అతనే దేవుడు. బాహ్యజగత్తులో చూచింది-చూడంది, విన్నది - విననిది, అనుభవించినది-అనుభవించనిది, మరోసారి కలలో జీవుడు అనుభవిస్తాడు, నెమరువేసుకుంటాడు. పూర్వజన్మలో అనుభవించింది కూడా ఈ జన్మలో కలలలో కనిపించవచ్చు. కలలో కనిపించనిది వుండదు. సర్వాత్మ రూపంలో జీవుడు సర్వం అనుభవించగలుగుతాడు.

"కలలు కూడా రాని గాఢనిద్రలో జీవాత్మ ఉదానంలోని తేజస్సును పురస్కరించుకొని ఆనందలోకంలో ప్రవేశిస్తుంది. అదే బ్రహ్మలోకం. బ్రహ్మానందంలాంటి ఆనందం ఈ ఆత్మజగత్తులో లభిస్తుంది. పంచభూతాలకూ, పంచేంద్రియాలకూ, అంతఃకరణాలకూ మూల కారణమైన పరమాత్మను సమీపంగా చూచి ఆనందించేందుకు జీవాత్మకు అప్రయత్నంగా అహరహం లభించే సదవకాశం స్వప్నలోకం. ఈ అనుభూతి క్షణికం. కాని, ఆత్మజ్ఞానికి ఇది చిరస్థాయిగా లభిస్తుంది. అక్షర పరబ్రహ్మను అక్షయలోకంలో అనవరతం సాక్షాత్కరించుకోగలిగినవాడే సర్వజ్ఞుడు. అంతా తానని తెలుసుకున్న జ్ఞానికే అంతా తెలుస్తుంది."

## 5

అక్షరమనేసరికి సత్యకాముడికి ప్రణవం గుర్తువచ్చింది. వెంటనే మహర్షిని అడుగుతాడు: "అవసానకాలంలో అక్షర పరబ్రహ్మ స్వరూపమైన ప్రణవాన్ని

స్మరిస్తూ ప్రాణాలను వదలితే అక్షయలోకాలు లభిస్తాయంటారు. ఆ విషయం కొంచెం సెలవిస్తారా?''

దీనికి మహర్షి చాల సారగర్భితమైన సమాధానం చెప్తాడు : ''ఓంకారం పరబ్రహ్మ స్వరూపం. అవరబ్రహ్మ కూడా ప్రణవంలోనే వుంది. మనకు కని పించే భూలోకం, దీనికి పైనున్న భువర్లోకం, అన్నింటికి పైనున్న స్వర్లోకం- మూడు లోకాలూ ఓంకారం లోని అకార, ఉకార, మకారాల్లో ఉన్నాయి. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం—మూడూ ప్రణవం లోనే పలుకుతాయి. ప్రణవ నాదాన్ని కేవలం భౌతికంగా భావించి సేవిస్తే ఐహిక సుఖం లభిస్తుంది. మానసికంగా మనన చేసుకొని ఆనందిస్తే చంద్రలోకంలోని సాంద్ర రసానుభూతి లభిస్తుంది. ఆధ్యాత్మికంగా ప్రణవ స్వరూపాన్ని అర్థం చేసుకొని అంతరంగం లోని ప్రణవ నాదాన్ని పరమాత్మ స్వరూపంగా చూచి ఆనందించగలిగితే సూర్య లోకంలో నుంచి బ్రహ్మలోకం వెళ్ళి అక్కడ బ్రహ్మానందాన్ని అనుభవించటం సాధ్యమవుతుంది. భూలోకం, భువర్లోకం అపర బ్రహ్మకు సంబంధించినవి. స్వర్లోకం పరబ్రహ్మకు చెందినది. ప్రణవంలోని మూడు మాత్రలు మూడు లోకాలకూ, మూడు వేదాలకూ మూలాధారాలు. ఈ రహస్యం తెలుసుకొని ప్రణవాన్ని ఉపాసిస్తే కుబుసం వదలిన పామువలె మర్త్యుడు మర్త్య శరీరాన్ని వదలి అమరుడవుతాడు. కాబట్టి ప్రణవం ప్రార్థనగా, భావనగా, సాధనగా ప్రాణికి ఉపకరిస్తుంది. ప్రార్థనతో భూలోకాన్ని, భావనతో చంద్రలోకాన్ని, సాధనతో సూర్యలోకాన్ని జయించవచ్చు. మూడు రూపాల్లో సేవిస్తే మూడు లోకాలను దాటి బ్రహ్మ లోకంలో బ్రహ్మసాయుజ్యం పొందవచ్చు. పిండి కొద్ది రొట్టె, నిష్ఠకొద్ది ప్రతిష్ఠ.''

## 6

చివరి ప్రశ్న శిబి మనుమడు సత్యకాము డడుగుతాడు: ''షోడశ కళా ప్రపూర్ణుడయిన పరమపురుషుడు ఎవరు? ఆ పదహారు కళలు ఏవేవి?'' అని సత్యకాముణ్ణి హిరణ్యానాభు డడిగాడట. ''నాకు తెలియద''ని సత్యకాముడు సమాధానం చెప్పాడట. తమకీ విషయం తెలిస్తే సెలవియ్యండ 'ని సత్యకాముడు పిప్పలాద మహర్షిని అడుగుతాడు. మహర్షి సమాధానం చెప్తాడు :

"పదహారు కళలతో కళకళలాడే ఆ పరమ పురుషుడు మన శరీరంలోది వున్నాడు. పరబ్రహ్మ స్వరూపుడయిన పురుషోత్తముడు మొట్టమొదట తన ఉనికికి, నిలకడకు, మనుగడకు ఆధారమైన ప్రాణాన్ని సృష్టించుకున్నాడు. బయట ఈ లోకంలోనూ, లోపల ఈ శరీరంలోనూ ప్రాణాన్ని ప్రతిష్ఠించేందుకు ప్రాణంతోపాటు శ్రద్ధను, ఆకాశాన్ని, వాయువును, తేజస్సును, నీటినీ, భూమినీ, మనస్సునూ, ఇంద్రియాలనూ, అన్నాన్నీ, వీర్యాన్నీ, తపస్సునూ, మంత్రాలనూ, కర్మలనూ, లోకాలనూ, నామాన్నీ సృష్టించుకున్నాడట. ఇవే పరమ పురుషుని పదహారు కళలు.

"అనేకనదులు సముద్రంలో చేరినంతనే తమ నామరూపాలను పోగొట్టు కొని మహాసముద్రంగా మారినట్లుగానే సామాన్య మానవుల శరీరంలో వుండే యీ పదహారు కళలూ పరమ పురుషుని సాక్షాత్కారం కాగానే ఆ పరతత్త్వంలో కలిసిపోతాయి. ఒక్కొక్కరు వేరువేరుగా కల్పించుకున్న నామరూపాలు సర్వ నామంగా విశ్వరూపంగా మారిపోతాయి. సకల కళావిలాసం కళాతీతమవుతుంది. సకల కళానిలయుడయిన పరమాత్మను సాక్షాత్కరించుకొన్న ద్రష్టకు మరణ భయం ఉండదు. మర్త్యజీవి అమరత్వాన్ని సాధిస్తాడు."

ఆరుగురు శిష్యులడిగిన ప్రశ్నలకు తగిన సమాధానం చెప్పిన పిప్పలాద మహర్షి చివరకు చాల వినయంతో "నాకు తెలిసింది మీకు చెప్పాను. ఇంతకు మించినది కనీసం నాకు తెలిసినంతవరకు లే"దని చెప్తాడు. దానికి శిష్యులు తండ్రిలాంటి గురువుకు నమస్కరించి తమ కృతజ్ఞత చెప్పుకుంటారు.

*"నమః పరమఋషిభ్యోనమః పరమఋషిభ్యః"*



# అక్షరం—అక్షయం

*"అక్షరాత్ సంభవతీహ విశ్వం" – ముండక (1-1-7)*

జ్ఞానం రెండు విధాలు-లోకజ్ఞానం, బ్రహ్మజ్ఞానం. ప్రత్యక్షంగా కనిపించే లోకం. ప్రత్యక్షంగా కనిపించకపోయినా పరోక్షంగా కనిపించేది బ్రహ్మనే.

లోకం క్షరం. బ్రహ్మ అక్షరం. అక్షరమైన బ్రహ్మపదార్థాన్నుంచే క్షరణశీలమైన చరాచరజగత్తు జన్మించింది. ప్రపంచాన్ని ప్రసవించి పాలించి పోషించి చివరకు లయింపజేసుకునేది కూడా అక్షరమే. అక్షయ లోకాలను ప్రసాదించగల యీ అక్షర పరబ్రహ్మను గురించి ముండకోపనిషత్తు మూడు మాటల్లో ముచ్చటగా చెప్తుంది. ప్రశ్నోపనిషత్తులాగా ముండకం కూడా అధర్వవేదంలోది. ప్రధాన తత్త్వమైన బ్రహ్మపదార్థాన్ని గురించి చెప్పటంవల్ల దీనికి ముండకమని పేరు వచ్చి వుండచ్చు.

ఆత్మతత్త్వమే బ్రహ్మపదార్థమని అనుభవపూర్వకంగా తెలుసుకోవటమే బ్రహ్మవిద్య. దీనికి మూడుసోపానా లున్నాయి - భావన, సాధన, ఉపాసన. మొదటి మెట్టు బ్రహ్మభావన - బ్రహ్మపదార్థమంటూ ఒకటి వుందని గట్టిగా నమ్మటం. ఈ నమ్మకాన్ని బలపరుస్తూ మొదటి ముండకం ఆరంభమవుతుంది. సృష్టిలో మొట్టమొదట బ్రహ్మపదార్థమే వుండేది. అదే సృష్టికి మూలకారణం. దానివల్లనే సృష్టికి పుష్టి కూడా చేకూరింది. ఈ సృష్టిని గురించి సరియైన దృష్టిని బ్రహ్మ తన పెద్ద కుమారునికి (అధర్వణునికి) ప్రసాదించాడు. అతని ద్వారా అంగిఋషి తెలుసుకున్నాడు. అంగి దగ్గర సత్యవహుడు నేర్చుకున్నాడు. సత్యవహుడు అంగిరసుడికి చెప్పాడు. ఒకనాడు శౌనకమహాముని అంగిరసుని దగ్గరికి వెళ్ళి "ఏది తెలుసుకుంటే అన్నీ తెలిసిపోతాయో ఆ మూలపదార్థాన్ని గురించి చెప్పవలసిం"దని ప్రార్థిస్తాడు. దానితో సకల విద్యలకు మూలమైన బ్రహ్మవిద్యను గురించిన వ్యాఖ్యానం ఆరంభమవుతుంది.

వేదాలు, వేదాంగాలు, సంగీతం, సాహిత్యం-ఇవన్నీ లౌకికమైన విద్యలు. కోటి విద్యలు కూటి కొరకేనన్న లోకోక్తికి ఈ విద్యలన్నీ ఉదాహరణాలవుతాయి. కాని, అక్షరపరబ్రహ్మను తెలియజేసే బ్రహ్మవిద్య మాత్రం మోక్షవిద్య. దీనినే పరావిద్య అంటారు. మిగిలినవన్నీ అపర విద్యలు. పరతత్త్వం ఇంద్రియ జన్యమైన జ్ఞానానికి అతీతమైనది. దానికి రంగు లేదు, రూపం లేదు. కంటికి కని పించదు, చెవులకు వినిపించదు. కాని, కాళ్ళు, చేతులు, కళ్ళు, చెవులు ఉన్న జీవకోటి ఆ పరతత్త్వం నుంచే ఉదయించింది. సూక్ష్మ రూపంలో ప్రపంచ మంతటా వ్యాపించి యున్న ఆ పరతత్త్వాన్ని బ్రహ్మవేత్తలు ప్రతి అణువులో చూస్తారు సాలీడు గూడు కట్టుకున్నట్టు, పుడమి మీద చెట్లుచేమలు పెరిగినట్టు, శరీరంలో నుంచి రోమరాజి మొలచినట్టు అక్షర పరబ్రహ్మ నుంచి ఆకాశాది

పంచ మహాభూతాలతో కూడిన చరాచర జగత్తు వెలువడింది. అక్షర పరబ్రహ్మ చేసిన తపస్సు ఫలించి అన్నం ఏర్పడ్డది. అన్నం నుంచి ప్రాణం, మనస్సు, ఇంద్రియాలు, ఇంద్రియ వ్యాపారం, కర్మఫలం అన్నీ ఒకదానివెంట మరొకటి కార్యకారణ సంబంధంతో ఆవిర్భవించాయి. అన్నింటికి మూలకారణం బ్రహ్మ. అన్ని రూపాలు పరబ్రహ్మకు ప్రతి రూపాలే. అన్ని నామాలూ పరబ్రహ్మకు పర్యాయ పదాలే.

బ్రహ్మపదాన్ని పరిచయం చేసే వేదవాఙ్మయం ముఖ్యంగా జ్ఞాన విజ్ఞాన సంపదతో కూడుకునివుంది. కాని కాలక్రమంలో వేద మంత్రాలకు కర్మకాండ పరంగా అర్థం చెప్పి కామితార్థాలను సాధించుకొనేందుకు వీటిని ఉపయోగించుకోవటం జరిగింది. ఈ విధంగానే యజ్ఞయాగాదులు ఆరంభమయ్యాయి. హోమ కుండంలో అగ్నిని ప్రజ్వలింపజేసి అందులో ఆహుతులు వేసినందువల్ల అవి హవ్యవాహనుని ద్వారా దేవతలకు చెందుతాయి. దేవతలు వాటిని స్వీకరించి యజమానులకు ఈ లోకంలోనే కాక స్వర్గలోకంలో కూడా కోరిన సుఖాలను ప్రసాదిస్తారు. కాని, యిందులో ఒక ప్రమాదం వుంది. ఆచరణలో ఏమాత్రం నియమ భంగమైనా, ఉచ్చారణలో ఏ మాత్రం స్వరభంగ మయినా ఉన్నత లోకాలకు బదులు అధోలోకాలు లభించవచ్చు. దర్శపూర్ణమాస చాతుర్మాస్యాది నియమాలలో ఏమీ లోపం రాకూడదు. అగ్నిహోత్రం నిత్యజీవితంలో కూడా ఎంత మేలు చేస్తుందో, అంత కీడు కూడా చేయగలదు. కాళి, కరాళి, మనోజవ, సులోహిత, సుధూమ్ర వర్ణ, స్ఫులింగిని, విశ్వరుచి - అను ఏడు నాలుకలతో అగ్ని ఆహుతి కోసం ఎదురు చూస్తూ వుంటుంది. నియమాలను నిష్ఠతో పాటిస్తూ అగ్నిని ఆరాధిస్తే యజమాని దేహం చాలించిన తర్వాత దేవేంద్రభోగాలను అనుభవిస్తాడు. నిత్యం అగ్నిహోత్రంలో అర్పించిన ఆహుతులు సూర్య కిరణాలు ప్రసరించే మార్గంలో యజమానిని సగౌరవంగా 'రండి రండ'ని పిలిచి ప్రేమతో స్వర్గానికి తీసుకొని పోతాయి. 'ఇది మీరు సంపాదించుకొన్న ఉన్నత లోకమ'ని పేరు పేరు వరుసన పుణ్యాత్ములకు పూజ్య స్థానాన్ని ప్రసాదిస్తాయి. కాని, యీ భోగం శాశ్వతం కాదు. చేసిన పుణ్యం కరిగిపోగానే మళ్ళీ మర్త్య లోకానికి తిరిగి రావలసివుంటుంది. గొప్ప గొప్ప పండితులు కూడా క్షణిక సుఖానికి లొంగిపోయి ఈ మార్గాన్నే అనుసరిస్తారు అలాంటి పండితులు మరి కొందరిని కూడా తమ మార్గంలోకే త్రిప్పుకుంటారు. గుడ్డివాడు దారి చూపిస్తే

మరో గుడ్డివాడు వెంట వెళ్ళినట్టు సగం తెలిసినవాడు అసలు తెలియనివాణ్ణి తప్పుదారి పట్టిస్తాడు.

అలాకాక సాంసారిక వాసనలకు దూరంగా శ్రద్ధతో జీవిత పరమార్థాన్ని గురించి ఆలోచించి ఏకాంత కాంతారాల్లో తపస్సు చేసే బ్రహ్మనిష్ఠులు శాశ్వతమైన శాంతిసౌఖ్యాలను అందుకుంటారు. శాంత చిత్తులు, బ్రహ్మవేత్తలు అయిన గురువులు లభించటం కష్టం. మిడిమిడిజ్ఞానంతో ఇహానికీ పరానికీ కాకుండా చేసే మోసగాండ్లే ఎక్కువగా కనిపిస్తారు. కాబట్టి బ్రహ్మవేత్త లభించటం బ్రహ్మవిద్యకు మూలం. నిజమైన బ్రహ్మజిజ్ఞాస మనస్సులో ఉదయిస్తే బ్రహ్మవేత్త తప్పక లభిస్తాడు. అలాంటి ఆలోచన ఏర్పడటమే అదృష్టం.

## 2

భావన తర్వాత సాధన ఆరంభమవుతుంది. బ్రహ్మభావమే సత్యం. దానినుంచే మిగిలిన భావాలు ఉదయిస్తాయి. చివరకు అందులోనే లయిస్తాయి. ప్రజ్వలిత వహ్నినుంచి నిప్పురవ్వలు లేచినట్టుగా బ్రహ్మపదార్థం నుంచే జీవసంతతి వెలువడుతుంది. బ్రహ్మకు ఆకారం లేదు. కాని, జీవులకు ఆకారం వుంది. పంచప్రాణాలు, పంచభూతాలు, పంచేంద్రియాలు, వాక్కు, మనస్సు,హృదయం-అన్నీ సర్వాంతర్యామి సంకల్పం వల్లనే ఏర్పడుతాయి. అగ్నిలో, చంద్రుడిలో, ఒకే తేజస్సు వేరు వేరు రూపాల్లో కనిపిస్తుంది. ఈ తేజస్సే మేఘంగా మారి వర్షం కురిపిస్తుంది. వానలు కురిస్తే పంటలు పండుతాయి. పంటలవల్ల ప్రాణికోటికి ఆహారం లభిస్తుంది. ఆహారం వల్ల వీర్యం, వీర్యంవల్ల సంతతి—ఇలా జీవోత్పత్తి నిరంతరం కొనసాగుతూ వుంటుంది. దీనికి మూలం తేజస్సు. ఈ లోకంలోనే కాదు, ఏడు లోకాల్లో కూడా పరబ్రహ్మ నుండి వెలువడిన తేజస్సే నానా రూపాలలో జీవనదివలె ప్రవహిస్తుంది. వాక్కు, మనస్సులో కలిసి పంచప్రాణాలు బయటిలోకాలనూ, అంతర్లోకాన్ని ఉజ్జీవితం చేస్తాయి. ఇదంతా పురుషోత్తముని కళావిలాసం.

ఈ తేజస్సు హృదయకుహరంలో దాగివుంటుంది. నిరంతరం వెలుగుతూ వుండే యీ దీప్తిని తెలివితేటలతో తెలుసుకునేందుకు వీల్లేదు. సూక్ష్మరూపంలో-అణువు కంటె స్వల్ప పరిమాణంలో - వున్న యీ జ్యోతిలో బ్రహ్మాండమంతా నిండివుంది. దాన్ని భేదించి అందులో ప్రవేశించాలంటే ఒకే ఒక మార్గం ఉంది.

ప్రణవం దీనికి ఏకైక సాధన. ప్రణవనాదం ఉపనిషద్దర్శనం ప్రసాదించిన ధనువు. ఈ ధనువును ధైర్యంగా చేతబట్టుకొని ఆత్మ అనే బాణాన్ని అందులో సంధించి బ్రహ్మ పదార్థమనే లక్ష్యాన్ని గురిపెట్టి కొట్టాలి. ముందు చేతిలో వున్న విల్లు కదలకుండా నిలకడగా వుండాలి. ఆ తర్వాత ఆత్మ అనే బాణానికి ఉపాసన అనే రాతిమీద బాగా పదును పెట్టాలి. ఏమరుపాటు లేకుండా మెలకువగా బాణాన్ని వదలాలి. అలాచేస్తే జీవాత్మ పరమాత్మలో చేరుతుంది. తనలోవున్న తాను తనకు కనిపిస్తాడు. తనను తాను తెలుసుకోవటం తనువు దాల్చినందుకు పరమార్థం. మిగిలినదంతా వాగాడంబరం. ఆత్మ సాక్షాత్కార మొక్కటే అమరత్వానికి ఆధారం. ఇహానికీ పరానికీ మధ్య సేతువులా వుండేది ఆత్మ. ఆత్మను పలకరించుకోవాలంటే ప్రణవమే పరిభాషగా ఉపకరిస్తుంది. ఆత్మకు అర్థమయ్యేది ప్రణవనాదమే. ప్రణవ సాధనతో ఆత్మను చేరుకోగలిగితే పర మాత్మను సమీపించినట్టే. ఆత్మ సాక్షాత్కారం కాగానే హృదయంలోని ముడు లన్నీ విడివడిపోతాయి. మనస్సులోని సందేహాలన్నీ తీరిపోతాయి. కర్మబంధనలు క్షీణించిపోతాయి. నిష్కలం, నిష్కలంకం, నిరంజనం, నిరామయమైన పర బ్రహ్మ ప్రపంచమంతటా నిండియున్నదని గమనించగలిగినవాడే బ్రహ్మవేత్త. అతని దృష్టిలో ముందు, వెనుక, కింద, పైన, ప్రక్కన- అంతా బ్రహ్మ మయమే. 'సర్వం ఖల్విదం బ్రహ్మ'.

## 3

ముండకంలోని మూడోభాగం ఉపాసనను గురించి చెప్తుంది. పరతత్త్వా నికి సమీపంగా ఉండటమే ఉపాసన. కాని మనం పరతత్త్వానికి దగ్గరగా ఉన్నా మని అనుకున్నా అనుకోకపోయినా ఆ తత్త్వం మాత్రం మనకు పరమ సమీపం గానే వుంది. ఆ విషయం అంతరాత్మకు తెలిసినట్టు మనకు కూడా తెలియాలి. అదే ఉపాసనా లక్షణం. దీనినే ఒక్కొక్కప్పుడు ఉపవాసమని కూడా అంటుంటాం. ఉపవాసమంటే అన్నం తినకుండా ఉండటం మాత్రమే కాదు. అన్నానికి మించిన మరో ఆనందానికి సమీపంగా ఉండటంవల్ల ఆహారభావమే లేకుండా పోవడం నిజమైన ఉపవాసం.

దీనికి ఉపనిషత్తులో ఒక మంచి దృష్టాంతం కనిపిస్తుంది. ఒక చెట్టుమీద రెండు పిట్టలున్నాయట. అందులో ఒకటి మంచి మంచి పండ్లను కొరుక్కు తింటున్నదట. రెండవ పిట్ట ఏమీ తినకుండా తింటున్న పిట్టను చూస్తూ వున్నదట. అలాగే శరీరమనే చెట్టుమీద జీవాత్మ, పరమాత్మ అనే రెండు పక్షులున్నాయి. ఫలాసక్తితో తన్నుతాను మరచిన జీవాత్మకు పక్కనున్న పరమాత్మ కని పించను గూడా కనిపించదు. పూర్వపుణ్యం ఫలించి తన పక్కనున్న పక్షి కనిపించగానే పాపపుణ్యాల ఫలితాన్ని పరిత్యజించి జీవుడు బ్రహ్మలో లీనమై పోతాడు. అందరిలో ప్రకాశిస్తున్న మహాప్రాణమే తనలో కూడా వుందని తెలిసిన ఆత్మవంతుడు ఆత్మానందాన్ని అనుభవించగలుగుతాడు. ఆత్మజ్ఞానమే బ్రహ్మ జ్ఞానం. ఆత్మను తెలుసుకున్నవాడే బ్రహ్మవేత్తలలో అగ్రగణ్యుడు.

ఇలాంటి ఆత్మజ్ఞానం ఎలా కలుగుతుంది? సత్యం, తపస్సు, బ్రహ్మ చర్యం- ఈ మూడింటిని సాధించగలిగితే శరీరంలోని కాలుష్యమంతా పోతుంది. స్వచ్ఛంగా తేరుకొని వున్న నీటిలో నక్షత్రకాంతి స్పష్టంగా ప్రతిబింబించినట్టు నిర్మలమైన హృదయంలో నిష్కలమైన సత్యం ప్రతిఫలిస్తుంది. సత్యమే జయి స్తుంది. అసత్యం జయించదు. సత్యం పరమాత్మకు నివాస స్థానం. అది ఎంత స్థూలమో, అంత సూక్ష్మం. ఎంత దూరమో అంత దగ్గర. అది ఇంద్రియగోచరం కాదు, కాని చైతన్యం దాన్ని చేరుకోగలుగుతుంది. సత్యస్వరూపమైన ఆత్మను సాక్షాత్కరించుకున్న బ్రహ్మజ్ఞానికి సాధ్యం కానిది లేదు. అసలతనికి కోరికలే వుండవు. కోరికలున్నంతకాలం బ్రహ్మపదార్థం కనిపిచదు. వాగ్విలాసం, చిద్వి లాసం, కళావిలాసం పరతత్త్వాన్ని అందుకోలేవు. ఆత్మ అనుగ్రహం వల్లనే ఆత్మసాక్షాత్కారం లభిస్తుంది. ఆత్మజ్ఞానికి రాగద్వేషాలు ఉండవు. నిర్మలమైన అంతఃకరణంతో నిరంతరం నిష్కలమైన బ్రహ్మతత్త్వాన్నే ధ్యానిస్తూ వుంటాడు. సముద్రంలో కలిసిన నదీజలానికి తన ఉనికి తెలియనట్టుగానే అక్షర పర బ్రహ్మను ప్రత్యణువులో ప్రత్యక్ష పరచుకొన్న బ్రహ్మజ్ఞాని బ్రహ్మలోనే లీనమై బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు.

—బ్రహ్మవిద్ బ్రహ్మైవ భవతి—



# ఆత్మ - బ్రహ్మ

## "అయమాత్మా బ్రహ్మ"-మాండూక్యం (2)

అక్షర పరబ్రహ్మకూ, అంతరంగికమైన ఆత్మతత్త్వానికి భేధం లేదు. బాహ్య ప్రపంచంలో వ్యాపించి వున్న పరబ్రహ్మ స్వరూపమే హృదయాంతర మరుభూమిలో ఆత్మ మందాకినిని వెలయింపజేస్తుంది. ఆత్మతత్త్వమే బ్రహ్మ. బ్రహ్మపదార్థమే ఆత్మ. ఈ రెంటిని సమకూర్చి సమీకరించేది ప్రణవ నాదం, ఏకాక్షరం, ఓంకారం. ఈ రహస్యాన్ని చిక్కని మాటల్లో చక్కగా వివరించి చెప్తుంది మాండూక్యోపనిషత్తు. ఇది కూడా అథర్వణ వేదానికి చెందిందే. ఆకారంలో అన్నిటికంటె చిన్నది. కాని ఆలోచనా గరిమలో అన్నింటిని కాక పోయినా, కనీసం ఎన్నదగిన కొన్నింటిని మించింది. చిన్న చిన్న పన్నెండు వాక్యాల్లో (మంత్రాల్లో) మానవ జీవితాన్ని ఆత్మపరంగా, బ్రహ్మపరంగా, అక్షరపరంగా నిరూపించిన తత్త్వ చింతామణి మాండూక్యం.

చరాచర జగత్తులో కనిపించేదంతా నశిస్తుంది. కనిపించంది నశించదు. అదే అక్షరం. అక్షరజగత్తంతా ఓంకారంలో—ఒక్క అక్షరంలో—ఇమిడివుందని మాండూక్యంలోని మొట్టమొదటి మంత్రం చెప్తుంది. కనిపించనిది, నశించనిది మాత్రమే అక్షరమనిపించుకుంటుంది. ఓంకారం కూడా అలాంటిదే, ప్రణవ నాదం వినిపిస్తుందే కాని కనిపించదు. ఆ వినిపించటం కూడా బాహ్యజగత్తుకంటె అంతర్జగత్తుకే ఎక్కువగా వినిపిస్తుంది. ఈ ధ్వనిని అంతరాత్మ బాగా అర్థం చేసుకుంటుంది. పరమాత్మకు ఇది చిరపరిచతమైన నిస్వనం. అసలు ప్రణవం పరమాత్మకు పర్యాయపదమని యోగశాస్త్రం చెప్తుంది. ఈ నాదం నాలుగు మూలల్లో వినిపిస్తుంది. నాలుగు కాలాలకూ ప్రసరిస్తుంది, నాలుగు పాదాలలో విహరిస్తుంది. ఓంకారం లేని తావు లేదు. ఓంకారం వినిపించని క్షణం లేదు. ఓంకారం వ్యాపించని జీవకణం లేదు. ప్రపంచమంతా ప్రణవ మయమే. భూత భవిష్యద్వర్తమానాలే కాదు, ఈ మూడింటికి అతీతమైన మరో కాలం ఏదయినా వుంటే అది కూడా ఓంకారమేనట.

ప్రపంచమంతా ఓంకారమయితే 'ఓమిత్యేకాక్షరం బ్రహ్మ' అన్న వాక్యాన్ని అనుసరించి ఓంకారం బ్రహ్మస్వరూపమవుతుంది. కాబట్టి ప్రపంచమంతా బ్రహ్మమయమవుతుందని మాండూక్యంలోని రెండవ మంత్రం సిద్ధాంతీకరిస్తుంది. పరబ్రహ్మ ప్రణవ వాచ్యం కాబట్టి ప్రపంచం ప్రణవమయమయితే బ్రహ్మమయం కూడా అయినట్టే. అంతేకాదు 'అయమాత్మాబ్రహ్మ' – ఆత్మతత్త్వం బ్రహ్మపదార్థమేనని యీ మంత్రంలో మధ్యభాగం చెప్తుంది. కాబట్టి ఆత్మకూ బ్రహ్మకూ ప్రణవానికీ అభేదం సిద్ధిస్తుంది. ప్రణవానికీ ఆత్మకూ అవినాభావ సంబంధం ఎలా కుదురుతుందనే ప్రశ్నకు సమాధానంగా ఈ మంత్రంలో చివరి భాగం 'సోయమాత్మాచతుష్పాత్' అని ఆత్మకు నాలుగు పాదాలున్నాయని సూచిస్తుంది. అలాగే ప్రణవానికి కూడా నాలుగు పాదాలున్నాయని తర్వాత ఎనిమిదో మంత్రంలో సూచించటం జరుగుతుంది. కాబట్టి ఆత్మకూ ప్రణవానికీ అన్యోన్యాశ్రయం కుదురుతుంది, అభేదం సిద్ధిస్తుంది. ఇదే మాండూక్యంలోని మిగిలిన మంత్రాలు చెప్పే పరమార్థం.

ముందు ఆత్మను గురించి విచారణ జరుగుతుంది. ప్రపంచంలో ప్రతిమానవుడూ నాలుగు దశలను నిత్యం అనుభవిస్తాడు–జాగ్రదవస్థ, స్వప్నావస్థ, సుషుప్త్యవస్థ, తురీయావస్థ. ఈ నాలుగు అవస్థలు లేక దశలు నాలుగు పాదాలుగా వర్ణించటం జరిగింది. మొదటిది జాగ్రదవస్థ. ఇందులో వ్యక్తి మేల్కొని వుంటాడు. రెండవది స్వప్నావస్థ. ఈ పరిస్థితిలో వ్యక్తి నిద్రపోతూ వుంటాడు, కాని కలలు కంటూ వుంటాడు. కలలు కూడా రాని గాఢ నిద్ర పట్టినప్పుడు దాన్ని 'సుషుప్తి' (సు–సుప్తి) అంటే హాయిగా నిద్రపట్టిందని అంటాం. ఈ మూడింటికీ అతీతమైన మరో స్థితి కూడా ఉంది. దాన్నే తురీయావస్థ అంటాం. తురీయమంటే నాలుగోది అని అర్థం. ఈ స్థితిలో వ్యక్తి తన్ను తాను మరచినంత తన్మయత్వం పొందుతాడు. పరమాత్మ సాన్నిధ్యంలో జీవాత్మ పరవశమయ్యే యీ పరమానంద మనస్థితి దేహ బుద్ధితో చూస్తే తామసం, ఆత్మ బుద్ధితో చూస్తే తన్మయత్వం. ఒకటి విస్మృతి, మరొకటి సిమ్మృతి. జీవాత్మకూ పరమాత్మకూ మధ్యనున్న మాయావరణాన్ని అధిగమించగలిగితే అది సమాధి అవుతుంది. లేకుంటే అది కేవలం విశ్రాంతి మాత్రమే అవుతుంది.

జాగ్రదవస్థలో ఆత్మ బహిర్ముఖంగా ఉంటుంది. బయటి వస్తువులు కనిపిస్తాయి. శబ్దాలు వినిపిస్తాయి. రంగు, రుచి, వాసన తెలుస్తాయి. వ్యక్తి

తనకు తానయి వేరుగా వ్యష్టిగా ఉండక సమష్టి జీవితంలో పాల్గొంటాడు. నలుగురితోపాటు కష్టసుఖాలు అనుభవిస్తాడు. ఇలాంటి అనుభూతికి ఆధారంగా అతనికి శిరస్సు, కళ్ళు, చెవులు, వాక్కు, ప్రాణం (శ్వాస), హృదయం, కాయం (కరచరణాలు) అనే ఏడు అవయవాలు ఉంటాయి. సమిష్టిగా చూస్తే ఈ సప్తాంగాలు విశ్వ మానవుడిలో అగ్నిగా, సూర్య చంద్రులుగా, దిక్కులుగా, జ్ఞాన విజ్ఞానాలుగా, వాయువుగా, అంతరిక్షంగా, భూమిగా కనిపిస్తాయి. వ్యక్తి మానవుడిలాగానే విశ్వ మానవుడు లేదా వైశ్వానరుడు కూడా ఈ సప్తాంగాల సహకారంతో సప్త లోకాల్లో సంచరిస్తూ వుంటాడు. కాని ప్రాపంచిక మాయవల్ల తానే వైశ్వానరుణ్ణి అనే తాదాత్మ్య భావం సామాన్య జీవికి ఏర్పడదు. తాత్త్వికంగా చూస్తే ప్రతి నరునిలో వ్యాపించిన వైశ్వానరతత్త్వమే విశ్వాత్మ.

ఈ వైశ్వానరునికి పందొమ్మిది ముఖాలున్నాయట. కర్మేంద్రియాలైదు, జ్ఞానేంద్రియాలైదు, పంచ ప్రాణాలు, మనస్సు, బుద్ధి, చిత్తం, అహంకారం అనే నాలుగు అంతఃకరణాలు- మొత్తం పందొమ్మిది ముఖాలతో జాగ్రదవస్థలో ఉన్న వ్యక్తి సుఖ దుఃఖాలను స్థూలంగా అనుభవిస్తాడు. శరీరం స్థూలం కాబట్టి అనుభూతి కూడా స్థూలంగానే వుంటుంది. కంటికి కనిపించిందే దృశ్యం. చెవులకు వినిపించిందే శబ్దం. నాల్కను మెప్పించిందే భోజ్యం. ఉంటేనే తృప్తి. తింటేనే పుష్టి.

స్వప్న లోకం దీనికి భిన్నంగా వుంటుంది. స్వప్నావస్థలో ఆత్మ అంతర్ముఖంగా వుంటుంది, తన అనుభూతి తనవరకే పరిమితమై వుంటుంది. పదిమంది ఒక గదిలోనే పండుకొని కలలు కంటున్నా, ఎవరి కల వాళ్ళది. ఎవరి కల్పన వాళ్ళది. ఎవరి అనుభూతి వాళ్ళది. పక్కలో పండుకున్న తల్లికీ, బిడ్డకూ కూడా ఈ స్వప్నానుభూతి వేరు. స్వప్నావస్థలో బాహ్య జగత్తుతో సంబంధం ఉండదు. వ్యక్తి మరో ప్రపంచాన్ని సృష్టించుకొని అందులో రూపం కాని రూపాన్ని, శబ్దం కాని శబ్దాన్ని, ఆహారం కాని ఆహారాన్ని కేవలం భావనా రూపంలో అనుభవిస్తాడు. కాని ఆనందం మాత్రం ఆనందమే. వస్తుజన్యమయినా, కాల్పనికమైనా ఆనందానుభూతిలో భేదం లేదు. జాగ్రదవస్థలో వున్న సప్తాంగాలు (తల, కళ్ళు, చెవులు, వాక్కు, ప్రాణం, హృదయం, కాయం) పందొమ్మిది ముఖాలు స్వప్నావస్థలో కూడా వుంటాయి. కాని ఇవి భౌతికంగా కనిపించవు, మానసికంగా వీటిని భావించటం జరుగుతుంది. బయటి

వెలుగులాంటిది లోపల కూడా వుంది. ఇదే వ్యక్తిలోని తైజ స్వరూపం. ఈ తేజోమయ జగత్తులో వ్యక్తి తనకు తోచిన రూపాలను, శబ్దాలను, వాసనలను సృష్టించుకుంటాడు. అతని అనుభూతి అతనిది. దానినే ప్రవివిక్తమైన అనుభూతి అంటాం. ఈ స్వప్నలోకం ఆత్మకు రెండవ పాదం.

మూడో పాదం సుషుప్తి, గాఢనిద్ర. సుషుప్తిలో కలలు కూడా కరిగి పోతాయి. కమ్మగా కంటినిండా నిద్రపడుతుంది. అంతే. అంతకు మించిన మరో అనుభూతి ఉండదు. ఒక్కొక్కప్పుడు స్వప్నావస్థలో కన్న కలలు కూడా సుషుప్తిలో విస్మృతిలో చేరిపోతాయి. అందుకే మనకు కొన్ని కలలు గుర్తుంటాయి. కొన్ని గుర్తుండవు. కలలను కూడా మరచిపోయే సుషుప్తిలో వ్యక్తికి అవయవాలతో పని లేదు, సుఖదుఃఖాలతో ప్రమేయం లేదు. అన్ని అవయవాలు మనస్సులో లయించి ఏకీభూతమవుతాయి. అనుభూతి సర్వస్వం ప్రజ్ఞానంగా మారి రాశీభూతమయిపోతుంది. వ్యక్తి వ్యష్టిగానూ వుండడు, సమిష్టిగానూ ఉండడు. తన ఆనందమంటూ వేరే వుండదు. అందరికీ సమానమైన ఆనంద లోకంలో చేరి ఆత్మతో పాటు పరమానందాన్ని అనుభవిస్తాడు ఆనంద మయుడయిన జీవి. ఈ స్థితినే ప్రాజ్ఞస్థితి అంటారు. ఈ స్థితిలో చైతన్య మొక్కటే మిగిలిపోతుంది.

దీనిని కూడా అధిగమించి ఆత్మ తురీయావస్థను కూడా పొందుతుంది. ఆ స్థితిలో అంతా ఆత్మమయం. సకల జీవజగత్తుకు మూలాధారమైన సర్వాత్మ కల్పించుకున్న కమనీయ సామ్రాజ్యమిది. వ్యక్తికి విరాట్ స్వరూపాన్ని ప్రసాదించే సమాధి స్థితి యిది. ఈ స్థాయిని అందుకున్న ఆత్మ జీవిని గురించి ఏమి చెప్పేందుకు వీలులేదు. అతని ప్రజ్ఞ బహిర్ముఖమా, అంతర్ముఖమా, రెండునా అని సిద్ధాంతం చేసి చెప్పటం కష్టం. అతను కేవలం ఘనీభవించిన ప్రజ్ఞా స్వరూపుడని కూడా చెప్పలేము. తెలివితేటలు ఉన్నాయని కాని, లేవనికాని చెప్పేందుకు అసలే వీలులేదు. ఈ తురీయావస్థలో పరమానందాన్ని అనుభవిస్తున్న ఆత్మ కంటికి కనిపించదు, పలకరిస్తే పలకదు, పట్టుకుందామంటే చేతులకు చిక్కదు, ఇలా వుంటుందని విశ్లేషించి చెప్పాలంటే నిలకడగా కనిపించే లక్షణాలే గోచరించవు, ఆలోచించి అవగాహన చేసుకుందామంటే ఆలోచన ఆరంభం కాగానే ఆధారం అదృశ్యమయి పోతుంది. మనకు తెలిసిన దానితో పోల్చి దానిలా వుంటుందని అనుకుందామంటే దానికి మరిదేనితో పోలికలు

కలవవు. తాననే ఆత్మ భావం తప్ప మరో భావానికి అందని ఆత్మసారం అనే దొకటి ఉన్నదని మాత్రం చెప్పగలం. ప్రాపంచిక వాసనలన్నీ ఉపశమించిన తర్వాతనే యీ ఆత్మ ప్రత్యయం ఏర్పడుతుంది. అందులో మంచి తప్ప మరొకటి లేదు. అంతకు మించిన మంచితనం మరొక చోట కనిపించదు. అదే ఆత్మకు నాల్గవ పాదం. జీవధానికి చరమావధి. జీవికి పరమావధి.

ఈ ఆత్మతత్త్వమంతా ఓంకారంలో ఇమిడి వుంది. ఆత్మలోని నాలుగు పాదాలు ఓంకారంలోని నాలుగు మాత్రలను పోలి వుండడం గమనించదగిన విషయం. ఆత్మ అనుభవించే జాగ్రత్, స్వప్న, సుషుప్తి, తురీయావస్థలే ఓం కారంలోని అ-కార, ఉ-కార, మ-కార, అధిగత మాత్రలు. ప్రణవ మాత్రలే పరమాత్మకు పాదాలు. పాదాలే మాత్రలు.

ప్రణవంలో మొదటి ధ్వని 'అ' కారం. వాక్ప్రపంచానికి మూలం, వర్ణ మాలలో మొదటిది అయిన యీ 'అ' కారం వైశ్వానర రూపంలో వుండే ఆత్మను సూచిస్తుంది. కంఠంలోనుంచి వెలువడి నిరాటంకంగా బాహ్య జగత్తులో ప్రవే శించి ప్రసరించే ఆద్యస్వరం కావటం వల్ల ఇది అనాది, అనంతమైన ఆత్మ తత్త్వానికి మొదటి పాదమయింది. ఇలా అకారంలో ఆత్మ తొలి వెలుగును గమనించ గలిగిన తపస్సంపన్నులు అన్నింటిలో అగ్రస్థానాన్ని అలంకరిస్తారు.

రెండవ మాత్ర 'ఉ' కారం ఉచ్చారణ దృష్ట్యా ఉత్కృష్టమైనది. స్వర పేటిక (ముఖవివరం) మధ్య పలకటం వల్ల కంఠానికీ, ఓష్ఠానికీ మధ్యభాగంలో సమానదూరంలో ఉంటుంది. ఉచ్చారణ కూడా ఉదాత్తంగా ఉంటుంది కాబట్టి ప్రణవంలో కూడా దీనికి మధ్య (కేంద్ర) స్థానం లభించింది. ఇదే ఆత్మకు రెండవ పాదమైన తైజస రూపాన్ని అక్షరరూపంలో నిరూపిస్తుంది. అకారం స్థూలంగా కనిపించే వైశ్వానర రూపానికి ప్రాతినిధ్యం వహిస్తే ఉకారం సూక్ష్మంగా సంచరించే తైజస స్వరూపాన్ని ప్రతిఫలింపజేస్తుంది 'అ' కారం బాహ్యజగత్తుకు సంబంధించింది. 'ఉ' కారం అంతర్జగత్తుకు సంబంధించింది. మరికొంత జాగ్రత్తగా పరిశీలించి చూస్తే ఉకారం ఉభయ సామాన్యంగా కనిపిస్తుంది. ఉకారం ఉచ్చరించే సమయంలో ముఖ వివరం సంవృతం కాకుండా వివృతం కాకుండా వుంటుంది పెదిమలు దగ్గరకు వస్తాయి నోరు తెరుచుకునే వుంటుంది.

నాలుక దేనినో ముద్దాడుతున్నట్టు కనిపిస్తుంది. 'అ' కారం 'క' వర్గంతో చేరిన స్వరం. 'ఉ'కారం 'ప' వర్గానికి చెందిన స్వనం. వర్ణమాలలో 'అ' కారం ప్రక్కనే ఉకారం కనిపించినా ఉచ్చారణలో 'ఉ' కారం 'అ' కారానికి, 'మ' కారానికీ మధ్య భాగంలోనే ఉంటుంది. అందువల్లనే 'ఉ' కారం తైజస రూపానికి చిహ్నంగా జీవధానిలోని సూక్ష్మాత్మను సూచిస్తుంది. ఈ విధంగా 'ఉ' కారాన్ని అర్థం చేసుకుని ఆరాధించిన వారికి ఔనత్యంతో పాటు బుద్ధి సిద్ధిస్తుంది. సమత్వమే యోగ లక్షణం. ఔన్నత్యం యోగసిద్ధికి తార్కాణం.

'మ' కారం ప్రణవంలో మూడో మాత్ర. వర్ణమాలలో ఇది చివరి వ్యంజ్యం. 'అ' కారం జాగ్రదవస్థలోని వైశ్వానర రూపానికి చిహ్నమయితే, 'ఉ' కారం స్వప్న దశలోని తైజస రూపానికి ప్రతీక. 'మ' కారం సుషుప్తిని సూచిస్తుంది. సుషుప్తిలో కారణాత్మ ప్రాజ్ఞరూపంలో ఉంటుంది. 'మ' కారం మితి (కొలత) కి, అపీతి (లయాని)కీ ప్రతీక. ప్రాజ్ఞస్వరూపంలో భాసించే పరమాత్మ స్వరూపంగా 'మ' కారాన్ని ఆరాధించిన వారికి అపరిమేయమైన ఆత్మానందం లభిస్తుంది. చివరకు ఆత్మ సాయుజ్యం సిద్ధిస్తుంది.

ప్రణవంలోని మూడు మాత్రలకు అతీతమైన అమాత్ర స్థితి తురీయావస్థకు సరిపోతుంది. ఓంకారంలో అకారం, ఉకారం, మకారం ఉచ్చరించిన తర్వాత వినిపించే తురీయనాదమే తురీయావస్థ. స్థూలశరీరం, సూక్ష్మశరీరం, కారణ శరీరం-మూడింటికి అతీతమైన పరమాత్మ తత్త్వమే యీ అమాత్ర (లేక అధి మాత్ర) స్థితిలో గోచరిస్తుంది. ఈ తత్త్వాన్ని అవగాహన చేసుకున్న ఆత్మజ్ఞాని ఆత్మశక్తితో ఆత్మను సాక్షాత్కరించుకుంటాడు.

"ఆత్మైవ సంవిశత్యాత్మనాత్మానం."



# అన్నం-ఆనందం

"ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్
అన్నవానన్నాదో భవతి" —తైత్తిరం (3-6)

ప్రపంచంలో ప్రతి జీవికి అన్నం (ఆహారం) కావాలి. జీవితావసరాల్లో అన్నిటికంటె ముఖ్యమైనది అన్నం. కాని మానవుడు కేవలం అన్నంతో తృప్తి పడడు. కడుపు నిండినంతమాత్రాన అతని మనస్సు నిండదు, జీవితం పండదు. తిండితిని కూర్చునేందుకు ఆతని మనసొప్పదు. తిని తిరగాలి, తిరిగి పనిచెయ్యాలి. పనిచేస్తూ ఎందుకు చేస్తున్నాను, ఏమిచేస్తున్నాను, ఎలా చేస్తున్నాను అని ఆలోచించాలి. ఆలోచనకు ఫలితంగా ప్రపంచంలోని మంచిని గమనించాలి. గమనించిన మంచిని అనుసరించాలి. తనకు చేతయినంతవరకు తాను మంచిని పెంచి పదిమందికి పంచిపెట్టాననే తృప్తితో అతని అంతస్సు ఆనందించాలి. ఇలా అన్నంతో ఆరంభించి ఆనందంవరకు మానవజీవితం పయనిస్తుంది. ఇందులో ప్రతి అంతస్తుకూడా ప్రధానమే. తీగలాగా సాగే యీ జీవితంలో అన్నం ఆనందంతో ఎలా ముడివడివుందో తైత్తిరీయం శిక్షావల్లి, బ్రహ్మానందవల్లి, భృగువల్లి- అనే మూడు భాగాల్లో, 31 అనువాకాల్లో వివరిస్తుంది.

తైత్తిరీయోపనిషత్తు కృష్ణయజుర్వేదంలో తైత్తిరీయ శాఖకు సంబంధించింది. ఇది చాల ప్రాచీనమైన ఉపనిషత్తు కావటంవల్ల ఇందులో మంత్రభాగం ఎక్కువగా కనిపిస్తుంది. మామూలు మాటలుకూడా ఇందులో మంత్రమాధుర్యంతో గంభీరంగా వినిపిస్తాయి. సత్యం వద, ధర్మం చర, ఓమితి బ్రహ్మ, ఆకాశ శరీరం బ్రహ్మ, సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ, రసోవైసః- మొదలయిన మననీయ సూక్తులు ఈ ఉపనిషత్తులోనివే. మరో విశేషమేమంటే ఈ ఉపనిషత్తులో చెప్పిన విషయాలు బ్రహ్మచారులకు, గృహస్థులకు, సన్యాసులకు సమానంగా ఉపయోగిస్తాయి. అన్నం నుంచి ఆనందంవరకు జీవితంలో ఏ విషయం కూడా అప్రధానమైనది కాదనే విషయం ఇందులో మాటిమాటికి మనస్సులో నాటుకు పొయ్యేట్టు చెప్పటం జరిగింది. పార్థివ ప్రపంచమే కాదు, పారమార్థిక

జగత్తు కూడా తాత్త్వికంగా ఒకటే, ఇందులో ప్రతి కణానికీ మరో కణంతో సంబంధం వుందనే సమన్వయ సిద్ధాంతం ఈ ఉపనిషత్తులో కనిపిస్తుంది.

గురుకులంతో విద్య నభ్యసించి గృహస్థాశ్రమంలో ప్రవేశించబోయే శిష్యులకు ప్రేయ శ్రేయోభిలాషియైన గురువు చివరి మాటగా చెప్పిన సందేశ వాక్యాలు శిక్షావల్లిలో వినిపిస్తాయి. చదువంటే కేవలం అక్షరజ్ఞానమే కాదు, చదువుకొన్న విషయాలను జీవితంతో సమన్వయం చేసుకొని సార్థకమైన జీవితం గడపి జీవిత పరమార్థాన్ని సాధించటమే చదువుకున్నందుకు ప్రయోజనమని చదువు చెప్పిన గురువుగారు తమ హితోపదేశాన్ని ఆరంభిస్తారు. వాక్యార్థ విచారంతో ఈ ఉపదేశం ఆరంభమవుతుంది. చెప్పదలచుకున్న విషయాన్ని చక్కని వాక్యరూపంలో చెప్పాలంటే ఆ వాక్యంలోని మాటలు సరియైన పద్ధతిలో ఒకదానితో ఒకటి మేళవించి శుద్ధంగా బద్ధంగా ఉండాలి. ఇలా వాక్యంలో వేరు వేరు మాటలను కలిపి కూర్చే సంహితా (సంధి) నియమాల్లాగా ప్రజాపతి రచించిన జీవ కావ్యంలో కూడా కొన్ని సంధి నియమాలు కనిపిస్తాయి. వేరు వేరు తత్త్వాలను ఏక సూత్రంతో బంధించినట్టు ప్రపంచంలో ఏ పదార్థాన్ని పరిశీలించినా తెలిసిపోతుంది. లోకం, ఆలోకం (వెలుగు), విజ్ఞానం, సంతానం- అన్నింటిలో ఇలాంటి సంధి నియమాలను, సమాస పద్ధతిని గమనించి వాటిని మహా సంహితలుగా మహర్షులు గుర్తించారు. ఇలాంటి మహా సంహితలు ప్రపంచంలో ఐదు కనిపిస్తాయి.

వీటిలో మొట్టమొదటిది లోక సంహిత. కింద భూమి, పైన స్వర్గం, మధ్య ఆకాశం మనకు కనిపిస్తాయి. భూమినీ స్వర్గాన్ని (అంటే నక్షత్ర మండలాలను) సంధించగా (కలుపగా) ఏర్పడింది ఆకాశం (గగనం, శూన్యం). ఇలా కలిపేది వాయువు. దీనినే సంధానమంటారు. కలిపితే ఏర్పడ్డ ఆకాశాన్ని సంధి అంటారు. కలిసిపోయిన భూలోకం, స్వర్లోకంలో ఒకటి పూర్వరూపం, మరొకటి ఉత్తరరూపం అవుతాయి. సంహితా (సంధి) నియమాల ననుసరించి పూర్వవర్ణం, పరవర్ణం ఒకదాని నొకటి తనవైపు లాక్కుంటాయి. దీనినే సన్నికర్షమంటారు. ఈ సన్నికర్షబలం ఒక్కొక్కచోట పూర్వవర్ణానికి ఎక్కువగా ఉంటుంది. మరొకచోట పరవర్ణబలం ఎక్కువగా ఉంటుంది. సామాన్యంగా పూర్వవర్ణమే పరవర్ణాన్ని ఎక్కువగా ఆకర్షిస్తుంది. స్త్రీ పురుషుల్లో ఎవరికి ఎక్కువ ఆకర్షణ శక్తి లేక నికర్షణ బలం ఉన్నదని చెప్పటం సాధ్యం కానట్టే, యీ మహా

సంహితల్లో కూడా రెండింటికీ సమానమైన బలం వుంటుందని చెప్పటమే సమంజసంగా తోస్తుంది. దీనినే పాణిని 'పరః సన్నికర్షః సంహితా' అని నిర్వచిస్తాడు. భూమిని నక్షత్రమండలం ఆకర్షిస్తుందనీ చెప్పవచ్చు. నక్షత్ర మండలం భూమిని ఆకర్షిస్తున్నదని కూడా చెప్పవచ్చు. పృథ్విని పూర్వరూప మనీ, ద్యులోకాన్ని ఉత్తరమనీ ఉపనిషత్సంహిత చెప్తుంది. వాయువు ఈ రెంటినీ కలుపుతుందట. అలా కలిపినందువల్ల ఆకాశం ఏర్పడుతుందట. ఇది చాలా సూక్ష్మబుద్ధితో గమనించవలసిన విషయం. భూలోకానికీ, ద్యులోకానికి మధ్య ఆవహం, ప్రవహం, అనువహం, సంవహం, వివహం, పరావహం, పరివహం- అని ఏడు రకాల వాయువులు సంచరిస్తూ వుంటాయి. వీటివల్లనే పరమాత్మకు శరీరమయిన ఆకాశం ఏర్పడుతుంది. భూలోకానికీ, ద్యులోకానికి ఇలాంటి రాగాత్మక సంబంధం ఉండబట్టే పూర్ణ చంద్రుణ్ణి చూచి సముద్రం పొంగిపోతుంది. సూర్యకిరణాలు కడలి కెరటాలతో కలిసి ఆనందంతో నాట్యం చేస్తాయి. వెలుగుకోసం కమల బాలికలు కళ్ళు కాయలు కాచినట్టు రాత్రంతా కాచుకుని వుంటాయి. ఇదే మొదటి మహా సంహిత- లోకసంహిత.

రెండవది జ్యోతిస్సంహిత. ఇందులో అగ్ని పూర్వరూపం. ఆదిత్యుడు ఉత్తర రూపం. జలం సంధి. విద్యుత్కాంతి సంధానం. భూలోకంలో వున్న అగ్నిని, ఆదిత్య మండలంలోని సూర్య కాంతితో మెరుపుతీగ కలుపుతుంది. దీనికి ఫలితంగా నీరు ఏర్పడుతుంది. ఈ నీటి పట్టు తెలుసుకున్నవాడికి ప్రపంచం ఆట పట్టవుతుందని మంత్ర పుష్పం మందహాసం చేసి చెప్తుంది.

మూడవది విద్యా సంహిత. దీనికి ఆచార్యుడు పూర్వ రూపం. శిష్యుడు ఉత్తరరూపం. ఇద్దరినీ కలిపే సంధానం ప్రవచనం. ఇద్దరి సహకారంతో రూపొందేది విద్య. అదే సంధి.

ఇలాగే ప్రజా సంహితలో తల్లి పూర్వ రూపం. తండ్రి ఉత్తర రూపం. సంతానం సంధి. కలయిక (సంభోగం) సంధానం. చివరిది అధ్యాత్మ సంహిత. ముఖ వివరాని (నోటి)కి కింది భాగం పూర్వ రూపం. పైభాగం ఉత్తర రూపం. వాక్కు సంధి నాలుక సంధానం.

ఈ పంచ మహా సంహితల పరమ రహస్యం తెలుసుకున్న జ్ఞానికి ఇహం పరం రెండూ సిద్ధిస్తాయని ఉపనిషత్తు చెప్తుంది. కేవలం తెలుసుకున్నంత

మాత్రాన లాభం లేదు. తనకు తెలిసిన విషయాన్ని ఇతరులకు తెలియపరచటం కూడా అవసరమే. దీనికి మంచి మేధాశక్తి, శరీర దార్ఢ్యం, మధురమైన వాక్కు, బహు విషయ పరిజ్ఞానం అవసరం. పరమాత్మ అనుగ్రహం వల్ల ఇవన్నీ లభిస్తాయి, కాబట్టి నిత్యం అప్రమత్తతతో ఆత్మ తత్త్వాన్ని గురించి ఆలోచిస్తూ పరమాత్మను భావించాలి.

ప్రాణాయామం చేసేప్పుడు కాని, గాయత్రి లాంటి మంత్రాన్ని జపించేప్పుడు కాని ఓం భూః, ఓం భువః, ఓం సువః, ఓం మహః అని వ్యాహృతులు చెప్తాం, వీటిలో ఉండే పరమార్థమేమిటో శిక్షావల్లి వివరిస్తుంది. 'భూః'- అంటే భూలోకం, 'భువః'- అంటే అంతరిక్షం. 'సువః'-అంటే స్వర్లోకం 'మహః-' అంటే ఆదిత్య మండలం. మరో దృష్టితో చూస్తే అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు-ఈ నాలుగు వ్యాహృతులు. అలాగే ఋగ్వేదం, సామవేదం, యజుర్వేదం, సామవేదం కూడా ఈ నాలుగు వ్యాహృతులకు ప్రాతినిధ్యం వహిస్తాయి. మరో పద్ధతిలో ఆలోచిస్తే భూర్భువ స్వర్లోకాలు ప్రాణాపాన వ్యానాలకు ప్రతీకలు కాగా, మహర్లోకం అన్నానికి ఆలంబన మవుతుంది. ఏ దృష్టితో చూచినా ఈ వ్యాహృతులలో నాల్గవది మహత్తత్త్వానికి సంబంధించిందని స్పష్టమవుతుంది. అదే బ్రహ్మ స్వరూపం. ఆకాశమే బ్రహ్మకు శరీరం. హృదయాకాశం కూడా బ్రహ్మకు శరీరమే. ముఖ వివరంలోని పై భాగం కేశరాశికి మూలం. అదే బ్రహ్మ రంధ్రం. అవసానదశలో ఓంకారంతో కూడిన యీ వ్యాహృతులను స్మరించిన జీవికి బ్రహ్మ సాయుజ్యం లభిస్తుంది ఓంకారమే బ్రహ్మ. ఓంకారమే ఆత్మ. ఓంకారమే ప్రపంచసారం. ప్రపంచంలో బ్రహ్మ పదార్థం కానిది లేదు. కాని మన భావనాశక్తిని బట్టి మనకు ప్రతి పదార్థం బ్రహ్మ పదార్థంగా కనిపిస్తుంది. భూర్భువ స్వర్లోకాలు పంచప్రాణాలు, పంచతత్త్వాలు, పంచతన్మాత్రలు, పంచేంద్రియాలు, సప్త ధాతువులు- అన్నీ బ్రహ్మ మయమే. ఋతం, సత్యం, తపస్సు, శమం, దమం-వీటన్నిటినీ స్వాధ్యాయం వల్ల సాధించాలి అంతేకాదు, అగ్నిహోత్రాన్ని ఆరాధించటం, ఇంటికి వచ్చిన అతిథిని పూజించటం, మంచి సంతానాన్ని కనటం, సత్య మార్గంలో ధర్మాన్ని ఆచరించటం- ఇవన్నీ స్వాధ్యాయం, ప్రవచనం లాంటివే. అంటే జీవితంలో కేవలం చదువుకోవటం, చదువు చెప్పటం మాత్రమే చాలదు. ఆ చదువును క్రియారూపంలో చూపించి తాను తరించి ఇతరులను తరింప చేయటమే జీవిత పరమావధి. ఇలా గార్హస్థ్య

జీవితం సక్రమంగా నిర్వహించగలిగినవాడే చివరకు సంసార చక్రాన్ని దాటి అమృతత్వాన్ని పొందగలడు. త్రిశంకువు ఇలాగే సంసార వృక్షాన్ని ఛేదించి ఆత్మ సామ్రాజ్యాన్ని చేరుకున్నాడు.

ఇంతకూ సారాంశమేమంటే-జీవితంలో నిజం చెప్పాలి. మంచి పనులు చెయ్యాలి. ఏమరుపాటు లేకుండా జ్ఞానాన్ని సంపాదించాలి. గార్హస్థ్యవిధిని ప్రేమతో శ్రద్ధతో నిర్వహించాలి. ధర్మం తప్పకూడదు. తాను చేసే పనిలో ప్రావీణ్యం సంపాదించాలి. ఐహికాముష్మిక సంపదను పెంపొందించుకోవటంలో ఏమరుపాటు పనికిరాదు జ్ఞానం సంపాదించటంలోనూ, ఇతరులకు దాన్ని పంచి పెట్టటంలోనూ సోమరితనం పనికిరాదు. ఒక పని చేయవచ్చునా చేయకూడదా అని సందేహంవస్తే తెలిసినవాళ్ళ నడగాలి. నిజానిజాలు తెలిసినవాళ్లు, ధర్మాన్ని అనుసరించేవాళ్లు, లోభబుద్ధిలేనివాళ్ళు అయిన యోగ్యులను అడిగి తెలుసుకోవాలి. వాళ్ళు ఎలా చెప్తే అలా చెయ్యాలి. వాళ్ళు ఎలా ప్రవర్తిస్తున్నారో గమనించి అలా ప్రవర్తించేందుకు ప్రయత్నించాలి. తల్లిని, తండ్రిని, గురువును, అతిథిని దైవసమానంగా భావించి సేవించాలి. చేయదగిన పనులు చెయ్యాలి. చేయకూడని పనులు మానాలి. చెప్పుకోదగినవి చెయ్యాలి. చెప్ప సిగ్గయ్యేవి మానాలి. తనకున్నదానిలో దానం చెయ్యాలి. ఒకరికి ఇచ్చేది ప్రేమతో ఇవ్వాలి, శ్రద్ధగా ఇవ్వాలి, ఠీవిగా ఇవ్వాలి. ఇవ్వవలసినంత ఇవ్వలేకపోతున్నాననే వినమ్రభావంతో ఇవ్వాలి. తెలిసి దానం చెయ్యాలి. సత్పాత్రకు దానం చెయ్యాలి. ''ఇదే నా ఆదేశం, ఇదే ఉపదేశం, ఇదే శాసనం, ఇదే అనుశాసనం, ఇదే ఉపనిషత్సారం. ఇదే ఉపాస్యం'' అని గురువుగారు శిష్యులకు చెప్తాడు. దానితో శిక్షావల్లి పూర్తవుతుంది.

## 2

ఆ తర్వాత బ్రహ్మానందవల్లి ఆరంభమవుతుంది. బ్రహ్మానందమంటే ఏమిటో పూర్తిగా తెలియకుండానే మనం నిత్యవ్యవహారంలో ఈ మాటను మాటిమాటికి వాడుతూ వుంటాం. బ్రహ్మజ్ఞానం కలవానికి బ్రహ్మ సాక్షాత్కారం వల్ల కలిగే ఆనందాన్ని బ్రహ్మానందం అనవచ్చు. ఇందులో బ్రహ్మ, ఆనందం— అని రెండు మాటలున్నాయి. ఈ రెండింటికి సమగ్రమైన అర్థాన్ని చెప్పి తర్వాత బ్రహ్మానందాన్ని నిర్వచించేందుకు ప్రయత్నిస్తుంది యీ బ్రహ్మానందవల్లి.

"సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ"— మూడు లోకాల్లో నిలబడ గలిగిన అంతులేని జ్ఞానమే బ్రహ్మ. అది నిజమైనది, జ్ఞాన స్వరూపం, అనంతం. ఇలాంటి బ్రహ్మ పదార్థాన్ని తెలుసుకున్నవాడికి తెలియని పదార్థమంటూ వుండదు. జ్ఞాన విజ్ఞాన సర్వస్వం అతని సొత్తు. అలాంటి బ్రహ్మ నుండి ఆకాశం ఉదయించింది. ఆకాశం నుండి వాయువు, వాయువు నుండి అగ్ని, అగ్ని నుండి జలం, జలం నుండి పృథ్వి. పృథ్వి నుండి ఓషధులు, ఓషధుల నుండి అన్నం, అన్నం నుండి పురుషుడు-ఇలా సృష్టి క్రమం సాగింది దీనిని బట్టి బ్రహ్మకు అన్నమయుడయిన పురుషుడికి సంబంధం అవిచ్ఛిన్నంగా ఉన్నట్టు తెలుస్తుంది. అన్నసారంతో పురుష శరీరం ఏర్పడుతుంది. కాని మానవ శరీరం కేవలం అన్నమయం కాదు. అన్నం అన్నింటి కంటె స్థూలమయిన భాగం. అంతకంటె సూక్ష్మమయింది ప్రాణం. దానికంటె సూక్ష్మమయింది మనస్సు. మనస్సు కంటె సున్నితమయింది విజ్ఞానం. దానికంటె సూక్ష్మాతిసూక్ష్మమయినది ఆనందం. కాబట్టి స్థూలంగా చూస్తే మానవుడు అన్నజీవి. కాని యీ అన్నజీవిలోనే ప్రాణజీవి, మనోజీవి, విజ్ఞానజీవి, ఆనందజీవి కూడా ఉన్నారు. బ్రహ్మ సాక్షాత్కారంతో పరవశించి పొంగిపోయేది యీ ఆనందజీవే. అదే బ్రహ్మానందం.

అన్నమయ శరీరం నుంచి ఆనందమయ శరీరం వరకు ఆత్మ చైతన్యం క్రమంగా పరిణతి పొందుతున్నట్టు కనిపిస్తుంది. కూరగాయలు, పండ్లు, పాలు, ధాన్యం, పప్పులు- ఇవన్నీ అన్నం కిందికే వస్తాయి వీటిలో ప్రాణం వుండచ్చు. లేకపోవచ్చు. ఒకవేళ వున్నా అన్నంగా మారేసరికి ప్రాణశక్తి అంతరించి పోతుంది. అసలు ప్రపంచంలో ప్రాణవంతమైన ప్రతి పదార్థం అన్నమే. ఒక ప్రాణం మరో ప్రాణికి అన్నంగా ఉపకరిస్తుంది. అందువల్లనే అన్నంలోనే అన్నం ఉన్నదని అంటారు. అంతేకాదు-అన్నమంటే తినేందుకు ఉపయోగించే పదార్థమే కాదు, తినే జీవి కూడా అన్నమే. తినేది, తినబడేది రెండూ అన్నమే. అన్నమే అన్నాన్ని తింటుంది. ఒక రూపంలో వున్న అన్నాన్ని మరో రూపంలో వున్న అన్నం తింటుంది. కాబట్టి ప్రపంచంలో చైతన్యంగల ప్రతి జీవీ అన్నమే.

కాని మనోమయ జీవులు చాలా కొద్దిమంది. మనిషి మనోజీవి. ఆలోచనా శక్తి చెట్లు చేమలకు ఉంటుందో లేదు తెలియదు. పశు పక్ష్యాదుల్లో రాగ ద్వేషాలు, భయ సంభ్రమాలు కనిపిస్తాయి కాబట్టి అవికూడా మనోమయ

జీవులనుకోవచ్చు. కాని వాటి ఆలోచన మనస్సు వరకే పరిమితమయి వుంటుంది. మంచి, చెడు ఆలోచించే బుద్ధి వాటిలో ఉండదు. ఈ విచక్షణ మానవుడిలోనే ఉంటుంది. అందువల్ల అతడు విజ్ఞానమయ జీవికూడా అయినాడు. చైతన్య వికాసంలో చివరిమెట్టు ఆనందం. ఇది మనుష్యుల కందరికీ అందు బాటులో వుండదు. అందరికీ తెలిసిన ఆనందం పశు పక్ష్యాదుల్లోనే కాక చెట్టు చేమల్లో కూడా ఉన్నట్టు కనిపిస్తుంది. కాని మానవుడు శారీరకంగానే కాక మానసికంగా, అధ్యాత్మికంగా కూడా ఆనందాన్ని అనుభవించగలడు. అదే ఆత్మానందం. దానినే బ్రహ్మానందమని బ్రహ్మానందవల్లి వర్ణిస్తుంది.

బ్రహ్మానందం ఎలాంటిది - అని చెప్పేందుకు ఈ వల్లి ఒక కొలమానం ఏర్పరచుకుంది. అన్నివిధాలా హాయిగా స్థాయిగా నిశ్చితంగా పుష్కలంగా జీవితం గడుపుకోగల మానవుడికీ కలిగే ఆనందాన్ని ఒకటిగా భావిస్తే దానికి వంద రెట్లు ఉంటుందని మనుష్య గంధర్వుల ఆనందం. దానికి వంద రెట్లు దేవ గంధర్వుల ఆనందం. దానికి వంద రెట్లు పితృ దేవతల ఆనందం. దానికి వంద రెట్లు ఆజానజులైన దేవతల ఆనందం, దానికి వంద రెట్లట - కర్మ దేవతల ఆనందం. దానికి వంద రెట్లు అసలు దేవతల ఆనందం. దేవానందానికి వంద రెట్లు దేవేంద్రుని ఆనందం, ఇంద్రుని ఆనందానికి వంద రెట్లు దేవతల గురువయిన బృహస్పతి ఆనందం. బృహస్పతి ఆనందానికి వంద రెట్లట ప్రజాపతి ఆనందం. వందమంది ప్రజాపతుల ఆనందానికి సమానమట బ్రహ్మానందం. ఈ లెక్కను బట్టి చూస్తే సామాన్య మానవుని ఆనందానికి బ్రహ్మానందం ఘనకోటి* రెట్లవుతుంది. ఈ బ్రహ్మానందం కూడా ఆత్మానందం ముందు ఎందుకూ పనికిరాదని బ్రహ్మాండ పురాణం చెప్తుంది. కాబట్టి మనం సామాన్యంగా ఆనందం అని భావించేది అసలానందమే కాదనిపిస్తుంది. ఇది బ్రహ్మానందవల్లి ప్రతిపాదించిన ఆనంద మీమాంస.

ఈ ఆనందాన్ని అనుభవించేముందు ప్రతి ప్రాణీ అన్నం నుంచి ఆనందం వరకు మెట్టుకు పై మెట్టుగా క్రమంగా ఆనంద సోపానాలు దాటవలసిందే. పై మెట్టు చేరినవాడు ధన్యుడు. అతనికి పాప పుణ్యాలు సోకవు. సుఖ దుఃఖాలు తాకవు. ఆత్మ చైతన్యం తప్ప అతనికి మరొకటి పట్టదు. భేద బుద్ధి వల్లనే భయం ఏర్పడుతుంది. భయం వల్లనే ప్రపంచం నడుస్తుంది. కాని

---

* కోటిని కోటి చేత మూడుసార్లు పెంచగా వచ్చిన సంఖ్య

ఆత్మకూ-పరమాత్మకూ, బ్రహ్మకూ-జీవికీ భేదం లేదని తెలిసిన ఆత్మయోగి నిర్భయంగా నిర్వికారంగా నిర్లిప్తంగా నిష్కల్మషంగా ఆత్మను ఆత్మతో చూస్తాడు, ఆత్మలో కలిసి ఆత్మతో ఆడుకుంటాడు, ఆత్మనే బ్రహ్మగా గుర్తించి బ్రహ్మానందాన్ని అనుభవిస్తాడు. అప్పుడు ప్రపంచమంతా రసపూరితంగా, ఆనందమయంగా కనిపిస్తుంది. ఎక్కడ చూచినా ఆనందమే కనిపిస్తుంది. ప్రపంచమంతా బ్రహ్మమయం, ఆనందమయం అయినప్పుడు ఆనందమే బ్రహ్మ లక్షణమయి తీరాలి.

బ్రహ్మానందవల్లి తర్వాత భృగువువల్లి ఆరంభమవుతుంది. వరుణ తనయుడు భృగువు తండ్రి దగ్గరికి వెళ్ళి తనకు బ్రహ్మ పదార్థాన్ని గురించి చెప్పవలసిందని అడుగుతాడు. అన్నం, ప్రాణం, కళ్ళు, చెవులు, మనస్సు, వాక్కు - వీటిలో ఏవయినా బ్రహ్మస్వరూపం కావచ్చని తండ్రి మాట వడుసగా చెప్తాడు. కాని తపస్సు చేస్తే కాని బ్రహ్మపదార్థం తెలియదు కాబట్టి తపస్సు చేసి కనుక్కోమంటాడు. తపస్సు చేసేందుకు ఒక మూల మంత్రం కూడా ఉపదేశిస్తాడు.

''ఈ ప్రపంచంలో జీవులందరు దేనివల్ల ఉదయిస్తున్నారో, దేని ఆధారం వల్ల అభ్యుదయం పొందుతున్నారో, చివరకు దేనిలో లయించి పోతారో, అదే బ్రహ్మ. దానిని తెలుసుకో'' అంటాడు వరుణుడు. ఈ సూత్రాన్ని ఆధారం చేసుకొని కుమారుడు తపస్సు చేస్తాడు. కొన్నాళ్ళు తపస్సు చేసి ''అన్నమే బ్రహ్మ'' అని సిద్ధాంతం చేస్తాడు. ఆకలి అయిన వాడికి అన్నమే బ్రహ్మ. బహుశా తపస్సు ఆరంభించిన తొలి రోజుల్లో బాగా ఆకలి వేసి ఉంటుంది. ఆ సమయంలో అన్నమే బ్రహ్మ అనిపించింది. అన్నం నుంచే ప్రాణులు ఉదయిస్తారు. అన్నంతోనే పెరుగుతారు. అన్నంలోనే లయిస్తారు. కాబట్టి అన్నమే బ్రహ్మ అని అతని వాదం. మరికొన్నాళ్ళు తపస్సు చేసి రమ్మని కుమారుణ్ణి తండ్రి పంపిస్తాడు.

కొన్నాళ్ళ తర్వాత 'ప్రాణమే బ్రహ్మ' అన్న వాదాన్ని సమర్థిస్తూ కుమారుడు తండ్రి దగ్గరికి వస్తాడు. ఇంకా కొన్నాళ్ళు తపస్సు చేసి రమ్మని తండ్రి మళ్ళీ పంపిస్తాడు. ఈసారి ''మనస్సు బ్రహ్మ'' అంటాడు. మరోసారి తపస్సు చేసి ''విజ్ఞానం బ్రహ్మ'' అంటాడు. చివరకు ''ఆనందమే బ్రహ్మ'' అనే నిర్ణయానికి వస్తాడు. ఆనందమే ప్రాణికోటికి మూలాధారం. మానవుడు ముఖ్యంగా అన్నజీవి అయినా చివరకు ఆనందజీవిగానే మారుతాడు. మానవులకే కాక

సమస్త ప్రాణి కోటికి కూడా ఆనందమే మూలకందం. ప్రపంచంలోని ప్రతి జీవి ఆనందంలో పుట్టి, ఆనందంలో పెరిగి, ఆనందంలో లయిస్తాడు. కాబట్టి ఆనందమే బ్రహ్మ అన్నది సిద్ధాంతమయి పోతుంది. ఇదే తైత్తిరీయం తెల్పిన తత్త్వసారం.

అన్నం అన్నానికి అన్నమవుతుంది. ప్రాణం అన్నానికి ప్రాణం పోస్తుంది. మనస్సు అన్నానికి మనసిస్తుంది. విజ్ఞానం అన్నానికి జ్ఞానం ప్రసాదిస్తుంది. ఆనందం అన్నానికి ప్రాణం, మనస్సు, విజ్ఞానం, ఆనందం అన్నింటినీ అనుగ్రహిస్తుంది. అన్నం ఆధేయం. ఆనందం - ఆధారం.

అన్నకోశానికి శరీరమే ఆత్మ. ప్రాణకోశానికి ఆకాశం ఆత్మ. మనఃకోశానికి ఆదేశం ఆత్మ. విజ్ఞాన కోశానికి యోగం ఆత్మ. ఆనంద కోశానికి ఆనందమే ఆత్మ.

ఆనందమే జీవితసారం, ఆత్మరసం, అమృతం.

''సత్యాత్మ ప్రాణారామం మన ఆనందం శాంతి సమృద్ధం అమృతం''



# సృష్టి-దృష్టి

*''ప్రజ్ఞానేత్రో లోకః ప్రజ్ఞాప్రతిష్ఠా ప్రజ్ఞానం బ్రహ్మ''*
*-ఐతరేయం (3-1-3)*

''చీమలో, బ్రహ్మలో, శివకేశవాదులలో'' దేహంలో దేహంగా, హృదయంలో హృదయంగా, మనస్సులో మనస్సుగా, ఆత్మలో ఆత్మగా ప్రేమతో ప్రవేశించి, నేర్పుతో శాసించి, లీలగా లాలించి పాలించే పరతత్త్వం ఏమిటి? అనేది ఐతరేయం లోకోత్తర దృష్టితో ఆలోచించి ప్రజ్ఞానమే పరతత్త్వమని నిర్ణయిస్తుంది. కంటికి కనిపించే సృష్టికి మూలకారణం కంటికి కనిపించకుండానే తన సృష్టిని ఒక కంట కనిపెట్టివుండే విశిష్టమైన దృష్టి అని ఐతరేయం శోధించి,

సాధించి మనకు ప్రసాదిస్తుంది. ప్రత్యక్షంగా కనిపించేది సృష్టి, కనిపించనిది దృష్టి. అదే ఇతరం. దీనినే ఐతరేయం కనిపించేట్టు చేస్తుంది.

ఐతరేయం ఋగ్వేదంలోని అరణ్యక భాగం. ముక్తికోపనిషత్తు పేర్కొన్న 108 ఉపనిషత్తులలో పది ఉపనిషత్తులు మాత్రమే ఋగ్వేదానికి సంబంధించినవి. ప్రస్తుతం ఈ 'ఉపనిషత్సుధ'లో మనం చేర్చుకున్న పదకొండు ఉపనిషత్తులలో ఐతరేయమొక్కటే ఋగ్వేదానికి సంబంధించింది. ఇందులో 33 మంత్రాలు మూడు అధ్యాయాల్లో, ఐదు ఖండాల్లో ఉన్నాయి. ఇందులోని తత్త్వ విచారం ఆత్మతో ఆరంభించి ప్రజ్ఞాన స్వరూపమైన బ్రహ్మ పదార్థంతో పరిసమాప్త మవుతుంది.

ఆదిలో కేవలం ఆత్మతత్త్వం మాత్రమే వుండేదట. కనగలిగింది మరొకటి కనిపించలేదట. ఆత్మకు ఒంటరితనం ఇష్టంలేక సృష్టికార్యం ఆరంభించిందట. పరమాకాశంలోని అంభస్సు (దివి) నుంచి పాతాళంలోని ఆపస్సు (జలం) వరకు సప్తలోకాలు పరమాత్మ సంకల్పమాత్రంచేత ఏర్పడ్డాయి. లోకాలను పాలించేందుకు లోకపాలకులు కూడా కావాలి కదా! అందుకోసం ముందు నీటి నుంచి తపః ప్రభావం చేత హిరణ్యగర్భుడుదయించాడు. అతనికొక ఆకారం ఏర్పడ్డది. మొట్టమొదట కోడిగ్రుడ్డు లాంటి ముఖం ఏర్పడ్డది. ఆ ముఖంలో వాక్కు వెలువడింది. వాక్కులో అగ్ని చేరింది. తర్వాత ముక్కు మొలిచింది. ముక్కులోనుంచి శ్వాస, శ్వాసనుంచి వాయువు ఏర్పడ్డది. తర్వాత రెండు కళ్ళు కనిపించాయి. కళ్ళల్లో సూర్యుడు చేరాడు. అలాగే చెవులు వచ్చాయి. చెవుల నుంచి దిక్కులు ఏర్పడ్డాయి. ఆ తర్వాత చర్మం ఏర్పడ్డది. చర్మంలోనుంచి వెంట్రుకలు మొలిచాయి. అవే చెట్లు చేమలయ్యాయి. ఇంతలో హృదయం ఏర్పడ్డది. హృదయం నుంచి మనస్సు, మనస్సునుంచి చంద్రుడు ఆవిర్భవించాడు. ఆ తర్వాత నాభిరంధ్ర మేర్పడ్డది. అందులో అపానవాయువు చేరింది. అపానంలో మృత్యుదేవత తిష్ఠ వేసుకుంది. చివరకు గుహ్యాంగం ఏర్పడ్డది. అందులో రేతస్సు, రేతస్సునుంచి జలం ఏర్పడ్డాయి.

ఇలా వేరువేరుగా ఏర్పడ్డ అవయవాలు, వాటి అధిదేవతలు మహాసముద్రంలో పడి దిక్కు తెలియక తిరుగుతూ వున్నారు. వాటిని ఒక చోట చేర్చేందుకు పరమాత్మ ఆకలిదప్పులను సృష్టించాడు. ఒకచోట కూర్చుని

ఆహారం తీసుకునేందుకు వాటికి ఆకారం కావలసివచ్చింది. ముందు ఆవు ఆకారాన్ని చూపిస్తే వాటికి ఆ మూర్తి నచ్చలేదు. గుఱ్ఱం లాంటి ఆకృతి చూపిస్తే అదికూడా నచ్చలేదు. చివరకు సర్వాంగ సుందరమైన పురుషాకృతి చూపించే సరికి అన్ని అవయవాలు, దేవతలు ఎగిరి గంతులువేసి త్వరత్వరగా అందులో ప్రవేశించారు.

అగ్ని వాక్కుగా మారి నోటిలో చేరి నాలుకను నెలవు చేసుకున్నది. వాయువు శ్వాసగా మారి నాసిక (ముక్కు) లో ప్రవేశించింది. సూర్యుడు తన వెలుగుతో కళ్ళల్లో చేరాడు. దిక్కులు చెవుల్లో చేరి వినటం మొదలు పెట్టాయి. వనస్పతి కేశరాశిగా రూపొంది చర్మాన్ని కప్పివేసింది. చంద్రుడు మనో రూపంలో హృదయాన్ని చేరుకున్నాడు. మృత్యువుఅపాన వాయువుతో చేరి నాభిని చేరుకున్నది. జలదేవత రేతో రూపంలో లింగధారి అయింది. ఆకలి దప్పులకు మాత్రం శరీరంలో ప్రత్యేకమైన స్థానం లభించలేదు. ప్రతి అవయవంతో, ప్రతి దేవతతో వాటికి సంబంధం ఏర్పడ్డది.

కాని ఆకలిదప్పులు తీరేందుకు ఆహారం కావాలి. పంచ భూతాలతో ఆహారం కూడా ఏర్పడ్డది. ఆకాశం, గాలి, వెలుగు, నీరు, మట్టి-వీటితో ఏర్పడ్డ పురుష శరీరానికి అవే ఆహారంగా లభించాయి. పంచభూతాల ప్రపంచీకరణమే శరీరం. అదే శరీరము తీసుకునే ఆహారం కూడాను.

కాని ఆహారాన్ని గ్రహించేది ఎవరు ? శరీరంలో ఏ భాగానికి ఆహారం కావాలి ? పరమాత్మ సృష్టించిన ఆహారం జీవాత్మను చూచి భయంతో పారిపోసాగింది. అప్పుడు పారిపోతున్న ఆహారాన్ని పట్టుకోమని జీవాత్మ వాక్కును ప్రార్థిస్తుంది. 'నాకెందుకు ఆహారం?' అని వాక్కు పెదమొహం పెడుతుంది. అలాగే ప్రాణం, కళ్ళు, చెవులు, చర్మం, మనస్సు, గుహ్యేంద్రియం - అన్నీ నా కక్కర్లేదంటే నాక్కక్కర్లేదని అన్నాన్ని పట్టించుకోలేదు. చివరకు అపాన వాయువు ఆహారం గ్రహిస్తుంది. అందువల్ల అపాన వాయువును అన్నాయువంటారు. అపాన వాయువు అన్నాన్ని గ్రహించి శరీరాన్ని నిలబెడుతుంది. చివరకు శరీరాన్నే హరించి మృత్యు దేవతకు శరీరాన్ని ఆహారంగా అర్పిస్తుంది.

అంతా బాగుంది కాని శరీరంలో ఆత్మ ఎలా ప్రవేశించిందనేది పెద్ద ప్రశ్న. వాక్కు, ప్రాణం, కళ్ళు, చెవులు, చర్మం, మనస్సు, లింగం - అన్నీ ఎవరి పనులు అవి చేసుకుంటూ వుంటే నాకు శరీరంలో స్థానమేమిటి, అని శరీరాన్ని నిర్మించుకున్న ఆత్మ ఆలోచిస్తుంది చివరకు తలమీద చిన్న రంధ్రాన్ని చేసుకొని ఆత్మ లోపనికి ప్రవేశిస్తుంది. దీనినే బ్రహ్మరంధ్రం లేక 'విదృతి' అంటారు. ఇదే ఆనంద నిలయానికి సింహద్వారం. పరమ యోగులకు బ్రహ్మ నిర్వాణం ప్రసాదించేది కూడా ఇదే ద్వారం. ఈ ద్వారాన్ని తెరుచుకొని నవద్వార నగరమైన శరీరాన్ని చేరుకున్న ఆత్మ తన్ను తాను క్షేమంగా దాచుకునేందుకు అనువైన చోటు ఎక్కడ వుందా, అని పరిశీలించి చూచింది. అలాంటి మూడు ప్రదేశాలు దానికి కనిపించాయి. శరీరం మేల్కొని వున్నపుడు ఆత్మ కళ్ళల్లో వుంటుంది. నిద్రలో కలలు కనేప్పుడు మనస్సులో ఉంటుంది. కలలు కూడా ఆగిపోయిన గాఢ నిద్రలో ఆత్మ హృదయ కమలంలో వుంటుంది. ఇలా జాగ్రత్-స్వప్న-సుషుప్తి సమయాల్లో ఆత్మ నివసించేందుకు ముచ్చటయిన మూడు చోట్లు దొరికాయి. ఈ మూడు స్థానాల్లో కూడా ఆత్మకలలు కంటుంది. ఆత్మ దృష్టితో చూస్తే మనం మేల్కొని చేసేవి, కలల్లో చూచేవి—రెండూ కలలే. కాబట్టి ఆత్మ నివసించే స్థానాలకు 'స్వప్న' నిలయాలని పేరు వచ్చింది. ఆత్మ కలలు కంటున్న యీ స్థలాలు ఆత్మ కళా కేంద్రాలు.

ఇంత ప్రయత్నం చేసి జీవాత్మ శరీరంలో ప్రవేశించి నలువైపుల చూచేసరికి అంతకుముందే పరమాత్మ లోవల తిష్ఠ వేసుకుని వుంది. 'అరే, నా కంటె ముందే ఇక్కడ పరమాత్మ ప్రవేశించివుందే' అని జీవాత్మకు ఆశ్చర్యం వేసింది. ఎంత కాలం నుంచో పరమాత్మను చూడాలని కుతూహల పడుతున్న జీవాత్మకు తలవని తలంపుగా తాను చేరుకున్న తావుననే పరమాత్మ తటస్థపడేసరికి చెప్ప లేనంత ఆనందమయింది. ''నేను చూచాను, నేను చూచాను, నేను చూచాను''- అని మూడు సార్లు ఆత్మ అనుకుని ఆనందించింది.

ఇదే సృష్టి చరిత్ర. ఇందులో సృష్టికి సంబంధించిన గూఢమయిన విషయాలు సరళమైన భాషలో పరోక్షంగా చెప్పటం విశేషం. దేవతలు ప్రతి విషయం పరోక్షంగానే చెప్తారట. అసలు సృష్టికి సంబంధించిన దృష్టి అలాంటిది. ప్రత్యక్షంగా కనిపించేది సృష్టి. పరోక్షంగా స్ఫురించేది దృష్టి. ఇలాంటి

దృష్టి జన్మ జన్మాంతర సాధనవల్లకాని లభించదు. ప్రతి జీవి కూడా సృష్టిలో ఒక భాగం. తాను సృష్టింపబడుతాడు-మరల తానే సృష్టిస్తాడు. తుదకు తన సృష్టిలో తాను లీనమై పోతాడు. ఇలా పుట్టి, పుట్టించి గిట్టిన జీవికి ఈ మూడూ మూడు జన్మలతో సమానం. ఇలాంటి జన్మలు ఎన్ని గడిచినా తాత్త్విక దృక్పథం లేనిదే జీవిత పరమార్థం తెలియదు. వామదేవుడులాంటి ధన్యజీవులకు తల్లి గర్భంలో ఉండగానే సంసరణసారం తెలిసిపోయింది. ఆత్మతత్త్వం తెలియనంతవరకే జన్మబంధం. ఆ తర్వాత ఆత్మసాయుజ్యంతో సంసార బంధం విచ్ఛిన్నమై పోతుంది.

అసలు ఆత్మ అంటే ఏమిటి? ఇది ఐతరేయంలోని చివరి ప్రశ్న. శరీరంలో ఆత్మ ఎక్కడ వున్నది? ఆత్మ చేసే పని యేమిటి? ఇది ఆత్మ, ఇది అనాత్మ అని ఎలా తెలుసుకోవటం? చూచే కళ్ళల్లో ఆత్మ వుందా? వినే చెవుల్లో వుందా? సువాసనలకు మురిసిపోయే ముక్కుల్లో వుందా? మాట్లాడే నోటిలో వుందా? రుచి చూచే నాలుకలో వుందా? లేదు. వీటిచేత పనులు చేయించే హృదయంలోకాని మనస్సులోకాని ఆత్మతత్త్వం ఉండవచ్చు. ఇది మంచిది, ఇది చెడ్డది, ఇది చెయ్యాలి, ఇది చెయ్యకూడదు అని చెప్పే వివేకంలో ఆత్మతత్త్వం ఉండవచ్చు. ప్రపంచంలోని ప్రతి పదార్థాన్ని వేరు వేరుగా గుర్తించి జాగ్రత్తగా పరిశీలించి, ఇలా చెయ్యాలని నిర్ణయించుకొని, ఇతరులతో పని చేయించే జ్ఞానం, విజ్ఞానం, అజ్ఞానం, సంజ్ఞానం, ఆలోచన, జ్ఞాపకశక్తి, సంకల్పబలం-ఇవన్నీ ప్రజ్ఞాన లక్షణాలు. ఇవే ఆత్మ గుణాలు.

ఈ ప్రపంచంలో పంచమహాభూతాలు ప్రజ్ఞానంవల్లనే సంచరిస్తున్నాయి. దేవతలు ప్రజ్ఞాబలంతోనే రాణిస్తున్నారు. నానా యోనుల్లో ప్రవేశించి ప్రభవించిన ప్రాణికోటికి ప్రజ్ఞానమే ఆధారం. స్థావరం, జంగమం-అంతా ప్రజ్ఞానంలోనే ప్రతిష్ఠితమై వుంది. ప్రజ్ఞానమే ఆత్మ. ప్రజ్ఞానమే బ్రహ్మ. ప్రజ్ఞానమే లోకానికీ ఆలోకానికీ ఆధారం. ప్రపంచమంతా సృష్టి. ప్రజ్ఞానమే దృష్టి. ప్రజ్ఞానం బ్రహ్మ.



# ధ్యానం - జ్ఞానం

*"సర్వం ఖల్విదం బ్రహ్మ తజ్జలానితి శాంత ఉపాసీత"*
—ఛాందోగ్యం (3-14-1)

ప్రపంచంలో బ్రహ్మకాని పదార్థం లేదు. ఈ ప్రపంచమంతా బ్రహ్మ తత్త్వం నుంచే ఉదయిస్తుంది, అందులోనే లయిస్తుంది, అందులోనే సంచరిస్తుంది. పార్థివ శరీరంలోని వాక్కు, మనస్సు, ప్రాణం పరమార్థం ప్రసాదించిన భవ్య వైభవమే. ఈ భవ్య సంపద నాధారం చేసుకొని దివి నుండి భువి దాకా ప్రతి కణంలో వ్యాపించి వున్న పరమసత్యాన్ని, శివతమరసాన్ని, దివ్యసౌందర్యాన్ని కళ్ళార చూచి, తనివి దీర ఆస్వాదించి, మనసు తీర అనుభవించి ఆనందించాలి. సారహీనమైన సంసారంలోని సత్యసారమే పరమాత్మ, పరబ్రహ్మ - అదే నీవు- 'తత్త్వమసి'- అని ఛాందోగ్యం సకల వేదాంత సారాన్ని సారగర్భితంగా చెప్తుంది.

ఛాందోగ్యం సామవేదంలోని తలవకార బ్రాహ్మణానికి చెందిన ఉపనిషత్తు. ఇందులో కేవలం జ్ఞానాన్ని గురించే కాక జ్ఞానం లభించేందుకు సాధనభూతమైన ధ్యానాన్ని గురించి కూడా విపులంగా సరళంగా స్పష్టంగా విచారణ జరిగింది. మొదటి అయిదు అధ్యాయాలు ధ్యానపద్ధతి లేక ఉపాసనా విధానాన్ని గురించి చెప్తాయి. చివరి మూడు అధ్యాయాలు తత్త్వం, సత్యం, ఆత్మ, బ్రహ్మ లాంటి తాత్త్విక విషయాలను విశదీకరిస్తాయి. భాష్యకారులకు బాగా నచ్చింది, బ్రహ్మ సూత్రంలో ఎక్కువగా చోటు చేసుకున్నది, తత్త్వాన్ని తార్కికంగానే కాక తన్మయత్వంతో తరిచి తరిచి 'తత్త్వమసి' అన్న మహా వాక్యాన్ని ప్రసాదించింది యీ ఛాందోగ్యమే. ఛందస్సంటే వేదం. వేదం వల్ల ఉదయించే జ్ఞానం ఛందోగం. దానికి మార్గం చూపించేది ఛాందోగ్యం. ఛందస్సనే శబ్దానికి కప్పి కాపాడేది- అని గూడా అర్థం ఉంది. పరమార్థ తత్త్వం తెలిపి పార్థివ బాధలను పోగొడుతుంది, కాబట్టి కూడా ఇది ఛాందోగ్యం అవుతుంది.

ఓంకారం ప్రపంచసారానికి సారభూతమయిందనే ప్రతిపాదనతో ఛాందోగ్యం ఆరంభమవుతుంది. జీవ జగత్తుకు జీవధాని అయిన పృథ్వి భావసారం. పృథ్వికి సారం జలం. నీటికి ప్రయోజనం సస్యం. సస్యసారం పురుషుడు. పురుషునిలోని పరమార్థం వాక్కు. వాక్కులోని పటుత్వంఋక్కు. ఋక్కులోని సౌందర్యసారం సామం. సామవేదంలోని రస సర్వస్వం ఉద్గీథంగా ఉదయిస్తుంది. అదే ఓంకారం. కాబట్టి ఓంకారం సారంలో సారం, రసంలో రసవత్తామమైన రసం, రసమతం, శివతమం, శివతమ రసం. ఓంకారాన్ని ఉద్గీథం అంటారు. ఉద్గీథమనే పదంలో ఉత్ అంటే ప్రాణం, గీ- అంటే వాక్కు, థ - అంటే అన్నం. ఈ మూడూ ఆత్మ మనశ్శరీరాలకు సంబంధించినవి. ఒక విధంగా ఇవి దివికి రవికి భువికి దీప్తి చిహ్నాలు. అన్ని మంత్రాలకూ ఓంకారం మూలం. ప్రణవనాదంతోనే ప్రతి మంత్రం, ప్రతి స్తోత్రం ఆరంభమవుతుంది. ఓంకారం పాడుకుంటూ భాస్కరుడు పరమాకాశంలో పారవశ్యంతో పయనిస్తాడట. ఓంకారం స్వరమయితే భాస్కరుడు ప్రత్యాస్వరంగా వ్యవహరిస్తాడట.

ఆదిలో దేవతలు ఓంకారాన్ని ఉపాసిస్తుంటే రాక్షసులు అడ్డు తగిలారట. నోటితో పలికితే వాళ్ళు నోటిని దుర్గంధపూరితం చేశారట. చెవులతో వింటే చెవులను కూడా కలుషితం చేశారట ముక్కుతో ఊపిరి పీల్చినట్టు ఓంకారాన్ని సేవిస్తే ముక్కును కూడా దుర్వాసనతో దూషితం చేశారట. అప్పుడు దేవతలు ప్రాణంతో ప్రణవనాదాన్ని సాధన చేయసాగారు. రాక్షసులు ప్రాణం దాకా రాలేకపోయారు. కాబట్టి ప్రాణంతో చేసే ప్రణవోపాసన పరమ పవిత్రమై వుంటుందని ప్రణవ జీవులు భావిస్తారు. ప్రాణం, అపానం ప్రతిక్షణం ఉచ్ఛ్వాస నిశ్వాసాలలో సంచరిస్తూ వుంటాయి. కాని మాట్లాడే సమయంలో, ఆలోచించే సమయంలో, ఏకాగ్రతతో పని చేసుకునే సమయంలో ఈ రెండు వాయువులు ఆగి వ్యానానికి అవకాశం ఇస్తాయట. అదే ప్రాణాయామం. ఇది ప్రణవం వల్ల సులభంగా సాధ్యమవుతుంది.

సామగానంలో ప్రవణసాధన పరిపూర్ణ పరిమితిని పొందుతుంది ఋగ్వేదం, సామవేదం రెండూ సామవేదంలోనే మిళితమై యున్నాయని ఛాందోగ్యం వ్యాఖ్యానిస్తుంది. ఋగ్వేదం అగ్నికి సామవేదం పృథ్వికి ప్రతీకమట. కాని సామ శబ్దంలోని సా-పృథ్విని సూచిస్తే, అమ-అనే పదం అగ్నిని నిరూపిస్తుందట.

కాబట్టి సామవేదంలో ఋగ్వేదంలోని అగ్ని, సామంలోని భూమి- రెండూ వున్నా యని ఛాందోగ్య భావన. అంతేకాదు, ఋక్సామాలు ప్రపంచించే అంతరిక్ష వాయువులు, దివ్యాదిత్య లోకాలు, నక్షత్ర సుధాకరులు, చక్షురాత్మలు, శ్రోత్ర మనస్సులు, శుక్లనీలచ్ఛాయలు, నీల శుక్ల కిరణతరంగాలు - అన్నీ సామంలో ఇమిడి వున్నాయని ఛాందోగ్యం విస్తారంగా వివరించి చెప్తుంది. ఇహలోకంలో సౌఖ్యం, పరలోకంలో శాంతి సామగానం వల్ల సాధించవచ్చునని ఈ ఉపనిషత్తు ఉపపత్తిపూర్వకంగా ఉపన్యస్తం చేస్తుంది.

కాని యిలాంటి ఉపాసనకు నిష్ఠ కావాలి. చక్రం కుమారుడు ఉషస్తి ఇలాంటి నైష్ఠికుడు. ఒకసారి అతనికి విపరీతంగా ఆకలి వేస్తుంది. మావటివాడి దగ్గర మినపప్పు చూసి అది కావాలని అడుగుతాడు. ఏనుగు ఎంగిలి చేసినదని మావటివాడు చెప్పినా, ప్రాణ రక్షణ కోసం ఆ యెంగిలి తిండిని ఉషస్తి అంగీ కరిస్తాడు. కాని మినుములు తిన్న తర్వాత మావటివాడు మంచినీళ్ళిస్తే, ఉషస్తి తాగడు. మంచినీళ్ళు మరోచోట తాగుతానని చెప్తాడు. ప్రాణాన్ని కాపాడుకొనేంత వరకే నియమ భంగం క్షంతవ్యం. అది ఆపద్ధర్మం.

ఇలాంటి నిష్ఠ, నియమం ఉషస్తి లాంటి మహాగృహస్థుల్లోనే కాదు, కుక్కల్లో, నక్కల్లో కూడా ఏర్పడవచ్చు. ఈ విషయం చెప్పేందుకు ఒక తెల్ల కుక్క కథ మొదటి అధ్యాయం చివర కనిపిస్తుంది. కుక్క చేసిన హింకారం గంభీరమైన వేదమంత్రంలా వెలువడి మిగిలిన కుక్కలకు ఆహారాన్ని సంపా దించి పెడుతుంది. ఇంతటితో మొదటి అధ్యాయం అయిపోతుంది.

రెండవ అధ్యాయం కూడా ఉపాసనను గురించే చెప్తుంది. ప్రజాపతి తపస్సు చేసి వేదాలను వెలయించాడట. వేదాలకు మూలకందంగా ఓంకారం, ఓంకారానికి సహకారంగా "భూ ర్భువ స్వః" (భూః, భువః, స్వః) అనే మూడు వ్యాహృతులు కూడా ఏర్పడ్డాయి. ఇవి ప్రణవనాదాన్ని భువినుంచి ఆకాశం గుండా దివికి వ్యాపింప చేస్తాయి. మూడు లోకాలకూ ఆలోకం (వెలుగు) ప్రసా దించే ఓంకారమే కర్మను ధర్మంగా మార్చివేస్తుంది. ప్రణవ నాదంతో పర మాత్మను స్మరించి చేసిన ప్రతి కార్యం ధర్మ సమ్మతమైన సత్కార్యం అవు తుంది. అసలు ధర్మమంటే ప్రపంచాన్ని నిలబెట్టేదని అర్థం. దీనికి మూడు ఆధారాలున్నాయి. మొదటిది యజ్ఞం, అధ్యయనం, దానం. రెండవ పాదం

తపస్సు. మూడవది బ్రహ్మచర్య దీక్ష. ఈ మూడు పాదాలమీద ధర్మం నిలబడుతుంది.

ఉదయంనుంచి సాయంత్రంవరకు యజ్ఞానికి అనుకూలమయిన సమయమే. ప్రాత స్సంధ్య, మధ్యాహ్న సంధ్య, సాయం సంధ్య - ఆరాధనకు అనువయిన సమయం. ఉదయం వసుదేవతలు, మధ్యాహ్నం రుద్రదేవతలు, సాయంత్రం ఆదిత్యాది విశ్వదేవతలు యజ్ఞానికి అధ్వర్యం వహిస్తారు. ఉదయం గార్హ్య పత్యాన్ని, మధ్యాహ్నం దక్షిణాగ్నిని, సాయంత్రం ఆహవనీయాన్ని ఉద్దేశించి ఉత్తరాభిముఖంగా కూర్చుని యజ్ఞం చెయ్యాలి. ఇది కేవలం కర్మకాండతో కూడిన యజ్ఞమే కానక్కరలేదు, జ్ఞాన యజ్ఞం కావచ్చు, ధ్యాన యజ్ఞం కావచ్చు, సూత్ర యజ్ఞం కావచ్చు, మరేమయినా కావచ్చు. (యత్) ఈ ప్రపంచానికి మూల కారమేమిటి అనేది (జ్ఞ) తెలుసుకోవాలని చేసే ప్రయత్నమే యజ్ఞం.

సామవేదం దీనికి సాధన సంపత్తిని అందజేస్తుంది. సామగానానికి దేవ తలు ఆనందిస్తారు. సకాలానికి వర్షం కురుస్తుంది. పంటలు సమృద్ధిగా పండు తాయి. ఋతువులు సక్రమంగా సాగుతాయి. పశువులు పాలిస్తాయి. ప్రాణం శరీరంతో సహకరిస్తుంది. అంగసౌష్ఠవంతో పాటు బ్రహ్మ వర్చస్సు, సత్సంతతి, కమ్మని కంఠం, పదిమందిలో మంచి పేరు ప్రతిష్టలు, చివరకు ఆత్మసాక్షాత్కారం లభిస్తాయి. ఒక్కొక్క ప్రయోజనానికి ఒక్కొక్క సామోపాసన విధించ బడింది. సర్వసాధకమయిన సర్వ విషయక సామం కూడా వీటిలో ఒకటి. సామమంటే సమత్వం, సాధుత్వం. సమత్వమే యోగం. అదే యాగం కూడా కాగలదు.

మూడవ అధ్యాయం మధువిద్యతో ఆరంభమవుతుంది. మనస్సు మధు మయమైతే, ప్రపంచమంతా మధుమయమే. దేవతల్లో సూర్యుడు మధువులాంటి వాడు. సూర్యకిరణాలు తేనెటీగల్లా ప్రపంచంలోని మధువుసంతా సేకరించి సూర్యమండలంలో చేరుస్తాయి. దేవతలు మధువును సేవించే విధానమే చాల విచిత్రమైనది. పశువులకు తిన్నది పుష్టి. మనుష్యులకు ఉన్నది పుష్టి. దేవతలకు కన్నది పుష్టి. వసువులు అగ్ని రూపంతో సంచరిస్తూ ప్రాతఃసూర్యుని కిరణాల లోని అమృతాన్ని చూచి ఆనందిస్తారు. అలాగే రుద్ర దేవతలు ఇంద్రరూపంలో మధ్యందినామృతాన్ని సేవిస్తారు. విశ్వదేవతలు వరుణ రూపంలో సాంధ్య రాగామృతాన్ని ఆస్వాదిస్తారు. మరుత్తులు చంద్రరూపంలో విభావరిలోని సుధా

సారాన్ని గ్రహిస్తారు. సాధ్యులు అసాధ్యులు, బ్రహ్మరూపంలో అంతటా వ్యాపించి ప్రతి కణాన్ని అమృత బిందువుగా భావిస్తారు. నిజానికి బ్రహ్మలోకంలో ఉదయం లేదు, అస్తమయం లేదు. అక్కడ రాత్రి అనేది లేదు. అంతా పగలే. అంతా వెలుగే.

ఈ బ్రహ్మలోకంలోని ఆలోకాన్ని చూచేందుకు గాయత్రి నేత్రం ప్రసాదిస్తుంది. గాయత్రికి నాలుగు పాదాలు, ఒక్కొక్క పాదంలో ఆరేసి పదాలు. మొత్తం 24 అక్షరాలతో బ్రహ్మలోకాన్ని నింపిన గాయత్రి గానం చేసిన వాళ్ళను కాపాడుతుంది. కాని గాయత్రి కేవలం కార్య బ్రహ్మవరకే పరిమితం. శుద్ధ బ్రహ్మ హృదయ కమలంలో ధ్యానయోగులకు గోచరిస్తుంది. హృదయంలో ఐదు రంధ్రాలున్నాయి. ఒక్కొక్క రంధ్రం నుంచి ఒక్కొక్క వాయువు ప్రవేశిస్తుంది. ప్రాణవాయువు తూర్పు నుంచి, వ్యానం దక్షిణం నుంచి, అపానం పడమర నుంచి, సమానం ఉత్తరం నుంచి, ఉదానం పైనుంచి ప్రవేశించి సంచరిస్తూ వుంటాయి. బాహ్య ప్రపంచంలో కనిపించే వెలుగు, వినిపించే శబ్దం ఈ హృదయాకాశంలో కూడా కనిపిస్తుంది, వినిపిస్తుంది. కళ్ళు మూసుకుంటే పరంజ్యోతి కనిపిస్తుంది. చెవులు మూసుకుంటే ప్రణవనాదం వినిపిస్తుంది. బాహ్య జగత్తులోని ప్రతి పదార్థం అంతర్జగత్తులో అతి సూక్ష్మంగా ప్రతిబింబించి వుంటుంది. విత్తనంలో చెట్టు ఒదిగివున్నట్టు అంతరాత్మలో పరబ్రహ్మ ప్రకాశిస్తూ వుంటాడు. బ్రహ్మ పదార్థం బియ్యపు గింజ కంటే, నువ్వు గింజకంటే కూడా చిన్నది. అదే విరాడ్రూపంలో భువికంటే కూడా పెద్దది.

బ్రహ్మ పదార్థం నుంచే ప్రపంచం ప్రభవించింది. అందులోనే లీనమై పోతుంది. దాని నాధారం చేసుకునే జీవకోటి జీవిస్తూ వుంది. ఈ విషయాన్ని 'తజ్జలాన్' అన్న సూత్రం వర్ణిస్తుంది. తత్ ( దాని నుండే ) జ ( జన్మించి ) ల ( లయించి ) అన్ (వృద్ధి పొందుతూవుంది) —అనే నాలుగు పాదాలతో కూర్చ బడిన యీ బ్రహ్మసూత్రం ఛాందోగ్యం బ్రహ్మజిజ్ఞాసువులకు ప్రసాదించిన అక్షరభిక్ష.

అసలు పురుషుడే ఒక యజ్ఞ స్వరూపుడు. మానవ జీవితమే ఒక మహా యజ్ఞం. మొదటి 24 సంవత్సరాలు ప్రాతఃసవనంలో గడుస్తాయి. ఆ తర్వాత 44 సంవత్సరాలు మధ్యాహ్నికం. చివరి 48 సంవత్సరాలు సాయంతనోపాసన. ఇలా జీవితమంతా ఆత్మయజ్ఞంగా గడపి మహిదాసనే మనిషి 116 సంవత్సరాలు

జీవించాడట. అప్పుడప్పుడు జబ్బుచేస్తే 'నేను వ్యాధివల్ల మరణించనని తెలిసి కూడా నన్ను మాటిమాటికిలా ఎందుకు వేధిస్తావు?' అని అతను విసుక్కునే వాడట.

ప్రపంచమంతా బ్రహ్మమయమని త్రికరణ శుద్ధిగా భావించిన బ్రహ్మ వేత్త అవసాన దశలో పరమాత్మను ఉద్దేశించి 'అక్షితమసి, అచ్యుతమసి, ప్రాణసంశితమసి' (నీకు క్షతిలేదు, చ్యుతిలేదు, నీవే నా ప్రాణాలకు పరమగతివి) అని స్తుతించి పార్థివ దేహాన్ని పరిత్యజిస్తాడట. మారేది, మరణించేది శరీరం. ఆత్మ మారదు, మరణించదు.

నాల్గవ అధ్యాయం సంవర్గవిద్యతో ఆరంభమవుతుంది. తాను చేసిన సత్కర్మలకు తాను ఫలితమనుభవించటం లోక సహజం. కాని ప్రజలు చేసిన పుణ్యకార్యాల ఫలం కూడా తనకే లభించేట్టు చేసేది సంవర్గం. ఈ విద్య రైక్వుడనే బండి (రిక్షా) లాగేవాడికి తెలుసట. రిక్షావాడికి ఈ విద్య తెలుసునని జానశ్రుతి మహారాజుకు తెలుస్తుంది ఆ విద్య నేర్చుకునేందుకు మహారాజు బండి వాడి దగ్గరికి వెళ్ళి బ్రతిమిలాడి భంగపడి అతను కోరిన ద్రవ్యం ఇచ్చి చివరకు విద్య సాధిస్తాడు. విద్యమీద ఆసక్తి వున్న వ్యక్తి ఎలాగయినా ఆ విద్యను అభ్యసించితీరుతాడని చెప్పేందుకు ఈ కథ తార్కాణం. అసలీ సంవర్గవిద్యలోని రహస్యం వాయువులో, ప్రాణంలో ఉంది. ఆధిదైవికంగా వాయువు, ఆధ్యాత్మికంగా ప్రాణం అన్ని వర్గాలకు సంగమస్థలాలవుతాయి. ఆకాశం, అగ్ని, నీరు, నేల–అన్నీ చివరకు వాయువులోనే లీనమవుతాయి. అలాగే ఇంద్రియాలు, వాక్కు, మనస్సు–అన్నీ ప్రాణంలో కలిసిపోతాయి. కాబట్టి ప్రాణాన్ని, వాయువును స్వాధీనం చేసుకుంటే సకలం మనకు స్వాధీనమవుతుంది. ఇదే సంవర్గ విద్య.

ఆ తర్వాత సత్యకాముడి కథ ఆరంభమవుతుంది. సత్యకాముడు సామాన్య కుటుంబంలో జన్మించిన జిజ్ఞాసువు. అతనికి బ్రహ్మవిద్య నేర్చుకోవాలని కుతూహలం వుంది. కాని అతని తల్లి జబాల పదిమందికి పరిచర్య చేసుకుని జీవించిన సామాన్య దాసి. ఈ దాస్యవృత్తిలో సత్యకాముడు ఎవరికి జన్మించాడో ఆమెకు తెలియదు. తల్లిదండ్రుల కులగోత్రాలు తెలిస్తేనే కాని ఆ రోజుల్లో గురుకులంలో ప్రవేశం దొరికేది కాదు. కాని సత్యకాముడు ధైర్యంచేసి

హారిద్రుమతుడనే గురువు దగ్గరికి వెళ్ళి ఉన్న విషయం ఉన్నట్టు చెప్పి తనను శిష్యుణ్ణి చేసుకోమంటాడు. గురువుగారు సత్యకాముని సత్యనిష్ఠకు సంతోషించి అతన్ని ఆశ్రమంలో చేర్చుకుంటాడు. అతనికి 400 ఆవుల నిచ్చి వీటిని వెయ్యి అయ్యేవరకు మేపుకొని రమ్మంటాడు. అలాగే సత్యకాముడు వెయ్యి ఆవులయ్యే వరకు వాటిని మేపుకుంటూ తిరుగుతాడు. ఇక గురువుగారి దగ్గరికి వెళ్ళవచ్చని తిరిగి వెళ్ళే దారిలో వృషభం, అగ్ని, హంస, జలపక్షి సత్యకామునికి బ్రహ్మ పదార్థాన్ని గురించి ఎవరికి తెలిసిన విషయం వాళ్ళు చెప్తాయి. నాలుగు దిక్కులే బ్రహ్మలోని చతుష్కళలని వృషభం చెప్తుంది. పృథ్వి, అంతరిక్షం, ద్యులోకం, సముద్రం చతుష్కళలని అగ్ని చెప్తుంది. అగ్ని, సూర్యుడు, చంద్రుడు, విద్యుత్తు బ్రహ్మకళలని హంస చెప్తుంది. ప్రాణం, కళ్ళు, చెవులు, మనస్సు చతురాననుని చతుష్కళలని పక్షి చెప్తుంది. ఇలా నలుగురు చెప్పిన నాలుగు నాలుగు కళలు మొత్తం పదహారు కళల్లో బ్రహ్మతత్త్వం సత్యకాముడికి పూర్తిగా బోధపడుతుంది. గురువుగారి దగ్గరికి వెళ్ళగానే సత్యకాముడి ముఖంలో బ్రహ్మ వర్చస్సును చూచి గురువుగారు చాలాసంతోషించి అన్నింటిని సమన్వయం చేసి బ్రహ్మోపదేశం చేస్తాడు.

ఆ తర్వాత సత్యకాముడి దగ్గర బ్రహ్మవిద్య నేర్చుకునేందుకు ఉపకోసలుడనే బ్రహ్మచారి వస్తాడు. పన్నెండు సంవత్సరాలు గురుకులవాసం చేసినా అతనికి ఏమీ చెప్పకుండా సత్యకాముడు సంచారానికి వెళ్ళిపోతాడు విచారంతో, వైరాగ్యంతో, నైరాశ్యంతో కుంగిపోతున్న ఉపకోసలుడికి అగ్నిత్రయం బ్రహ్మ పదార్థాన్ని గురించి చెప్తుంది. ఇంతలో సత్యకాముడు వచ్చి తన శిష్యుని ముఖంలో బ్రహ్మ వర్చస్సును గమనించి ఆనందిస్తాడు. ఆచార్యుడు దారి చూపించేవాడే కాని బ్రహ్మపదార్థం స్వయంకృషి (తపస్సు) వల్లనే తెలుసుకోవాలనే విషయం ఈ రెండు కథలవల్ల తెలుస్తుంది.

అయిదవ అధ్యాయం ప్రాణప్రశస్తితో ఆరంభమవుతుంది. ఒక పర్యాయం ఇంద్రియాలన్నీ మేము గొప్పంటే మేము గొప్పని పోటీ పడ్డాయట. కళ్ళు, చెవులు, వాక్కు, మనస్సు వాగ్వాదం చేసుకొని చివరికి ప్రజాపతి దగ్గరికి తీర్పు కోసం వెళ్ళాయట. 'ఎవరు లేకపోతే శరీరం నిలవదో వాళ్ళే గొప్ప'-అని ప్రజాపతి తీర్పు చెప్పారట. వాక్కులేకుంటే శరీరం మూగపోయిందేకాని ప్రాణం పోలేదు. కళ్ళులేకుంటే మనిషి గుడ్డివాడయ్యాడే కాని ప్రాణంపోలేదు. చెవులులేకుంటే మనిషి

చెవిటివాడయ్యాడే కాని ప్రాణం పోలేదు. మనస్సు చెడిపోతే మనిషి పిచ్చివాడుగానో పసివాడుగానో ప్రవర్తించాడు గాని ప్రాణం పోలేదు. కాని శరీరంలో నుంచి ప్రాణం లేచేసరికి వాక్కు నిశ్శబ్దమయింది, కళ్ళకు కనిపించలేదు, చెవులకు వినిపించలేదు, మనస్సుకు మనస్సులో మనస్సు లేదు, అందరూ ప్రాణం కాళ్ళు పట్టుకొని ఎక్కడికి వెళ్ళద్దని బతిమాలుకున్నారు. అందరూ ప్రాణాన్ని స్తుతించారు. నీవే మాకు ఆధారమని అంగీకరించారు. ప్రాణం తాను తీసుకున్న ఆహారాన్ని అన్ని అవయవాలకు పంచిపెడుతుందే కాని తానేమీ తినదు. మనం తినే అన్నమే ప్రాణానికి ఆహారం, మనం త్రాగే నీరే ప్రాణానికి వస్త్రం. అందువల్లనే అన్నం తినేముందు ఆపోశనం (కొద్దిగా నీళ్ళు త్రాగటం) పట్టటం పరిపాటి. ప్రాణానికి ఇది ఆచ్ఛాదన.

ఓం ప్రాణాయ స్వాహా, ఓం వ్యానాయ స్వాహా, ఓం అపానాయ స్వాహా, ఓం సమానాయ స్వాహా, ఓం ఉదానాయ స్వాహా అని అయిదుసార్లు అన్నం మెతుకులు నోట్లో వేసుకుంటాం. ఇందులో ఒక అంతరార్థం ఉంది. ప్రాణాయ స్వాహా అని మనం లోపలికి పుచ్చుకున్న అన్నం ప్రాణవాయువుకే కాక కళ్ళకూ, రవికీ, దివికీ చెందుతాయి. అలాగే వ్యాన వాయువు నుద్దేశించి గ్రహించిన అన్నం చెవులకూ, దిక్కులకూ, చంద్రుడికీ చేరుతుంది. అపానం ద్వారా వాక్కుకూ, అగ్నికీ, పృథ్వికీ ఆహుతి అందుతుంది. సమానం ద్వారా మనస్సుకూ, మేఘానికీ, విద్యుత్తుకూ అందుతుంది. ఉదానం ద్వారా చర్మానికీ, వాయువుకూ, ఆకాశానికీ ఆహారం లభిస్తుంది. ఇలా మనం తీసుకుంటున్న ఆహారం బ్రహ్మాండంలోని ప్రాణికోటికి సంకల్ప మాత్రం చేత చేరిపోతుంది. సంకల్పమే దేవతలకు ఆహారం. ఏమీ తెలియక తీసుకున్న ఆహారం కండ పుష్టిని మాత్రం ఇస్తుంది. యజ్ఞ భావంతో తీసుకున్న ఆహారం శరీరానికే కాక మనస్సుకూ, ఆత్మకూ, పరమాత్మకూ కూడా నైవేద్యం అవుతుంది.

అశ్వపతి అనే రాజుకు వైశ్వానర వహ్నిని గురించి సమగ్రంగా తెలుసునట. ఆ విషయం తెలుసుకొని ఔపమన్యవుడు, సత్యయజ్ఞుడు, ఇంద్రద్యుమ్నుడు, జనుడు, బుడిలుడు, ఉద్దాలకుడు–అనే అయిదుగురు బ్రాహ్మణులు ఆయన దగ్గరికి వెళ్ళి 'మాకు వైశ్వానర విద్య చెప్పవలసింద'ని ప్రార్థిస్తారు. 'ముందు మీకు తెలిసింది చెప్తే తర్వాత మీకు తెలియని విషయం చెప్తా'నంటాడు అశ్వపతి. అప్పుడు అయిదుగురూ తమ తమ ఉపాసనాపద్ధతిని గురించి చెప్తారు.

వైశ్వానర విద్యలో ఒక్కొక్కరు ఒక్కొక్క భాగాన్ని అభ్యసించారు. సమగ్రంగా ఎవ్వరికీ తెలియదు. ఈ విషయం గమనించి అశ్వపతి మహారాజు అయిదుగురు బ్రాహ్మణులకూ వైశ్వానర విద్యను సమగ్రంగా ఉపదేశిస్తాడు. ఈ కథవల్ల ఆ రోజుల్లో బ్రాహ్మణులకు కూడా తెలియని విషయాలు క్షత్రియులకు తెలిసేవనీ, కుల విచక్షణ లేకుండా బ్రాహ్మణులు ఎవరిదగ్గరనైనా విద్య నభ్యసించే వాళ్ళనీ తెలుస్తుంది.

ఆరుణి కుమారుడైన శ్వేత కేతువు తాను బ్రహ్మవేత్తనని గర్వపడుతూ వుండేవాడు. ఒకరోజు పంచాలదేశంలో జరిగే బ్రహ్మ సదస్సుకు వెళ్తాడు. అక్కడ ప్రవాహణుడు శ్వేతకేతువును జీవి పరలోక గమనాన్ని గురించి ప్రశ్నిస్తాడు. శ్వేతకేతువు తెల్లమొహం వేస్తాడు. ఇంటికి వెళ్ళి తన తండ్రికి ఈ విషయం చెప్పగానే ఆయన తన కుమారునితో కలిసి ప్రవాహణుని దగ్గరికి వెళ్ళి తానడిగిన ప్రశ్నకు తానే సమాధానం చెప్పమంటాడు. అప్పుడు ప్రవాహణుడు చెప్తాడు : ప్రపంచంలో ప్రతి జీవీ అగ్నిలోపుట్టి అగ్నిలో కలిసి పోతాడు. మాతృ గర్భం మొదటి అగ్ని కుండం. శ్మశానంలోని చితి చివరి అగ్ని. శ్రద్ధా భక్తి సంపన్నులు తపశ్శక్తితో దేవయానంలో బ్రహ్మ లోకానికి వెళ్తారు, సామాన్యులు ధూమయానంలో పితృలోకానికి వెళ్తారు. జీవన్ముక్తులు పంచతత్త్వాలలో లీనమయి బ్రహ్మ నిర్వాణం పొందుతారు. పతితులు జనన మరణ చక్రంలో తిరుగుతూ వుంటారు. అగ్నిని ఆరాధించిన వాళ్ళను అగ్ని పుణ్య లోకాలకు తీసుకొని వెళ్తుంది. పుణ్య లోకాలకూ, పితృ లోకానికీ వెళ్ళిన వాళ్ళు తిరిగి అదే మార్గంలో మర్త్య లోకాన్ని చేరుకుంటారు.

ఆరుణి తన కుమారుడయిన శ్వేతకేతువుకు ప్రపంచానికి మూలమైన బ్రహ్మ పదార్థాన్ని గురించి చెప్తాడు. ఏది తెలుసుకుంటే అన్నీ తెలిసిపోతాయో, దాన్ని తెలుసుకోవాలి. అదే సత్పదార్థం. అది ఎప్పుడూ వుంటుంది. సనాతనమయిన పరమ సత్యమదే. దాని నుండే ప్రపంచం ఉదయించింది. సృష్టిలో ప్రతి వస్తువూ మారుతుంది. కాని సత్ పదార్థం మారదు. అదే ఇన్ని రూపాలుగా కనిపిస్తుంది. తత్త్వమొకటే. రూపం వేరు. అగ్నిలో నలుపు, తెలుపు, ఎరుపు—మూడు రంగులు కనిపిస్తాయి. నలుపు అన్నం వల్ల ఏర్పడుతుంది. తెలుపు నీటిని తెలియపరుస్తుంది. ఎరుపు కాంతిని వెలయిస్తుంది. అంతా కలిసి అగ్ని అవు

తుంది అలాగే మనం తీసుకుంటున్న అన్నంలో స్థూలభాగం మలంగా మారుతుంది, సూక్ష్మభాగం మనస్సుగా రూపొందుతుంది. మిగిలిన భాగం మాంసమవుతుంది. అదే విధంగా మనం త్రాగే నీటిలో స్థూలభాగం మూత్రంగా, సూక్ష్మభాగం ప్రాణంగా, మిగిలిన భాగం రక్తంగా మారుతుంది. నెయ్యిలాంటి పదార్థాలు ఎముకలుగా, వాక్కుగా, మజ్జగా మారుతాయి. అన్నం మనస్సుగా మారుతుంది. నీరు ప్రాణమవుతుంది. తేజస్సు వాక్కవుతుంది. కనకనే మనస్సు అన్నమయం. ప్రాణం జలమయం, వాక్కు తేజోమయం. పురుషుడు షోడశ కళాప్రపూర్ణుడు. ఒక పక్షం రోజులు ఆహారం మానేస్తే పదిహేను కళలు క్షీణించి ఒక్క కళ మాత్రం మిగిలిపోతుంది. మళ్ళీ ఆహారం తీసుకోవటం ఆరంభిస్తే కళలు క్రమంగా పెరుగుతాయి. కాబట్టి మానవుడు ముఖ్యంగా అన్నజీవి. కాని అన్నమయ శరీరంలోనే ఆత్మ కూడా వుంది. శరీరం నశిస్తుంది. ఆత్మ నశించదు. అదే సత్యం. అదే ఆత్మ తత్త్వం. అదే నీవు. "తత్త్వమసి".

ఈ మహావాక్యంలోని పరమ సత్యాన్ని వివరించేందుకు ఆరుణి చాలా ఉదాహరణలు, దృష్టాంతాలు నిదర్శనలు చూపిస్తాడు. ఒకే జీవి జాగ్రదవస్థలో ఒక రకమైన అనుభూతి పొందుతాడు, స్వప్నావస్థలో తన రూపాన్ని, తన భావాన్ని, తన కష్ట సుఖాలను తాను కల్పించుకుంటాడు. గాఢనిద్రలో తన్ను తాను పూర్తిగా మరిచిపోయి హాయిగా విశ్వ చైతన్యంలో విలీనమైపోతాడు. ఈ మూడు దశలనూ అనుభవిస్తున్న జీవి ఒకడే అలాగే జీవులందరికీ మూలం ఒకటే. అదే సత్యం అదే ఆత్మ, అదే నీవు 'తత్త్వమసి'.

నదీ జలాలు సముద్రంలో కలుస్తాయి. సముద్ర జలం ఆవిరిగా మారి మేఘమవుతుంది. వర్షం కురిసిన తర్వాత మళ్ళీ అదే నీరు నదీరూపాన్ని ధరిస్తుంది. ఏ నీరు ఎక్కడిది అనే భావం నీటికి ఉండదు. నీరంతా ఒకటే అదే సత్యం. అదే ఆత్మ. అదే నీవు 'తత్త్వమసి'.

చిన్న విత్తనం పెద్ద చెట్టవుతుంది. ఆకులు, కొమ్మలు, పూలు, కాయలు, పండ్లు ఇవన్నీ చిన్న విత్తనం నుంచే వచ్చాయి. ఆ విత్తనంలోని అణువే పరమ సత్యం. అదే ఆత్మ. అదే నీవు. 'తత్త్వమసి'.

ఉప్పు నీటిలో కరిగిపోతుంది. నీరంతా ఉప్పగా వుంటుంది. కాని ఉప్పు ఎక్కడా కనిపించదు. అలాగే ప్రతి జీవిలో పరమాత్మ తత్త్వం వుంది. కంటికి కనిపించకపోవచ్చు. అదే సత్యం అదే ఆత్మ. అదే నీవు. 'తత్త్వమసి'.

ఆ పరమ సత్యాన్ని విస్మరించి దారి తెలియక తిరుగుతున్న యాత్రికులు జీవులు. తెలియనివాడు తెలిసినవాడి వల్ల తెలుసుకొని గమ్యస్థానం చేరటం శ్రేయస్కరం. శరీరం విడిపోయిన తర్వాత అనంత విశ్వంలో కలిసిపోవటమే కాని తెలుసుకునేందుకు మళ్ళీ త్వరగా అవకాశం దొరకదు. మృత్యువు కనిపించే లోపల మృత్యువంటే యేమిటో తెలుసుకోవటం మంచిది. ఆత్మతత్త్వం తెలిస్తే మృత్యువు బాధించదు. అమరత్వం, అభయత్వం ఆత్మ లక్షణం. అదే సత్యం. అదే ఆత్మ. అదే నీవు. 'తత్త్వమసి'.

నారదుడు సర్వశాస్త్ర విశారదుడు. అతనికి తెలియని విషయం లేదు. కాని మాటిమాటికి అతనికి అశాంతి ఏర్పడుతుంది. శాంతికోసం ఆయన సనత్కుమారుడి దగ్గరికి వెళ్ళి శాంతి లభించే మార్గం చెప్పవలసిందని కోరుతాడు. తనకు తెలిసిన విద్యలన్నీ ఏకరువు పెడతాడు. అంతా విని 'ఇదంతా నామం తప్ప మరేమీ లేద'ని పెదిమలు విరుస్తాడు సనత్కుమారుడు. మరి నామం కంటె గొప్పదేమిటని నారద డడుగుతాడు. అప్పుడు సనత్కుమారుడు అన్నింటిని మించిన ఆత్మతత్త్వాన్ని గురించి చెప్తాడు. ఇదే ఏడవ అధ్యాయంలోని తత్త్వం.

నామం కంటె వాక్కు గొప్పది. వాక్కుకంటె మనస్సు గొప్పది. మనస్సు కంటె సంకల్పం గొప్పది. సంకల్పంకంటె చిత్తం గొప్పది. అంత కంటె ధ్యానం గొప్పది. ధ్యానం కంటె (వి) జ్ఞానం గొప్పది. అంతకంటె బలం, అంతకంటె అన్నం, నీరు, తేజస్సు, ఆకాశం, స్మృతి, ఆశ, అన్నిటి కంటె ప్రాణం గొప్పది. ప్రాణమే తల్లి, ప్రాణమే తండ్రి, ప్రాణమే తోబుట్టువు, ప్రాణమే గురువు, కాబట్టి ప్రాణంలోని పరమ రహస్యం తెలుసుకోవాలి. సత్యం తెలుసుకోవాలి, విజ్ఞానం గమనించాలి. మనన చెయ్యాలి. శ్రద్ధ అలవరచుకోవాలి. నిష్ఠతో ప్రవర్తించాలి. జీవితంలో చెప్పుకోదగిన పనిచేసి తీరాలి. తనకూ ఇతరులకూ సుఖం కలిగే పని చెయ్యాలి. ఈ పని సాధించిన తర్వాత మరొకటి సాధించవలసిన అవసరం లేదు- అనిపించేంత మంచిపని చెయ్యాలి. మరొకటి కనిపించని, వినిపించని, అనిపించని మనఃస్థితి ఏర్పడాలి. అదే అమరత్వం అదే అభయత్వం. అదే ఆత్మతత్త్వం.

ఆత్మను అందుకొన్న ఆత్మయోగి తనలో తాను తన్మయుడై పోతాడు, తనతో తాను ఆడుకుంటాడు, తనలో తాను పాడుకుంటాడు, తన్నుజూచి తాను మురిసిపోతాడు, తనకు తాను ప్రభువైపోతాడు.

చివరి అధ్యాయం హృదయాకాశంలోని పుండరీక సౌందర్యాన్ని వర్ణి స్తుంది. ఈ శరీరం బ్రహ్మపురి. ఇందులో హృదయ కమలం విచ్చుకొని కళ కళలాడుతూ వుంటుంది. అందులో కొంత భాగం ఆకాశం లాగా నిర్మలంగా వుంటుంది. ఆ పరమాకాశం ఏదో పరమార్థం చెప్పాలని ఉవ్విళ్ళూరుతూ వుంటుంది. కాని దాని అంతర్యం తెలుసుకొనే సంస్కారం ఈ శరీరానికి లేదు. శరీరం ఉంటేనే కాని ఆ కమలం అందదు. బయట కనిపించేదంతా లోపల కూడా వుంది. బయట కనిపించనిది కూడా వుంది. కాని యీ పాడు కళ్ళు బయటి వస్తువులను చూచి మురిసి పోతాయే కాని లోపలివైపు వాటి చూపు మళ్ళదు. రెంటినీ చూడగల శక్తి యీ కళ్ళకే వుంది. లోపలి ప్రపంచం కనిపిస్తే యిక బయటి ప్రపంచం మీది భ్రాంతి పోతుంది. మనోరాజ్యంలోకి ప్రవేశించి హృద యేశ్వరిని చూచిన తర్వాత ఈ కళ్ళు బయటి వస్తువులను చూచినా చూడనట్టే. కళ్ళకు ఆత్మ కనిపించగానే ఆత్మ సేతువు మీద కళ్ళు పయనించడం ఆరంభి స్తాయి. ఇహానికీ పరానికీ వారధి ఆత్మ. ఆత్మ సేతువు మీద అడుగు పెట్టగానే హృదయంలోని 101 నాళ్ళల్లో పైకి ప్రసరించిన బ్రహ్మనాడి జీవికి చేయూత నిస్తుంది. బ్రహ్మనాడి సాయంతో జీవాత్మ పరమాత్మలో కలిసిపోతాడు. అదే జీవిత పరమారధి.

ఈ పరమావధిని తెలుసుకోవాలని దేవతలకూ రాక్షసులకూ ఒకేసారి బుద్ధి పుట్టింది. దేవతలకు అధిపతియైన ఇంద్రుడు, రాక్షసులకు రాజయిన విరోచనుడు కలిసి ప్రజాపతి దగ్గరికి వెళ్ళారు. ఇద్దరూ 32 సంవత్సరాలు ప్రజాపతి భవనంలో బ్రహ్మచర్యం పాటిస్తూ వున్నారు. అప్పుడు ప్రజా పతి వాళ్ళను చూచి "మీరిక్కడ ఎందుకు ఉన్నారు?" అని అడి గాడు. ఇద్దరూ తమ కోరిక చెప్పారు. "కళ్ళల్లో, నీళ్ళల్లో కనిపించే మన బింబమే ఆత్మ" అని ప్రజాపతి చెప్పాడు. ఇద్దరూ మంచి మంచి గుడ్డలు వేసుకొని ఆభరణాలు పెట్టుకొని జలాశయంలో తమ ప్రతిబింబాన్ని చూచుకుంటారు. ఇదే ఆత్మతత్త్వమని తృప్తిపడి యిద్దరూ వెళ్ళిపోతారు. విరోచనుడు తన రాజ్యానికి వెళ్ళి అందరికీ ఆత్మతత్త్వం బోధిస్తాడు. శరీరమే

ఆత్మ అని ఆ.దరూ అపోహపడతారు. కాని ఇంద్రుడు తృప్తి పడడు. దారిలోనే ఆయనకు అనుమానం వేస్తుంది. మళ్ళీ ప్రజాపతి దగ్గరికి వెళ్తాడు. ''కళ్ళల్లో, నీళ్ళల్లో కనిపించే ప్రతిబింబం శరీరం నశిస్తే నశిస్తుంది కదా! మరి ఆత్మ అది యెలా అవుతుంద''ని ఇంద్రుడు తన సందేహాన్ని చెప్తాడు. ''నిజమే''నని ప్రజాపతి మరి 32 సంవత్సరాలు తన దగ్గర ఉండే ఆత్మతత్త్వం చెప్తానంటాడు. ఇంద్రుడలాగే వుంటాడు. ఆ తర్వాత ''స్వప్నంలో కనిపించే పురుషుడే ఆత్మ'' అని ప్రజాపతి చెప్తాడు. కాని కలలు కనే పురుషుడు సుఖదుఃఖాలకు లోనయి వుంటాడు. కాబట్టి ఆ పురుషుడు ఆత్మ ఎలా అవుతాడని మళ్ళీ ఇంద్రుడు సందేహం తెలియపరుస్తాడు. అయితే మరి 32 సంవత్సరాలు ఉండే ఆత్మ తత్త్వం చెప్తానంటాడు ప్రజాపతి. ఇంద్రుడు అలాగే వుంటాడు. ఈసారి ప్రజాపతి ''సుషుప్తి (గాఢ నిద్ర) లో ఆనందాన్ని అనుభవిస్తున్న పురుషుడే ఆత్మ'' అంటాడు. కాని గాఢ నిద్రలో వున్న వ్యక్తికి తానెవరో తెలియదు కదా! మరి అజ్ఞానం ఆత్మ ఎలా అవుతుందని ఇంద్రుడు సందేహిస్తాడు. అయితే మరి 5 సంవత్సరాలు దాటితే సమగ్రమైన ఆత్మతత్త్వం చెప్తానంటాడు ప్రజాపతి. అలాగే ఇంద్రుడు మొత్తం 101 సంవత్సరాలు బ్రహ్మచర్య దీక్షతో గురుకులవాసం చేస్తాడు. చివరకు ప్రజాపతి నిజమైన ఆత్మతత్త్వం బోధిస్తాడు.

మర్త్య శరీరం ఆత్మకు ఆలంబనం. శరీరంతో పనిలేని పర్జన్యం, వాయువు, మెరుపు స్వేచ్ఛగా సంచరిస్తాయి. ప్రాణం శరీరానికి కట్టుబడి వుండడం వల్ల ఆత్మతత్త్వాన్ని అందుకోలేకపోతుంది. శరీరంలోని అశరీర తత్త్వమే ఆత్మ. కళ్ళు చూస్తాయి. కాని ఆత్మ చూడాలనుకుంటుంది. చెవులు వింటాయి. కాని చెవులకు వినే శక్తినిచ్చేది ఆత్మ. వాక్కుకు మాట్లాడే శక్తినిచ్చేది ఆత్మ. ప్రాణానికి శరీరాన్ని అనుప్రాణితం చేసే శక్తి నిచ్చేది ఆత్మ. శరీరానికి భిన్నమయి కూడా శరీరాన్ని నిలబెట్టేది ఆత్మ. అదే సత్యం. అదే ఆత్మ. అదే బ్రహ్మ అదే తత్త్వం. అదే నీవు. తత్త్వమసి.

తత్ - త్వం - అసి



# అమృతం - బృహత్

'అమృతమిదం బ్రహ్మేదం సర్వం'

బృహదారణ్యకం (2-5-14)

ఎరుపు, నలుపు, తెలుపు-వెలుగుకు మూడు వన్నెలు. నల్లని రాత్రిని ఎఱ్ఱని ఉషస్సు తెల్లని పగలుగా మార్చి వేస్తుంది. అలాగే పట్ట పగలే బట్ట బయలుగా సంజ కెంజాయలు పగటిని మురిపించి రాత్రిగా మార్చివేస్తాయి. ఇలా నలుపును తెలుపుగా, తెలుపును నలుపుగా మార్చివేసే మాయలాడి ఎరుపు చూచేందుకు ఎంతో అమాయికంగా కనిపిస్తుంది. నిజంగా చూస్తే తెలుపుకు, నలుపుకు భేదం లేదు. ఈ భేదాన్ని కల్పించింది ఎరుపే. ఈ భేదమే లేకుంటే అంతా ఒకటే వెలుగు. దానికి తరుగు లేదు, పెరుగు లేదు, తిరుగు లేదు. అదే అమృతం. అదే బృహత్ తత్తం, మహత్ తత్త్వం. 'బృహదారణ్యకం' ఈ తేజస్సును గురించే చెప్తుంది.

బృహదారణ్యకం యజుర్వేదంలోని వాజసనేయ బ్రాహ్మణానికి చెందింది. పరిమాణంలోనే కాక పరిశీలనలో కూడా అన్ని ఉపనిషత్తులకంటె పెద్దది. అందువల్లనే దీనిని 'బృహదారణ్యకం' అన్నారని శంకర భగవత్పాదులు అన్నారు. అరణ్యవాసులు మనసు పెట్టి మననం చేసి ఆవిష్కరించుకొన్న ఆత్మ తత్త్వం ఇందులో వుంది కాబట్టి ఇది 'ఆరణ్యక' మయింది. అరణి నుంచి ఆవిర్భవించిన అగ్నిని కూడా ఆరణ్యకమనవచ్చు. మామూలుగా మనకు కనిపించే అగ్ని వేరు. ఇందులోని చిదగ్ని వేరు. చిదగ్ని కుండ సంభూతమయిన చిన్మయ చైతన్యాన్ని 'బృహదారణ్యకం' స్పృహణీయమైన వాగ్విలాసంతో వెలయిస్తుంది. బృహత్తుకు వాక్కనే అర్థం కూడా వుంది. బృహస్పతిని వాక్పతిగా భావించటం ఈ అర్థంలోనే.

వాక్కు, మనస్సు, ప్రాణం—ఈ మూడింటి బృహదాకారమే ఆత్మ. అదే బ్రహ్మపదార్థం కూడాను. స్వర్ణరేతస్కుడయిన సూర్యుని శుద్ధకాంతి నలుపుగా, తెలుపుగా, ఎరుపుగా కనిపించినట్టుగా అజరామరమయిన ఆత్మతత్త్వం

వాక్కు, మనస్సు, ప్రాణంగా భాసిస్తుంది. వాక్కు తేజోమయం, మనస్సు అన్నమయం, ప్రాణం రసమయం. తేజోమయమైన వాక్కే అన్నమయమైన మనస్సును రసవంతమైన ప్రాణతత్త్వంగా మార్చివేస్తుంది. ఈ తేజస్సే ఉషః కాంతి. అరుణోదయంతో రాత్రి పగలుగా మారిపోతుంది. ఉషస్సు తన అరుణారుణ కాంతికిరణాలతో ప్రపంచాన్నే కాదు, బ్రహ్మాండాన్నే ఉత్తూతలూగిస్తుంది. కాని దీని మాయకు లొంగినవాడు పగలే వెన్నెల చూస్తాడు. లొంగక లొంగదీసుకొని మెలకువగా మెలిగేవాడు రాత్రిని కూడా పగలు చేస్తాడు. ఈ రహస్యాన్ని బృహదారణ్యకంలోని మొట్టమొదటి అధ్యాయంలోని మొదటి బ్రాహ్మణం వివరిస్తుంది. ఇందులో మొత్తం ఆరు అధ్యాయాలు, 47 బ్రాహ్మణాలు, 315 మంత్రాలు ఉన్నాయి.

మొట్టమొదటి మంత్రం ఉషశ్శబ్దంతో ఆరంభమవుతుంది. ఉషఃకాలాన్ని బ్రాహ్మముహూర్తమని, అమృతవేళ అని అంటారు. అశ్వమేధానికి ఉపయోగించే గుఱ్ఱపు తలగా ఉషస్సును వర్ణించటంతో పూర్తి అశ్వమేధ వర్ణన వర్ణపరంగా, కాలపరంగా సాగుతుంది. ఈ గుఱ్ఱానికి ఉషస్సు తల, సూర్యుడు కళ్ళు, వాయువు ప్రాణం, అగ్ని నోరు, సంవత్సరం ఆత్మ, దివి వీపు, అంతరిక్షం ఉదరం, భువి పాదస్థానం, దిక్కులు ప్రక్కలు, అవాంతర దిక్కులు ప్రక్క ఎముకలు, ఋతువులు అవయవాలు, నెలలు-పక్షాలు సంధులు, పగలు-రాత్రి పాదాలు, నక్షత్రాలు ఎముకలు, ఆకాశంలో సంచరించే మేఘాలు మాంస ఖండాలు, ఇసుకతిన్నెలు అరగని ఆహారం, నదులు నాడులు, కొండలు గుండెలో-కాలేయంలో పేరుకొన్న మాంసఖండాలు, వనసంపద కేశరాశి, ఉదయ భాస్కరుడు నాభి పైభాగం, సాయంతన కాంతి నడుము క్రింది భాగం. ఆ గుఱ్ఱం ఆవులిస్తే మెరుపు మెరిసినట్టు ఉంటుంది. శరీరం కదిలిస్తే మేఘం గర్జించినట్టు సకిలించిన ధ్వని వినిపిస్తుంది. మూత్ర విసర్జన చేస్తే వర్షం కురుస్తుంది. దాని వాక్కే వాక్కు. ఇది ఎలాంటి గుఱ్ఱమో, దీనికీ మనకూ సంబంధమేమిటో సులభంగా ఊహించుకోవచ్చు. అశ్వంలాగా వేగంగా విసుగు లేకుండా పరిగెత్తే కాలాన్ని జయించటమే అశ్వమేధం.

ఈ గుఱ్ఱం వెనక రాత్రి, ముందు పగలు ఉంటాయట. రేయింబవళ్ళు సముద్రం నుంచి వెలువడుతాయట. దీనిని హయరూపంలో దేవతలు, వాజి

రూపంలో గంధర్వులు, అర్వాకారంలో అసురులు, అశ్వరూపంలో మనుష్యులు వాహనంగా వాడుకుంటారట. వేరు వేరు లోకాలకు వేరు వేరు కాలమానాలు. ఒకే లోకంలో వేరు వేరు మనస్థితులను బట్టి కాలచక్రం వేరు వేరు వేగాలతో వెళ్ళుతున్నట్టు అనిపిస్తుంది. ఆనంద సమయంలో మాసం రోజుగా గడిచి పోతుంది. విషాద సమయంలో క్షణం యుగంగా తోస్తుంది. కాలాన్ని కబళించ గలిగితే కాలకూటాన్ని మింగినట్టే. అమృత వేళను అర్థం చేసుకుంటే అమర త్వాన్ని సాధించినట్టే. ఇదే అశ్వమేధంలోని రహస్యం.

ఏదయినా మంచి పని చెయ్యబోతే అన్నీ ఆటంకాలు రావటం లోక సామాన్యమైన అనుభవం. ఇదే దేవాసుర సంగ్రామం. కాని రాక్షసులు వాక్కు లాంటి బాహ్యేంద్రియాలనూ, మనస్సునూ చెడగొట్టగలరే కాని ప్రాణం దాకా వాళ్ళు ప్రవేశించలేరు. కాబట్టి ప్రాణశక్తిని స్వాధీనం చేసుకుంటే చిల్లరబాధలు అంతగా చిరాకు పెట్టవు. దీనినే చక్కని కథగా మొదటి అధ్యాయంలోని మూడో బ్రాహ్మణం వివరిస్తుంది. ప్రాణాన్ని కూడా కలుషితం చెయ్యాలని ప్రయత్నించిన రాక్షసులు కొండశిలకు తగిలిన మట్టి పెళ్ళలా ఫెళ్ళున విరిగి ముక్కలు ముక్కలయ్యారట. ప్రాణమే సూర్యకాంతి. మనస్సే ఇంద్రధనుస్సు, వాక్కే అగ్నిజ్వాల. మంచి మాటలతో చెడు (అసత్తు) ను మంచి (సత్తు) గా మార్చవచ్చు. మంచి ఆలోచనలతో చీకటి (తమస్సు) ను వెలుగు (జ్యోతి)గా మార్చవచ్చు. మంచి ఆశయాలతో, ఆదర్శాలతో, ఆధ్యాత్మిక సాధనతో మృత్యువును జయించి అమరత్వాన్ని సాధించవచ్చు. దీనినే 'అసతో మా సద్గమయ, తమసో మా జ్యోతిర్గమయ, మృత్యోర్మామృతంగమయ' అన్న స్తోత్ర త్రయం చెప్తుంది. ఈ మూడు మంత్ర వాక్యాలు ఈ బ్రాహ్మణం లోనివే

ఈ అధ్యాయంలోని మిగిలిన మూడు బ్రాహ్మణాలు కూడా వాక్కు, మనస్సు, ప్రాణం- ఈ మూడింటిని గురించి మరికొంత విపులంగా వ్యాఖ్యానించి చెప్తాయి. వాక్కు దివ్యదత్తం. మనస్సు పిత్రార్జితం. ప్రాణం మానవ సహజం. వాక్కులోని తేజస్సు, మనస్సులోని ఓజస్సు ప్రాణానికి ప్రాణం పోస్తాయి. వాక్కు ఎఱ్ఱగా వుంటుంది, మనస్సు నల్లగా వుంటుంది, ప్రాణం తెల్లగా వుంటుంది. ఈ మూడు రంగులు బయటి ఆకాశంలోనే కాదు, హృదయాకాశంలో కూడా వుంటాయి. ఇవే కంటిలో కూడా కనిపిస్తాయి. మధ్య నలుపు, ట్టుచు

పక్కలా తెలుపు, కొనల్లో ఎరుపు- ఈ మూడు తత్త్వాలనే తెలియపరుస్తాయి. ఎరుపును ఎరుక పరచుకుంటే నలుపు తెలుపులు ఏకమవుతాయి. మాయావరోధం తొలిగితే జీవాత్మ పరమాత్మలో లీనమైపోతుంది. కంటిలో మింటిలో కనిపించే యీ మూడు వన్నెల రహస్యాన్ని తెలుసుకుంటే మూడు లోకాలను జయించినట్టే.

## 2

రెండవ అధ్యాయం అజాత శత్రువు కథతో ఆరంభిస్తుంది. అజాత శత్రువు గొప్పజ్ఞాని, దాని, నిదాని. కాశిని పాలించే ప్రభువు. ఒకరోజు గర్గ వంశానికి చెందిన బాలాకి రాజు దగ్గరికి వచ్చి తాను బ్రహ్మతత్త్వాన్ని గురించి చెప్తానంటాడు. వెంటనే మహారాజు అతనికి వెయ్యి ఆవులు దానం ఇస్తానని వాగ్దానం చేస్తాడు. బాలాకి బ్రహ్మను గురించి వ్యాఖ్యానం ఆరంభిస్తాడు. సూర్య చంద్రుల్లో, విద్యు దాకాశాల్లో, వాయువులో, అగ్నిలో, జలంలో, అద్దంలో, దిక్కుల్లో, నీడలో, ఆత్మలో బ్రహ్మ పదార్థం వ్యాపించి వున్నదని బాలాకి చెప్తాడు. అజాత శత్రువు సవినయంగా ఇవన్నీ సమగ్రమైన సమాధానాలు కావని మనవి చేసుకుంటాడు. 'మరి బ్రహ్మపదార్థం ఏమిటో మీరే చెప్పండ'ని గార్గ్యుడు (బాలాకి) అజాత శత్రువును ప్రార్థిస్తాడు. అజాత శత్రువు లోపల నిద్రపోతున్న మనిషి దగ్గరికి బాలాకిని తీసుకొని వెళ్ళి ఆ వ్యక్తిని పేరుపెట్టి పిలిచి నిద్ర లేపేందుకు ప్రయత్నిస్తాడు. కాని అతనికి రాజు పెట్టిన కేకలు వినిపించవు. నామరూపాలకు అతడు చలించడు. తట్టి లేపేసరికి అతడు లేస్తాడు. ఈ దృష్టాంతాన్ని పురస్కరించుకొని అజాత శత్రువు బ్రహ్మపదార్థాన్ని వివరిస్తాడు. మెలకువతో లోక వ్యవహారం చూచుకుంటున్న మనిషిలోనే విజ్ఞానాత్మ ఉంది. ఆదే కలలు కనేప్పుడు, గాఢ నిద్రలోకూడా నిజరూపంలో ప్రకాశిస్తూ ఉంటుంది. స్థూల శరీరంలో సూక్ష్మరూపంలోవున్న అశరీర తత్త్వమే ఆత్మ. అదే బ్రహ్మ. దానికి భయం లేదు, చావు లేదు, వ్యాధి లేదు, బాధ లేదు.

రెండవ బ్రాహ్మణం శిరోభాగంలో వున్న ఏడు రంధ్రాలను-కళ్ళు, చెవులు, ముక్కురంధ్రాలు, నోరు-సప్తర్షులని చెప్తుంది. ఎనిమిదవది వాక్కు. ఈ రంధ్రాలన్నీ అధోముఖంగా వున్నాయి. అసలు తత్త్వం పైనవుంది. అదే బ్రహ్మనిలయం.

ఈ అధ్యాయంలోనే యాజ్ఞవల్క్యుని కథ కూడా ఆరంభమవుతుంది. బృహదారణ్యకంలో యాజ్ఞవల్క్యుడు చాల ప్రధాన పాత్రను వహిస్తాడు. ఆత్మతత్త్వం ఆయన నోటనే ఎక్కువగా వింటాము. ఆయనకు ఇద్దరు భార్యలు- మైత్రేయి, కాత్యాయని. మైత్రేయికి ఆధ్యాత్మిక చింతన ఎక్కువ. కాత్యాయనికి ఇహ సుఖాలపై మక్కువ మెండు. యాజ్ఞవల్క్యుడు సన్యాసం తీసుకోవాలని నిర్ణయించుకొని ఆస్తిపాస్తులను ఇద్దరు భార్యలకూ పంచి పెట్టాలనుకుంటాడు. కాని మైత్రేయికి ఇహసంపద మీద ఆసక్తి లేదు. అమరత్వాన్ని ప్రసాదించలేని యీ ధనకనకాలు, మేడలు, మిద్దెలు నా కెందుకని ఆమె భర్త దగ్గర పరతత్త్వాన్ని తెలుసుకునేందుకు తన అభిలాషను తెలియపరుస్తుంది. యాజ్ఞవల్క్యుడు ఆమె పారమార్థిక బుద్ధికి చాల ఆనందిస్తాడు.

ప్రాపంచికమైన అనురాగం నిజమైన అనురాగం కాదని, ఇతరుల మీది అనురాగానికి మూలం ఆత్మానురాగమేనని యాజ్ఞవల్క్యుడు తన భార్యకు బోధిస్తాడు. భార్యాభర్తలు ఒకరిమీద ఒకరికి ప్రేమవుండి ప్రేమించటం లేదు. ఎవరి ఆనందం వాళ్ళకు కావాలి. ఎవరి ప్రీతి వాళ్ళకు తీపి, దాంపత్య ప్రేమ వల్ల తనకు కలిగే ఆనందాన్ని పురస్కరించుకొనే భార్యాభర్తలు పరస్పరానురాగాన్ని నటిస్తారు. నిజమైన అనురాగం ఆత్మోన్ముఖంగా వుంటుంది. సంతానం, ధనం, విద్య, స్నేహితులు అందరి విషయం కూడా ఇంతే. ఆత్మసుఖం కోసమే ఏ వస్తువు మీదనయినా అనురాగం ఏర్పడుతుంది. కాబట్టి ఆత్మతత్త్వాన్ని అవగాహన చేసుకోవాలి, పరిశీలించాలి, పరికించాలి. ఆత్మను ఆత్మీయం చేసుకోవాలి.

మృదంగంలో నుంచి వచ్చే శబ్దాన్ని మనం పట్టుకోలేము. కాని మృదంగం వాయించటం మనచేతిలోనే వుంది. అలాగే వీణ వాయించటం మన చేతిలో వుంది. కాని ధ్వని మనకు పట్టుపడదు. కాబట్టి విషయ వాసనలను స్వాధీన పరచుకోవాలంటే వాటికి ఆలంబనమయిన ఇంద్రియాలను నిగ్రహించాలి. నీటికి సముద్రం అయనమయినట్టు స్పర్శకు చర్మం, వాసనకు నాసిక, రుచికి నాలుక, రూపానికి కళ్ళు, ధ్వనికి చెవులు, సంకల్పానికి మనస్సు, విద్యలకు హృదయం, చేతలకు చేతులు, చలనానికి చరణాలు, వేదాలకు వాక్కు ఆశ్రయం. స్థూల పదార్థాన్ని అంటిపట్టుకుండే సూక్ష్మ తత్త్వం పట్టుబడుతుంది. పంచభూతాలలో, సూర్యచంద్రుల్లో, సత్యధర్మాల్లో, మనిషి మనసులో, ఆత్మలో జీవిత మధువు

దాగివుంది. దృష్టి మధుమయమయితే సృష్టి మధురంగా కనిపిస్తుంది. నానారూపా త్మకమైన యీ ప్రపంచంలో తేజోమయంగా అమృతాయమానంగా ఆత్మతత్త్వం ప్రతి కణంలో తేనెలొలుకుతూ వుంటుంది. ఆ మధువును గ్రహించగలిగితే అమరత్వం సిద్ధిస్తుంది. ఆత్మ అజరామరం. అదే బ్రహ్మ. అదే జీవిత సర్వస్వం.

## 3

జనకమహారాజు గొప్ప యజ్ఞం చేశాడు. దానికి బ్రహ్మర్షులు, మహర్షులు, మునులు ఎందరో వచ్చారు. యజ్ఞం ముగిసిన తర్వాత రాజు బ్రహ్మవేత్తకు వెయ్యి ఆవులు ఇస్తానని వాగ్దానం చేస్తాడు. బ్రహ్మవేత్త ఎవరయినా సభలో వుంటే ముందుకు రమ్మని ఆహ్వానిస్తాడు. అప్పుడు యాజ్ఞవల్క్యుడు 'ఈ గోవులను మన యింటికి తోలుకొని వెళ్ళవలసింద'ని తన శిష్యుడికి చెప్తాడు. తన బ్రహ్మజ్ఞానాన్ని నిరూపించకుండా అలా గోవులు తోలుకొని వెళ్ళటం న్యాయం కాదని యజ్ఞం చేయించిన అశ్వలుడు సవాలు చేస్తాడు. 'బ్రహ్మవేత్త లకు నమస్కరిస్తాను. నాకు కావలసింది గోవులు మాత్రమే' నని యాజ్ఞ వల్క్యుడు చమత్కరిస్తాడు. దానితో బ్రహ్మజ్ఞానాన్ని గురించి ఆ సభలోవున్న పండితు లందరూ యాజ్ఞవల్క్యుణ్ణి పరిపరి విధాలుగా ప్రశ్నించి పరీక్షిస్తారు. అందరి ప్రశ్నలకూ సరియైన సమాధానం చెప్పిన యాజ్ఞవల్క్యుడు సభాసదు లను తాను ప్రశ్నిస్తాడు. ఆయన వేసిన ప్రశ్నలకు ఎవ్వరూ సమాధానం చెప్ప లేకపోతారు. దానితో ఆయన బ్రహ్మవేత్తల్లో శ్రేష్ఠుడని తేలిపోతుంది. ఈ ప్రశ్నించినవారిలో గార్గి అనే మహిళకూడా వుండటం ముదావహమయిన విషయం. ఈమె బ్రహ్మర్షిని రెండు సార్లు పరీక్ష చేస్తుంది. తల బిరుసుగా ప్రశ్నించిన శాకల్యుడు తలపగిలి చనిపోతాడు. చివరకు యాజ్ఞవల్క్యుడు జనకుని ఆస్థానంలో అద్వితీయ పండితుడిగా గౌరవం పొందుతాడు. ఈ సందర్భంలో పండితులు వేసిన ప్రశ్నలు. యాజ్ఞవల్క్యుడు వాటికి చెప్పిన సమాధానాలు చాలా ప్రబోధ కరంగా వుంటాయి. దీనిని ఒక విధంగా యాజ్ఞవల్క్య సంహిత లేక బృహదా రణ్యక దర్శనం అనవచ్చు.

మొట్టమొదట అశ్వలుడు మృత్యువును అధిగమించేందుకు మార్గమేమిటని అడుగుతాడు. 'వాక్కు' అని ముక్తసరిగా సమాధానం వస్తుంది. వాక్కే అగ్ని. అగ్ని ద్వారా అగ్ని సహాయంతో అగ్ని రూపంలోనే మృత్యువును అధిగమిం

చాలి. అదే ముక్తి. అదే అతిముక్తి. ఆ తర్వాత దివారాత్రాలను ఏ విధంగా అధిగమించటం అని అడిగితే ఆదిత్యోపాసనతో కళ్ళద్వారా రేయింబవళ్ళను దాటి అంతులేని వెలుగును స్వంతం చేసుకోవచ్చునని సమాధానం వస్తుంది. యజ్ఞ విద్యను గురించి ఋక్కు లెన్ని? ఆహుతులెన్ని? దేవతలెందరు? అని చాలా ప్రశ్నలు వేసిన అశ్వలుడు యాజ్ఞవల్క్యుని విజ్ఞానవివేకాలను ప్రశంసించి సభాముఖంగా ఆయన్ని అభినందిస్తాడు.

తర్వాత గ్రహాలను గురించి, అతిగ్రహాలను గురించి ఆర్తభాగు డడుగుతాడు. ప్రాణం, వాక్కు, జిహ్వ, కళ్ళు, చెవులు, మనస్సు, చేతులు, చర్మం- ఈ ఎనిమిదీ గ్రహాలని మహర్షి సమాధానం చెప్పి వీటికి అతిగ్రహాలను కూడా సూచిస్తాడు. ప్రాణానికి అపానం, వాక్కుకు నామం, జిహ్వకు రసం, కళ్ళకు రూపం, చెవులకు శబ్దం, మనస్సుకు కామం, చేతులకు చేతలు, చర్మానికి స్పర్శ అతిగ్రహాలని చెప్తాడు. "మృత్యువు అన్నింటిని ఆరగిస్తుంది. మరి మృత్యువును మింగేది ఎవరు?" అని మరో ప్రశ్న వస్తుంది. 'అగ్ని' అని సమాధానం లభిస్తుంది. మరణించిన మనిషి ప్రాణాలు దేనిలో కలుస్తాయంటే గాలిలో కలిసిపోతాయని ప్రత్యుత్తరం వస్తుంది. చివరకు మిగిలేది యేమిటంటే 'నామం' అంటాడు. నామం అనంతం. ప్రాణం వెళ్ళిపోతుంది. పేరు నిలిచిపోతుంది. వాక్కు అగ్నిలో, ప్రాణం గాలిలో, కళ్ళు సూర్యునిలో, మనస్సు చంద్రునిలో, చెవులు దిక్కుల్లో, శరీరం మట్టిలో, హృదయం ఆకాశంలో, కేశరాశి వనరాజిలో, రక్తవీర్యాలు జలంలో కలిసిపోయినప్పుడు జీవుడెక్కడికి వెళ్తాడని ఆర్తభాగుడు చివరి ప్రశ్న అడుగుతాడు. దీనికి యాజ్ఞవల్క్యుడు సభాముఖంగా సమాధానం చెప్పడు. ఏకాంతంగా లోపలికి తీసుకొని వెళ్ళి ఆర్తభాగుని ఆర్తిని తీరుస్తాడు. కర్మఫలం జీవపథాన్ని నిర్ణయిస్తుందని యిందులోని ఆంతర్యం.

యాజ్ఞవల్క్యుని ప్రశ్నించిన ఋషులలో గార్గికి ఒక ప్రత్యేకమైన స్థానం వుంది. స్త్రీ కావటమే కాక వేసిన ప్రశ్నలు కూడా చాలా సునిశితమైన-సున్నితమైన-ప్రశ్నలు. ప్రపంచ మంతా దేనితో ముడిపడి (ఓతప్రోతమై) వుందని చాలా చిన్న ప్రశ్నతో ఆమె ఆరంభిస్తుంది. 'నీటితో' అని మహర్షి అంటాడు. నీరు దేనితో ఓతప్రోతం? గాలితో. గాలి? అంతరిక్షం. అంతక్షం? గంధర్వలోకం. అది? ఆదిత్యలోకం. అది? చంద్రలోకం. అది? నక్షత్రలోకం. అది? దేవలోకం. అది? ఇంద్రలోకం. అది? ప్రజాపతిలోకం. అది? బ్రహ్మలోకం.

మరి బ్రహ్మలోకం దేనితో ఓతప్రోతం? అని అడిగే సరికి యాజ్ఞవల్క్యుడు నవ్వుతూనే 'అధిక ప్రశ్నలు వెయ్యకూడద'ని ఆమెను మందలిస్తాడు. అప్పటికి ఆమె శాంతిస్తుంది కాని కొంతసేపాగి ఉద్దాలకుడనే మరో ఋషి ప్రశ్నలు వేసిన తర్వాత మరోసారి లేచి గార్గి మరి రెండు ప్రశ్నలడుగుతుంది. దివికి పైన, భువికి క్రింద, దివిగా భువిగా ఉంటూ, భూత భవిష్య ద్వర్తమానాలను వెల యించే భూధాని దేనితో ఓతప్రోతమని అడుగుతుంది. మొదటి ప్రశ్నలోనే మూలాన్ని కదలించిందని గమనించి యాజ్ఞవల్క్యుడు ఒకే మాటలో 'ఆకా శంతో' అని సమాధానం చెప్తాడు. "మరి ఆకాశం దేనితో ఓతప్రోతం?" అని వెంటనే గార్గి తన రెండో ప్రశ్న విసరుతుంది. దానిని మహర్షి విసన కర్రగా గ్రహించి 'అక్షరంతో' అని ఒక్క అక్షరంలో చెప్తాడు.

అక్షరం లావుగా వుండదు, సన్నగా వుండదు, చిన్నది గాదు, పెద్దది గాదు. ఎర్రది కాదు, తరళం కాదు, నీడ కాదు, చీకటి కాదు, గాలి కాదు, ఆకాశం కాదు, అంటేది కాదు, రసం కాదు, మనస్సు కాదు, నేత్రం కాదు, శ్రోత్రం కాదు, వాక్కు కాదు, మనస్సు కాదు, తేజస్సు కాదు, ప్రాణం కాదు, నోరు కాదు, కొలమానం కాదు, లోభాగం కాదు, బాహ్యం కాదు, అది తినదు. దాని నెవ్వరూ తినలేరు ఇలాంటి అక్షరాన్ని అర్థం చేసుకోకుండా ఎన్ని యజ్ఞాలు చేసినా లాభం లేదు. అక్షరమే అఖిల ప్రపంచాన్ని శాసిస్తుంది. అక్షర తత్త్వాన్ని తెలుసుకున్నవాడే తత్త్వవేత్త, బ్రహ్మవేత్త.

ఉద్దాలకుడు ఆత్మ స్వరూపాన్ని గురించి ప్రశ్నిస్తాడు. ఇహ పరాలను కలిపే సంధిసూత్రం ఏమిటి? అంతర్యామి తత్త్వం ఏమిటి? వీటికి సమాధానం చెప్తూ మహర్షి 'వాయువే' ఇహ పరాలను కలిపే సూత్రం అంటాడు. పంచ భూతాలలో, సూర్యచంద్రుల్లో, భూర్భువ స్వర్లోకాల్లో, తమస్సులో, తేజస్సులో, సకల భూతాలలో, సర్వేంద్రియాలలో, సర్వాంతరంగంగా వ్యాపించి యున్నది ఆత్మ తత్త్వం. అది కనిపించదు, కాని అన్నిటినీ కంటుంది. వినిపించదు, కాని అన్నిటినీ వింటుంది. దానిని గురించి ఎవరికీ తెలియదు దాని కన్నీ తెలుసు. అది నశించదు. మిగిలినదంతా నశిస్తుంది.

చివర శాకల్యుడు ప్రశ్నల వర్షం కురిపిస్తాడు. దేవతలెంతమంది? ఎవరెవరు? వసువులెంతమంది? రుద్రులెంతమంది? వాళ్ళ మహిమలు ఎలాంటివి? అన్నింటికీ యాజ్ఞవల్క్యుడు తూచినట్టు సమాధానం చెప్తాడు. దేవతలు మూడు

వేలా మూడు వందల అరుగురు అని లెక్క తేలుతుంది. కాని శాకల్యుడు మళ్ళీ మళ్ళీ అదే ప్రశ్నవేస్తే యాజ్ఞవల్క్యుడు క్రమంగా ఈ సంఖ్యను తగ్గిస్తూ పోతాడు. 3306 నుంచి యీ సంఖ్య అమాంతంగా 33 కు దిగుతుంది. తర్వాత 6, 3, 2, 1½, 1 వరకు వస్తుంది. ఈ సంఖ్యలన్నీ నిజమేనా అని అనుమానం వేస్తుంది. అనుమానించిన శాకల్యుడికి ప్రతి సంఖ్యను గురించి వివరంగా సమాధానం లభిస్తుంది. 3,306 దేవతల మహిమలు. అసలు దేవతలు 33 మంది. ఇందులో ఎనిమిది మంది వసువులు, పదకొండు మంది రుద్రులు. పన్నెండు మంది ఆదిత్యులు. మరి యిద్దరు ఇంద్రుడు. ప్రజాపతి. ఆరుగురు దేవతలతోనే సరిపుచ్చుకోవాలంటే అగ్ని, పృథ్వి, వాయువు, అంతరిక్షం, ఆదిత్యుడు, ద్యులోకంతో తృప్తి పడవచ్చు. ముగ్గురు దేవతలనే ఆరాధించాలంటే మూడు లోకాలూ ముగ్గురు దేవతలవుతారు. ఇద్దరు దేవతలెవరంటే అన్నం, ప్రాణం- ఇద్దరు ప్రధాన దేవతలని తేలుతుంది. ఒకటిన్నర దేవత సంగతి ఏమిటంటే వాయువును అధ్యర్థం అంటారు. ప్రతి పదార్థంలో ఉన్నది, కాబట్టి దాన్ని అధ్యర్థం అంటారు. అధ్యర్థ మంటే ఒకటిన్నర. అందువల్ల వాయువు ఒకటిన్నర దేవత అవుతుంది. ఒకే ఒక దేవత ఎవరంటే ప్రాణం అని సమాధానం వస్తుంది. అదే బ్రహ్మ పదార్థం. అదే 'త్యత'. సత్యంలో పరభాగమయిన పరతత్త్వం. పరమాత్మ.

ఇన్ని ప్రశ్నలకు సమాధానం చెప్పినా శాకల్యుడు ఒక కుంటి ప్రశ్న వేస్తాడు. ప్రపంచానికి మూలాధారమయిన పరబ్రహ్మకు ఆధారమేమిటని ప్రశ్నిస్తాడు. దానితో అతని తల పగిలిపోతుంది. యాజ్ఞవల్క్యుడు బ్రహ్మవర్చస్సుతో సభకు అలంకారంగా నిలబడి సభాసదులను కొన్ని ప్రశ్నలడుగుతాడు. ఎవ్వరూ సమాధానం చెప్పలేకపోతారు. చివరకు తానే తన ప్రశ్నలకు సమాధానం చెప్తాడు. బంగారు పొదిగిన కొమ్ములతో వెయ్యి ఆవులు యాజ్ఞవల్క్యుని యిల్లు చేరుతాయి.

ఆ తర్వాత జనకుడు యాజ్ఞవల్క్యుని శుశ్రూష చేసి చాలా విషయాలు తెలుసుకుంటాడు. ప్రపంచమంతా బ్రహ్మ పదార్థంతో నిండియున్నదని యాజ్ఞవల్క్యుని సిద్ధాంతం. అదే ఆత్మరూపంలో సర్వాంతర్యామిగా వాక్కులో, ప్రాణంలో, కళ్ళల్లో, చెవుల్లో, మనస్సులో అంతటా కనిపిస్తుంది. జనక యాజ్ఞవల్క్యుల మధ్య ప్రశ్నోత్తర పద్ధతి విచిత్రంగా సాగుతుంది ఎవరు ఎవరిని అడుగు

తున్నారు. ఎవరు సమాధానం చెప్తున్నారు అనేది చెప్పేవాళ్ళకూ వినేవాళ్ళకూ కూడా తెలియని ఆత్మీయతతో ఈ తత్త్వ చింతన సాగుతుంది. మరణానంతరం జీవునిస్థితి యేమిటి - అనే విషయాన్ని గురించి యాజ్ఞవల్క్యుడు కూలంకషంగా వ్యాఖ్యానిస్తాడు. ఆదిత్యమండలంలో వున్న పురుషుడే కంటి వెలుగులో కూడా వున్నాడు. కుడి కన్ను ఎడమ కన్ను భార్యాభర్తలవలె జంటగా వుంటాయి. ఇంధ విరాట్టులని యీ దంపతులకు పేరు. వీళ్ళిద్దరు హృదయంలో కలుసుకుంటారు. హృదయంలోని ఎర్రని మాంసపిండం వాళ్ళకి ఆహారం. అది తిని అక్కడనే వాళ్ళు హాయిగా విశ్రమిస్తారు. అందువల్లనే నిద్రపోయే సమయంలో మనకు కళ్ళు మూత పడిపోతాయి. హృదయంలో నుంచి ఊర్ధ్వముఖంగా ఒక నాడి వెళ్తుంది. ఆ నాడి నుంచి యీ దంపతులు బయటికి వెళ్తారు. ఆ నాడి నుంచే వాళ్ళు సూక్ష్మ శరీరంలో ప్రవేశించి విహరిస్తారు. గాఢ నిద్రలో కూడా ఆత్మ ప్రకాశిస్తూనే వుంటుంది. ఈ వెలుగు సూర్యకాంతిలో భాగమే. సూర్యుడు కనిపించనప్పుడు చంద్రుడు, సూర్యచంద్రులు లేనప్పుడు అగ్ని, అగ్ని కూడా లేనప్పుడు వాక్కు, వాక్కుకూడా మౌనం వహించినప్పుడు ఆత్మ - ఈ వెలుగును వెల యిస్తుంది. ఆత్మ నిద్రించదు. గ్రహించదు, క్షీణించదు, ఆశించదు, పట్టుబడదు. అది స్వయంజ్యోతి. శరీరం విశ్రమించే సమయంలో ప్రాణాలకు శరీరాన్ని అప్పగించి ఆత్మ హిరణ్మయ రూపంలో గతంలోని కృతాన్ని శ్రుతాన్ని నెమరు వేసుకుని భావి శరీరాన్ని నిర్మిస్తూ వుంటుంది. మన కోరికలకు, వాసనలకు అనురూపమైన శరీరాన్ని ఆత్మ ముందుగానే సిద్ధపరచి వుంచుతుంది. ఈ శరీరం నశించగానే మరో శరీరానికి రూపకల్పన జరుగుతుంది. కాని ఆ శరీరం ఉండగానే ఆత్మతత్త్వం తెలుసుకున్న ఆత్మయోగులకు మరో శరీరం అక్కర లేదు. వాసనలు నశించిన వారికి వాసుదేవుడే శరణ్యం. అంతా తానని తెలుసు కున్న సర్వజ్ఞుడు తనలో తాను లీనమైపోతాడు. కామరహితుడైన ఆప్తకాముడు ఆత్మకాముడై ఆత్మయందే లయించిపోతాడు.

ఆత్మ కానిది ప్రపంచంలో లేదు. అంతా ఆత్మమయమే. చాక్షుష పురుషుడు చరమదశలో అంతర్ముఖుడై అంతరాత్మను చేరుకుంటాడు. తాను శరీరమనే భావమే అవిద్య. లేనిది ఉన్నదని, కానిది అనునని భావించ దం అవిద్యకు లక్షణం. అవిద్య కానిది విద్య, అవిద్య మృత్యువు. విద్య అమృతం. శరీరం క్షణ భంగురం. ఆత్మ శాశ్వతం. కాబట్టి శరీరం

అవిద్యకు మూలం. ఆత్మ విద్యకు మూలం. ఆత్మ అజరం, అమరం, అభయం. ఆత్మలాగా బ్రహ్మకూడా అభయం. రెంటినీ ఒకటిగా భావించిన బ్రహ్మవేత్త బ్రహ్మలోనే లీనమై పోతాడు.

బృహదారణ్యకంలో చెప్పిన తత్త్వాన్ని మూడు అక్షరాల్లో ముక్తసరిగా క్రోడీకరించవచ్చు. మూడు కూడా కాదు, ఒకే అక్షరం మూడు విధాలుగా అర్థమవుతుంది. అదే 'ద ద ద'— అన్న విచిత్రనాదం. 'ద' కారం దేవతలకు 'దమనం' గా బోధపడుతుంది. మానవులకు 'దానం' గా అర్థమవుతుంది. రాక్షసులకు 'దయ' గా వినిపిస్తుంది. కాబట్టి మూడు వర్గాలకు మూడు పద్ధతుల్లో ముక్తి మార్గాన్ని ప్రసాదించే 'ద' కారం సర్వదర్శన సారం అని బృహదారణ్యకం చివరి మాటగా చెప్తుంది. యజ్ఞ యాగాలు, జపాలు, తపాలు, ఉపాసనలు - అన్నీ యీ 'ద' కారంలోనే ఇమిడి వున్నాయి. దమనం, దానం, దయ - వీటికి మించిన పరమార్థం లేదు. మనలోనే వున్న ఆత్మ మనకు బోధపడనట్టే అతి సరళంగా కనిపిస్తున్న యీ మార్గం కూడా కనిపించినంత సులువు కాదు.

*''దుర్గం పథస్తత్ కవయో వదంతి''*



• చుట్టూరా ఆవరించుకుని వున్న చీకటిని తిట్టుకుంటూ కూర్చోవడం కంటె, ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా వెలిగించడం మంచిది •



# కోఽహం–సోఽహం

*వేదాహమేతం పురుషం మహాంతం*
*ఆదిత్య వర్ణం తమసః పరస్తాత్.*

—శ్వేతాశ్వతరం (3–8)

ఎంత చదివినా, ఎన్ని విన్నా, వేదాంత విజ్ఞానంలో ఎంతటి వైదుష్యం సంపాదించినా చివరకు 'నేనెవరిని?' అనే ప్రశ్న మిగిలిపోతుంది. పరమార్థ విచారణలో బహుశా ఇదే మొదటి ప్రశ్న. ఇదే చివరి ప్రశ్న కూడాను. ఈ ప్రశ్నకు సూటిగా సమాధానం 'శ్వేతాశ్వతరం' చెప్తుంది. "నాకు తెలుసు- ఈ మహాపురుషుడెవరో. అదిగో ఆ చీకటి లోకానికి ఆవలివైపు తరగని తరణి కాంతితో సహస్రకోటి కిరణాలను ప్రసరింపజేస్తూ ప్రాణానికి ప్రాణం పోస్తున్న పీయూషరాశి, అక్షయపోష నిధానం'' అని ధైర్యంతో విశ్వాసంతో చెప్ప గలిగింది శ్వేతాశ్వతరోపనిషత్తు.

శ్వేతాశ్వతరం కృష్ణ యజుర్వేదం లోనిది. పేరు చాలా విచిత్రంగా ఉంటుంది. అశ్వమంటే గుఱ్ఱం. గుఱ్ఱం చాలా వేగంగా పరుగెత్తుతుంది. అంత కంటె వడిగా పరిగెత్తేది వెలుగు. బహుశా మనస్సు తర్వాత ఇంత వేగంగా పయనించే మరో తత్త్వం లేదేమో! అందువల్లనే దీనిని అశ్వతమ మనకుండా అశ్వతరమనే అన్నారు. అశ్వతరాశ్వుడనే ఋషి పేరు బృహదారణ్యకంలో తటస్థిస్తుంది. ఆయన కుమారుడు ఆశ్వతరాశ్వి యాజ్ఞవల్క్యుని దగ్గర గాయత్రి ముఖాన్ని గురించి అడిగి తెలుసుకుంటారు. కాబట్టి అశ్వతరశబ్దం ఉపనిషత్తులకు క్రొత్త శబ్దం కాదు. అశ్వతరమంటే చాలా వడిగా ప్రసరించే వెలుగని అంగీక రిస్తే శ్వేతాశ్వరమంటే తెల్లని కాంతి అని తేలుతుంది. చీకటికి ఆవలివైపునవున్న కాంతిపుంజాన్ని పరమాత్మ స్వరూపంగా గుర్తించటమే శ్వేతాశ్వతరోపనిషత్తు చెప్పిన తత్త్వసారం. కాబట్టి యీ అర్థం సరిగానే అన్వయమవుతుంది. లేక అశ్వతరాశ్వుడనే ఋషి ఉన్నట్టే శ్వేతశ్వతరుడు కూడా ఉండి వుండవచ్చు. అసలు, ఉపనిషత్తులలోని ఋషుల పేర్లన్నీ సాంకేతికంగా కనిపిస్తాయి. అది

స్వతంత్రమయిన పరిశోధనకు సరిపోయే విషయం. మనకు కావలసింది సాధన, శోధన కాదు. చీకటి నుంచి వెలుగులోకి ఎలా వెళ్ళాలి అనేదే శ్వేతాశ్వతరం సాధించి మనకు ప్రసాదించిన జ్ఞానం.

"ఈ ప్రపంచానికి మూల కారణం ఏమిటి? ప్రాణికోటి ఎలా పుట్టింది? ఎలా జీవిస్తున్నది? మనం అనుభవించే కష్టసుఖాలకు కారణమేమిటి? ప్రపంచమంతా బ్రహ్మమయమని తెలిసినవాళ్లు చెప్తారు. ఆ బ్రహ్మ పదార్థం ఏమిటి?" ఇలాంటి ప్రశ్నలను గురించి బ్రహ్మపరులు తీవ్రంగా ఆలోచిస్తారు. ఈ విచారణతోనే ఉపనిషత్తు ఆరంభమవుతుంది. ఇది కేవలం కాల ప్రభావమా? పగలు, రాత్రి, ఎండ, వాన, వెలుగు, నీడ - వీటిలాగానే ప్రాణికోటి కూడా ప్రభవించి వర్థిల్లుతూ నశిస్తూ వుందా? లేక ఇది స్వభావసిద్ధమా? లేక ఇది యిలా జరిగి తీరాలని ఎవరయినా నిర్ణయించారా? లేక తీరూ, తెన్నూ లేకుండా ఏది యెప్పుడు ఎలా జరిగితే అలా జరిగిందని చూచి తలలూచవలసిందేనా? పోనీ, ఇవన్నీ కలిసి ప్రపంచాన్ని రచించాయనుకుందామా అంటే, వీటిలో దేనికీ స్వతంత్ర చైతన్యం లేదు. జీవాత్మ వల్లనే యీ సృష్టి జరుగుతున్నదనుకుంటే కష్టసుఖాలతో తికమకలవుతున్న యీ పార్థివ జీవిలో ఇంత సామర్థ్యం ఎక్కడ వుంటుంది?"

ఇలా ఆలోచించగా ఆలోచించగా ఆలోచనాపరులకు తమలో దాగివున్న ఒక దివ్యశక్తి గోచరించింది. జీవాత్మకు జీవం పోసి పోషించి లయింపజేసే దేవతాత్మ యీ శరీరంలోనే ప్రచ్ఛన్నంగా వున్నదని ధ్యానయోగం వల్ల వాళ్ళకు స్ఫురించింది. అదే సృష్టికీ, స్థితికీ, లయానికీ మూల కారణం. అది సంసార చక్రానికి కేంద్రం. దానిచుట్టూ సత్త్వరజస్తమోగుణాలతో, ఇంద్రియ సమూహంతో, పంచ భూతాలతో, పంచతన్మాత్రలతో ప్రకృతి తిరుగుతూ వుంటుంది. ఈ ప్రపంచం ఎడతెగని ప్రవాహం, జీవనది. ఈ జీవనది ప్రవహించని ప్రదేశం లేదు. ఇందులో ప్రతి జీవీ ప్రయాణం చేస్తున్నాడు. పడవలో పయనిస్తున్న పరమహంస దృష్టిదోషంవల్ల మాయామోహంవల్ల పడవ తానని భావిస్తున్నాడు. కాని నిలకడగా ఆలోచించి చూస్తే తానే పరమహంసనని తెలిసిపోతుంది.

వేదాలు, వేదాంగాలు చెప్పే పరబ్రహ్మతత్త్వం జీవి తన అంతరాత్మలో చూచుకోవాలి. నశ్వరమైన శరీరంలోని అవినశ్వరమైన ఆత్మతత్త్వాన్ని గుర్తిం

చిన తర్వాత జనన మరణాలు ఉండవు. కాని క్షరం, అక్షరం రెండూ ఒక దానితో ఒకటి పెనవేసుకొని ఉండటంవల్ల క్షీణించే పదార్థం నుంచి అక్షయమైన పరమార్థాన్ని వేరు చేసుకొని చూడటం సామాన్యులకు సాధ్యం కావటం లేదు. దీనికి మూడు మార్గాలున్నాయి—ధ్యానం, యోగం, జ్ఞానం. ఈ మూడు మార్గాల్లో నిశ్చలమైన నిష్ఠతో హృదయాకాశంలో వున్న ఆత్మతత్త్వం వైపు పయనిస్తే ఉపనిషద్ బ్రహ్మ సాక్షాత్కరిస్తుంది. అంతటితో సంసార బాధలు పోతాయి. ఆత్మసాయుజ్యం లభిస్తుంది.

కాష్ఠంలో నిప్పులా, నువ్వుల్లో నూనెలా, పెరుగులో వెన్నలా, పాలలో నెయ్యిలా శరీరంలో ఆత్మ ప్రతిష్ఠితమై వుంది. సాధన చేస్తేకాని తత్త్వం బయట పడదు. ప్రాణంలో ప్రాణంలాగా జీవాత్మలో దాగివున్న పరమాత్మ తత్త్వాన్ని ఆవిష్కరించుకునేందుకు ప్రణవం బాగా ఉపకరిస్తుంది. శరీరాన్ని ఒక కాష్ఠంగా, ప్రణవాన్ని మరో కాష్ఠంగా చేసుకొని ధ్యాన పద్ధతిలో మలస్తే లోపన దాగిన తేజస్సు బహిర్గతమవుతుంది. సత్యం, సంయమం, మననం ఈ సాధనలో సహ కరిస్తాయి.

ఆత్మ సాక్షాత్కారం ఒక్క నాటితో వచ్చేదికాదు. జీవిత పరమార్థం తెలుసుకోవాలనే అభిలాష ముందు ఏర్పడాలి. తెలుసుకొనే శక్తి అవకాశం తనకు ఉన్నదనే ధైర్యం రావాలి. విషయ వాసనలకు అతీతమైన అతీంద్రియ సుఖాన్ని అనుభవించగలగాలి. అన్నిటికి మించి పరమాత్మ అనుగ్రహం లభించాలి. ప్రపంచాన్నంతా పరంజ్యోతితో ప్రకాశింప జేసే పరమాత్మను 'నాకు కూడ కొంత కాంతిని ప్రసాదించవలసింద'ని త్రికరణ శుద్ధిగా ప్రార్థించాలి. అందరి మనస్సులో చేరి అందరి బుద్ధిని మేల్కొల్పే సర్వాంతర్యామి అనుగ్రహం కోసం సద్బుద్ధితో ప్రయత్నించాలి. అమృతమూర్తి అయిన అఖిలేశ్వరుడు అందరికీ తండ్రిలాంటి వాడు. అతని దివ్యసౌధంలో నివసించే మన మందరమూ ఆయన కన్నబిడ్డలం. మనం నోరు తెరిచి అడిగితే ఆయన కాదనడు. ఈశ్వరానుగ్రహం, సత్సంకల్పం, సంయమం, ధ్యానం ఆత్మ సాక్షాత్కారానికి కావలసిన సాధన సంపత్తి.

ప్రత్యక్ష దైవమైన ప్రభాకరుని కాంతిని మన కాయంలో స్థాపించు కోవాలి. ప్రణవనాదంతో ప్రాణంలోని తేజస్సును ఆవిష్కరించుకోవాలి. అగ్నిని

నియమ పూర్వకంగా ఆరాధించి, ప్రాణవాయువును నిరోధించి, నిగ్రహంతో నిష్ఠతో ధ్యాన యోగాన్ని సాధిస్తే అమృత కిరణుడు అమృతం కురిపిస్తాడు. మనస్సు నిర్మలంగా నిశ్చలంగా పరమాత్మను స్మరించగలుగుతుంది. చిత్తశుద్ధి, ఏకాగ్రత ధ్యాన సిద్ధికి చాలా అవసరం. శిరస్సు, మెడ, వక్షస్థలం—మూడూ సమంగా ఉన్నతంగా ఉండేట్టు స్థిరమైన ఆసనంలో కూర్చుంటే ధ్యానం సులభంగా కుదురుతుంది. మనస్సు చాలా చంచలమైనది కాబట్టి చెప్పిన మాట వినని గుఱ్ఱాన్ని అదుపులో పెట్టుకునేందుకు అశ్వికుడు (రౌతు) ప్రయత్నించినట్టే మనస్సును, ఇంద్రియాలను సాధకుడు స్వాధీనం చేసుకోవాలి. సమతలమైన ప్రదేశంలో పవిత్రమైన స్థానాన్ని ఏర్పరుచుకోవాలి. మట్టి పెళ్ళలు, గులకరాళ్ళు, అలజడి, సవ్వడి లేని ప్రశాంతమైన ప్రదేశంలో ఏకాగ్రత సులభంగా కుదురుతుంది. సాధన చేయగా చేయగా సిద్ధి సూచనలు క్రమంగా గోచరిస్తాయి. అగ్ని, వాయువు, సూర్యుడు, చంద్రుడు, స్ఫటికంలాంటివి కనిపించటం మంచి లక్షణం. మూలాధారం, స్వాధిష్ఠానం, మణిపూరం, అనాహతం, విశుద్ధి శరీరంలో ఆసన స్థానం నుండి కంఠం వరకు ఉండే అయిదు చక్రాలు. ఇవి యోగులకు మాత్రమే అనుభవానికి వస్తాయి. వీటిపైన ఫాల భాగంలో ఆజ్ఞా చక్రం ఉంటుంది. మూలాధారం నుండి విశుద్ధి చక్రం వరకు ఉన్న అయిదు చక్రాలు భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశం-అనే అయిదు తత్త్వాలకు ఆశ్రయ స్థానాలు. మూలాధారంలోని కుండలిని ఈ అయిదు చక్రాలను దాటగలిగితే అనేక సిద్ధులు లభిస్తాయి. ఆ సిద్ధులు లభించిన తర్వాత వ్యాధులు బాధించవు. ముసలితనం రాదు. తెలియకుండా మరణం కూడా రాదు. శరీరంలో యోగాగ్ని దేదీప్యమానంగా వెలుగుతూ వుంటుంది. శరీరం తేలికపడుతుంది. ఆరోగ్య లక్షణాలతో ముఖం కళకళలాడుతూ ఉంటుంది. వాక్కులో నిండుతనం వస్తుంది. దగ్గర కూర్చుంటే మంచి వాసన వస్తుంది. మలమూత్ర విసర్జన తక్కువగా ఉంటుంది. యోగ సాధన సక్రమమయిన మార్గంలో సాగుతున్నదనేందుకు ఇవి సూచనలు. మట్టి పట్టిన బంగారాన్ని కాని, రత్నాన్నిగాని శుభ్రంగా కడిగితే మాలిన్యం పోయి తళతళలాడుతూ మెరిసిననట్టుగా ఆత్మ సాక్షాత్కారం లభించిన తర్వాత జీవాత్మ స్వచ్ఛమైన తేజస్సుతో శోభిల్లుతూ ఉంటుంది. దీప కాంతిలో వస్తువులు స్పష్టంగా కనిపించినట్టు ఆత్మ

జ్యోతి ముందు బ్రహ్మతత్త్వం సుస్పష్టమవుతుంది. ప్రపంచమంతటా వ్యాపించిన పరబ్రహ్మ యోగికి తన హృదయాకాశంలోనే కనిపిస్తుంది. దానితో జరామరణ భయం పోయి అమరత్వం లభిస్తుంది.

సృష్టి స్థితిలయాలకు మూలకారణుడయిన సర్వేశ్వరుడు సర్వాంతర్యామి. అందరి నేత్రాలు ఆయన నేత్రాలు. అందరి ముఖాలు ఆయన ముఖం. అందరి బాహువులు ఆయన బాహుయుగం. అందరి పాదాలు ఆయన పదద్వయం. మనుష్యులకు బాహువులనూ, పక్షులకు రెక్కలనూ ప్రసాదించే పరమాత్మ అందరిలో చేరి అందరినీ పాలించి పోషిస్తూ వుంటాడు. పాపం సోకని రూపం ప్రపంచానికి ప్రకాశం ప్రసాదిస్తుంది. కైలాసపతి చేతిలోని పినాకం దుష్ట శక్తులను నష్టం చేసి మంచిని పెంచుతుంది. భువి నుంచి దివి వరకు మహా వృక్షంలా వ్యాపించిన మహాపురుషుడు అణువుకంటె సూక్ష్మమయినవాడు అందరి హృదయంలో నిత్యం నివసించే అంతరాత్మను చర్మచక్షువులతో చూడటం సాధ్యం కాదు. నిర్మల హృదయంలో నిశ్చలమైన మనస్సుతో అంగుష్ఠ పరిమాణంలో వున్న పురుషుణ్ణి భావించి సేవించాలి. చరాచర జగత్తులోని ప్రతి కణంలో సర్వేశ్వరుడు నివసిస్తాడు. అంతట కాళ్ళే, అంతటా చేతులే, అంతటా కళ్ళే, అంతటా చెవులే అన్నట్టు విశ్వమంతటా వ్యాపించిన విరాట్పురుషుడు కాళ్ళు లేకుండానే నడుస్తాడు, చేతులు లేకుండగానే పని చేస్తాడు, కళ్ళు లేకుండానే చూస్తాడు, చెవులు లేకుండానే వింటాడు. ఆతనికి అందరూ తెలుసు. అతన్ని తెలిసిన వాళ్ళు ఎవ్వరూ లేరు. అతని అనుగ్రహం వల్లనే అతని ఆంతర్యం తెలుసుకోవటం సాధ్యమవుతుంది. అంతకు మించి మార్గం లేదు.

ఆ పరమేశ్వరుడే సృష్టికి ఆది. అగ్ని వాయువులు, సూర్యచంద్రులు, నక్షత్రాలు, ప్రజాపతి, బ్రహ్మ-అందరూ ఈ ఆది తత్త్వంలోనే అంతర్గతులై వున్నారు. పరమాత్మకు లింగభేదం లేదు. పురుష భావంతో చూస్తే పురుషుడు. స్త్రీ భావంతో చూస్తే స్త్రీ. పసిపిల్లవాడిగా చూస్తే పసిపాప అవుతాడు. ప్రతి జీవి హృదయంలో ఆయా రూపాలకు అనురూపంగా తోడు నీడగా వున్నా మాయవల్ల జీవుడు తన చెంతనున్న బ్రహ్మపదార్థాన్ని గుర్తించలేడు. ఒకే చెట్టు మీద రెండు పక్షుల్లా జీవుడు, బ్రహ్మ ఉన్నారట. కాని ఒక పక్షి తియ్యని పండ్లు తింటూ వుంటుంది. రెండవ పక్షి చూస్తూ వుంటుందట. అలాగే జీవాత్మ కర్మఫలాన్ని

అనుభవిస్తూ వుంటుంది. పరమాత్మ ఉపద్రష్టగా ఉంటుంది. రెంటికి మధ్యనున్న మాయ విడిపోతే జీవ బ్రహ్మ సమైక్యం కుదురుతుంది. మాయ చెప్పినట్టు మనిషి చేస్తాడు. బ్రహ్మ చెప్పినట్టు మాయ చేస్తుంది. ఏ విధంగానయినా సరే ఈ మాయ తొలిగి జీవధానిలో దేహధారియై తిరుగుతున్న పురుషుడు తానే ఆదిత్య మండలంలోని జ్యోతిర్మయ పురుషుణ్ణని గుర్తిస్తేనే కాని భవబంధం తొలగి ముక్తి లభించదు.

చీకటి వెలుగులకు, రేయింబవళ్ళకు అతీతమైన ఏకాంత కాంతి మండలం పరమాత్మకు నివాస స్థానం. అది మన హృదయంలో కూడా వుంది. ఆ కాంతి వలయాన్ని చూచి అందులో లయించి పరవశించే మహద్భాగ్యం మనకు ఎప్పుడు కలుగుతుందా అని అనుక్షణం ఎదురు చూస్తూ వుండాలి. విద్య ప్రక్కనే అవిద్య కూడా వుంది. వెలుగునీడనే చీకటి కూడా వుంటుంది. వెలుగు లేని చోటు లేనట్టే నీడలేని చోటు కూడా లేదు. ఈ నలుపు తెలుపుల రూపు మాపేందుకు అంగుష్ఠ మాత్ర పురుషుని అనుగ్రహం కావాలి. అప్పుడంతా ఎరుపుగా మారుతుంది. పరతత్త్వం తన అరుణారుణ కాంతి రేఖలతో దివినీ భువినీ అనురాగమయం చేస్తుంది ఇది రాగద్వేషాలకు అతీతమైన విశ్వబంధుత్వం. సూర్య చంద్రుల కాంతికూడా ఈ తేజస్సుముందు పేలవంగా ఉంటుంది. ఈ కాంతిని ఏకాంతంగా తన అంతరాంతరాల్లో చూడగలిగినవాడే తన్ను తాను తెలుసుకున్న ఆత్మయోగి అనిపించుకుంటాడు. అస్థి చర్మమయమైన దేహానికి అతీతమైన దేహిని నేను, ఆత్మను నేను, పరమాత్మను నేను, పరబ్రహ్మను నేను, అంతా నేనే, నేనే అంటటా వ్యాపించివున్నానని అలాంటి ఆత్మవంతుడే అనగలడు.

"యోఽసా వసౌ పురుషః సోఽహమస్మి"—

అనే భావమే జీవిత పరమావధి.



# శాంతి పాఠం

ఓం పూర్ణమదః పూర్ణమిదం పూర్ణాత్ పూర్ణముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ పూర్ణమేవావశిష్యతే.
ఓం శాంతిః శాంతిః శాంతిః

*

ఓం ఆప్యాయంతు మమాంగాని వాక్ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బల మింద్రియాణి చ సర్వాణి సర్వం బ్రహ్మోపనిషదం మాహం బ్రహ్మ నిరాకుర్యాం మా మా బ్రహ్మ నిరాకరోత్, అనిరాకరణమస్త్వ నిరాకరణం మేఽస్తు. తదాత్మని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయిసంతు, తే మయిసంతు.

ఓం శాంతిః శాంతిః శాంతిః

*

ఓం సహనా వవతు, సహ నౌ భునక్తు, సహ వీర్యం కరవావహై, తేజస్వినావధీతమస్తు, మావిద్విషావహై.

ఓం శాంతిః శాంతిః శాంతిః

*

ఓం భద్రం కర్ణేభిః శ్రుణుయామదేవా
భద్రం పశ్యేమాక్షభిర్యజత్రాః
స్థిరై రంగై స్తుష్టువాం స స్తనూభి
ర్వ్యశేమ దేవహితం యదాయుః
స్వస్తి న ఇంద్రో వృద్ధశ్రవాః
స్వస్తినః పూషా విశ్వవేదాః
స్వస్తి న స్తార్క్ష్యో అరిష్టనేమిః
స్వస్తి నో బృహస్పతిర్దధాతు.
ఓం శాంతిః శాంతిః శాంతిః

*

## శాంతిపాఠం - తెలుగు రూపాంతరం

అదియు పూర్ణము—ఇదియు పూర్ణము
పూర్ణమున ఉదయించు పూర్ణము
పూర్ణమున పూర్ణంబు పోయిన
పూర్ణమే శేషించి యుండును.

*

ఆప్యాయంబుగ కూడవలయునను
కనులు చెవులు పలుకులు ప్రాణంబులు
సకలేంద్రియములు సకల శక్తి సకలంబు
బ్రహ్మమయమౌపనిషదమిది
నేనెన్నడను విడనాడను బ్రహ్మను
బ్రహ్మ నన్ను విడనాడ దెన్నడును
విడనేను, విడనాడరాదు నను
ఆత్మతత్త్వ మనవరతము నామది
నెలకొల్పుచు నెలకొనవలె నిత్యము
నెలకొనవలె నుపనిషత్సూక్తులు

*

కలిసి మెలసి తిరుగుదాం కలిసి మెలసి పెరుగుదాం
కలిసి మెలసి కలిమి చెలిమి బలము గుణము పెంచుదాం
కలిసి మెలసి తెలిసికొన్న తెలివిని వెలయించుదాం
కలిసి మెలసి కలత లేక చెలిమి మీర మెలగుదాం
శాంతి శాంతి శాంతి యనుచు శాంతి గీతి పాడుదాం
ఓంకారం ఓంకారం ఓంకారం పలుకుదాం .........

*

మంగళకర మధురసధుని వినవలె
కనుగొనవలెయజనమున మంగళము
పటుతరముగ కరచరణ కరణముల
సుర హితముగ మనవలె నియతమ్ముగ

సకలము విను సురపతికి నమస్కృతి
సకల మెరుగు పూషునకు నమస్కృతి
సంకటములు తొలగించు గరుడునకు
సుమతినొసగు వాక్పతికి నమస్కృతి.

*

ఓం వాఙ్మే మనసి ప్రతిష్ఠితా, మనో మే వాచి ప్రతిష్ఠితమ్, ఆవి రావీర్మ ఏధి, వేదస్య మ ఆణీస్థః శ్రుతం మే మా ప్రహాసీః, అనే నాధీతేనాహోరాత్రాన్సందధామి, ఋతం వదిష్యామి, సత్యం వదిష్యామి, తన్మామవతు, తద్వక్తార మవతు అవతు మా మవతు వక్తార మవతు వక్తారమ్.

ఓం శాంతిః శాంతిః శాంతిః

*

ఓం శంనో మిత్రః శం వరుణః, శంనో భవత్వర్యమా, శం న ఇంద్రో బృహస్పతిః, శంనో విష్ణు రురుక్రమః నమో బ్రహ్మణే, నమస్తే వాయో, త్వమేవ ప్రత్యక్షం బ్రహ్మాసి. త్వామేవ ప్రత్యక్షం బ్రహ్మ వదిష్యామి, ఋతం వదిష్యామి, సత్యం వదిష్యామి, తన్మా మవతు, తద్వక్తారమవతు, అవతు మా మవతు వక్తారమ్.

ఓం శాంతిః శాంతిః శాంతిః

* * *

ఓం కారము వాఙ్మయమయి నెలకొనవలె నా మనమున
మనసుకూడ వాఙ్మయమయి నెలకొనవలె నా పలుకున
తరలి రమ్మ నను చేరగ తెమ్మ వేదనవనీతము
విన్నది నను విడనాడక పవలు రేయి కలుపనిమ్మ
పలికిన నను బ్రోవవలయు పలికించిన వాని బ్రోచి
పలికి పలుకరించిన మము బ్రోచుత మా వాఙ్మనములు

*

మిత్ర వరుణ దేవతలకు మేలగు జయ మంగళమగు
ప్రాణమున కపానమునకు పవలు రేయి మంగళమగు
అర్యమేంద్ర వాక్పతులకు అహరహంబు మంగళమగు
దృష్టికి భుజపుష్టికి పద సృష్టికి జయ మంగళమగు

విషువత్ ప్రభవిష్ణు జిష్ణు విష్ణువునకు మంగళమగు
దేవతాధిపతి బ్రహ్మకు దివ్యమధుర వాయువులకు
ప్రణతి వినత నమస్కృతులు ప్రత్యక్ష బ్రహ్మనిధికి
ఋతము సత్యమనుకొని నిను ఋతము సత్యమును పలికితి
పలికిన నను బ్రోచినావు పలికించిన పలుకు మెచ్చి
సత్య కాంతి నిరతుల కిల నిత్యము జయ మంగళమగు *
మంగళమ్-మహత్



# యువభారతి సాహితీమిత్ర పథకం

యువభారతి తన కృషిలో పాలు పంచుకొనే మిత్రుల కోసం ఎదురుచూస్తున్నది. సాహితీ మిత్రులుగా చేరి, సాహిత్యోద్యమ నిర్వహణలో బరువు బాధ్యతలు పంచుకొనే సహృదయుల సహకారం ఆకాంక్షిస్తున్నది. యువభారతితో సర్వదా సాహితీబాంధవ్యాన్ని పటిష్టం చేసుకోవాలనేదే సాహితీమిత్ర పథకధ్యేయం.

కేవలం రూ.10/-లతోనే సాహితీ మిత్రులుగా చేరండి.

మీ సాహితీ స్నేహాన్ని అందించండి.




తెలుగు ఎదలో తెలుగుతనం
వెల్లువలా పారాలని
తెలుగింటిలో తెలుగుదీపం
అఖండంగా వెలగాలని
ఈ జాతి నిద్రలేచి
మహోన్నత మానవాదర్శాల వైపు
నిరంతర కృషితో
పయనం కొనసాగించాలనే ధ్యేయంతో
ఉడుతాభక్తిగా యువభారతి కృషి చేస్తున్నది
భాషాభిమానం కలగాలంటే
మాతృభాషా సాహిత్య పఠనమే
ప్రథమ కర్తవ్యం అనే భావం
బలంగా మనసులో నాటుకోవడానికి గాను
వీలైనంత ఎక్కువ మందికి వీలైనంత తక్కువ వెలకు
ఉత్తమ సాహిత్యం అందించేందుకు
యువభారతి పూనుకున్నది
ప్రతి తెలుగింటిలో
కనీసం పదయినా తెలుగు పుస్తకాలు ఉండేందుకు
మనందరం ఉద్యమ వేగంతో కృషిచేద్దాం
ఆ పదిమంచి పుస్తకాలలో ఏ ఒక్కటిగానైనా
యువభారతి ప్రచురణ ఏ ఒక్కటైనా
ఉండాలనే ధ్యేయంతో కృషిచేద్దాం

# యువభారతి

సాహితీ, సాంస్కృతిక సంస్థ
5, కింగ్స్‌వే, సికిందరాబాదు-3



మా తెలుగు తల్లికి మల్లెపూదండ
మా కన్నతల్లికి మంగళారతులు
కడుపులో బంగారు, కనుచూపులో కరుణ
చిరునవ్వులో సిరులు దొరలించు మా తల్లి

గలగలా గోదారి కదలిపోతుంటేను
బిరబిరా కృష్ణమ్మ పరుగువిడుతుంటేను
బంగారు పంటలే పండుతాయి
మురిపాల ముత్యాలు దొరలుతాయి

అమరావతీ నగరి అపురూప శిల్పాలు
త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు
తిక్కయ్య కలములో తియ్యందనాలు
నిత్యమై, నిఖిలమై నిలిచియుండేదాక

రుద్రమ్మ భుజశక్తి, మల్లమ్మ పతిభక్తి
తిమ్మరుసు ధీయుక్తి, కృష్ణరాయల కీర్తి
మా చెవుల రింగుమని మారుమ్రోగేదాక
నీ పాటలే పాడుతాం నీ ఆటలే ఆడుతాం
జై తెలుగుతల్లీ, జై తెలుగుతల్లీ

— శంకరంబాడి సుందరాచార్య

Cover Printed at Sri Balaji Art Printers, Chikkadpally, Hyd-20.